శా. తోఁడంబుట్టువుపాటు సూచి యలుకన్ దుర్వారశుంభద్గతిన్
హైడింబుండు మహాసురేంద్రులు గజేంద్రారూఢులై సంగర
క్రీడాలోలతఁ దన్ను మీఱి విలయాగ్నిం బోల దిక్చక్ర మ
ల్లాడన్ బెట్టుగ నార్చి చొచ్చె గురుసైన్యంబున్ మహోగ్రంబుగన్. 107

చ. కరమున నున్న శూలమునఁ గ్రమ్ము మెఱుంగులు శత్రుసైన్యభీ
కరములుగా గజాశ్వభటకాయముల్ గుది గ్రుచ్చినట్లుగాఁ
జెనువుచు వచ్చువానిఁ గురుసింహుఁడు సూచి మదాంధసింధురో
త్కరరభసాతిభీషణముగాఁ గవిసెం బటువిక్రమోద్ధతిన్. 103

క. వంగాధిపతియు శౌర్యో, త్తుంగతనుం డగుచు నీసుతుం డలరఁగ దై
త్యుం గదిసె గాఢమదమా, తంగఘటలతోడ నపుడు దారుణభంగిన్. 109

వ. ఇట్లు దన్ను బెట్టు గిట్టినకరినికరంబులం గని పొంగి కరవాలంబు గొని యడరి ఘటోత్కచుండు. 110

క. కరదంతకర్ణమస్తక, చరణము లని తోఁపకుండుచందముగా ని
ష్ఠురవిక్రమకేలీవి, స్ఫురణంబున రూపు మాపె సురలు నుతింపన్. 111

వ. ఇవ్విధంబున గజంబులు వ్రాలిసిన గజపురనాథుండు రోషంబున నురవడించి నారాచవృష్టి ముంచి వేగవంతుండును విద్యుజ్జిహ్వుండును బహ్వాశియు ననుదనుజప్రధాననాయకు[1]లం బ్రేతపతిపురంబున [2]కనిచి యాభీమసేనతనయుతనువున నిశాతశరములు నించినం గోదండపాణి యై క్రోధాగ్ని జ్వాలలు నిగుడువడువునఁ బటుబాణజ్వాలలు నిగిడించి కదిసి కురుపతి నవలోకించి యతండు. 112

ఉ. పాడియు సత్యముం గలుగుపాండవకోటికి నీవు దొల్లి యె
ప్పాడిమెయిన్ సభం గరము భంగ మొనర్చితి నాఁటియందఱుం
జూడఁగ నేఁడు తత్ఫలము సూపెద నీ కని మూదలించి మై
నాడఁగ నేసెఁ గృష్ణభుజగావలిఁ బోలిననారసంబులన్. 113

క. దానికిఁ జల మెడలక నీ, సూనుం డాపవనసూనుసూనునిమేనం
దా నుగ్రశరము లిరువది, యేను వెసం గీలుగొలిపె నిభపురనాథా 114

తే. అసుర గినిసి కృతాంతజిహ్వయునుబోని, శక్తి యెత్తిన సమ్మహీశ్వరున కపుడు
వంగపతి యడ్డపడుటయు వానిగజముఁ, గూలవైచిన నాతండు నేలకుఱికె. 115

క. ఏనుంగు వడిన నచ్చటి, సేనలు దెరలుటయు రాజసింహుఁడు దన్నుం
దాన పురికొల్పికొని పెఱ, పూనిక దానవునియెదుర నొక్కఁడ నిలిచెన్. 116

క. నిలిచి మహాస్త్రం బెఱమం, టలు గ్రమ్మఁగఁ బెలుచ నేయుటయు నడుమన చె
క్కలు గాఁగ నేసి దిక్కులు, నలిగులిగా నతఁడు సింహానాదము సేసెన్. 117

వ. ఇట్లు సేసిన విని గాంగేయుండు గురుపక్షయోధవీరులం గలయం గనుంగొని.

---

1. దే కంబునఁ గదిసిన వారిం బ్రేతపతిపురంబున కనచి రణప్రారంభంబునం గదిసి యాభీమ.

క. భీమునితనయుం డత్యు,ద్దామగతిఁ రాజుఁ దొడరి తత్కరటిఘటా
స్తోమంబు గూల్చి యాతని, పై మారి మసంగినట్లు బలువిడిఁ గవిసెన్. 119

వ. ఆఘటోత్కచుండు దివిజులకు నజయ్యుండు మీరు వేవేగ రారాజుంగాడికొనుం డనిన సేనాపతిపలుకులకు గురుకృపాశ్వత్థామచిత్రసేనులు బృహద్బలబాహ్లీకావంతీనాథభూరిశ్రవసులును సైంధవసోమదత్తవివింశతివికర్ణులు నేకోద్యోగం బునం దమతమయనుచరు లైనయోధవీరసహస్రంబులతో రథంబులు దోలికొని చని భవత్తనయుం బరివేష్టించి హిడింబాతనయుం దాఁకిన నతండును దైతేయబలంబులం గొని బలిమి మెఱసి నిలిచి మార్కొనియె నారెండుసైన్యంబులు నొండొంటి కెదిర్చి పేర్చి పెనంగు చుండ నాభీమసేననందనుం డాచార్యప్రభృతు లగునాపన్నిద్దఱపై బహుప్రకారక్రూరబాణంబులు వరఁగింప నందు. 120

ఘటోత్కచుండు ద్రోణాచార్యప్రభృతులతో యుద్ధంబు సేయుట.

క. కొందఱసూతులు వాలిసిరి, కొందఱచాపములు దునిసెఁ గొందఱచటుల
స్యందనహయాలి వడియెను,గొందఱయంగములు వ్రస్సెఁ గురుకులముఖ్యా. 121

వ. ఇట్లతిరథమహారథులం జిక్కుపఱచినరక్కసున కలిగి రయంబున సాధనంబులు సమకట్టికొని రభసంబున నాకుంభసంభవాదిద్వాదశరథికవరులు నొక్కపెట్ట చుట్టు ముట్టి మహాస్త్రజ్వాలాజాలంబులం బొదివిన. 122

ఆ. ఓర్వ రాక దానవోత్తముఁ డంబర,వీథి కెగసి పోయి విపులరవము
సెలఁగఁ బెలుచ నడరి జీమూతభంగి దు, ర్దాంతుఁ డైనఁజూచి ధర్మసుతుఁడు. 123

వ. భీమసేనుతో ని ట్లనియె నిక్కడ భీష్ముబారిం బడినపాంచాలబలంబులఁ బరిపాలింపను నక్కడ నాచార్యాదుల కగపడ్డఘటోత్కచుం గావను వలసి యున్న యది యివ్వలనికిం గవ్వడి గలం డవ్వలనికి వేగంబ యరుగుమనిన సింహనాదంబు సేయుచు. 124

క కౌరవబలములు సుడివడ, మారుతి గవియుటయు మెఱసి మార్కొని కురుధాత్రీరమణుఁ డర్ధచంద్రా,కారశరము దొడిగి ధనువు గ్రక్కునఁ దునిమెన్. 125

తే. తునిమి తోడన క్రొవ్వాఁడిదొడ్డనారసంబు భీమునివక్షస్థ్సలంబు ఛ్రూఱ
నేయుటయు సోలఁ గని ద్రౌపదేయు లడరఁ
గడఁగె సౌభద్రుఁడును ఘటోత్కచుఁడుఁ గలసె. 126

వ. ఇట్లు దండ్రి నొచ్చినఁ బాండుపౌత్త్రులు నీపుత్త్రునిపై నొక్కపెట్టమిక్కుటం బగు కోపంబునం గవిసిన. 127

చ. కని కృపబాహ్లికాదిరథికప్రకరంబు గడంగి వారి మా
ర్కొని పెనఁగంగఁ దేఱి కడుఁ గ్రూరత నేచినమారుతాత్మజుం

జెనసి గురుండు రక్తపరిషిక్తునిఁ జేసిన నాతఁ డల్గి యా
తని నొకనారసంబున నుదగ్రత మూర్ఛ మునుంగ నేసినన్. 128

మ. ధనురాచార్యునిఁ జూచి తత్తనయుఁడున్ ధాత్రీశుఁడున్ భీము మా
ర్కొని రాతం డెలనవ్వు చెన్నుగ గదాఘోరాకృతిం దేరు డి
గ్గినయాలోనన తేఱి ద్రోణుఁడు గడంగెం జూచి తోడై కృపా
దినికాయంబుఁ గడంగి వాయుసుతుపైఁ దీవ్రాస్త్రముల్ నింపఁగన్. 129

క. ఏపున హిడింబసుతుఁడును, ద్రౌపదిపుత్త్రులు సుభద్రతనయుఁడుఁ గోపో
ద్దీపితు లై వారలయాటోపముఁ గుదియించి రతిపటుప్రదరములన్. 130

వ. అప్పు డనూపభూపాలుండును భీమసేనసఖిత్వలోలుండు నగునీలుండు నశ్వ
త్థామం దొడరి నొచ్చినం గని ఘటోత్కచుండు. 131

క. తలపడి యగ్గురునందనుఁ, జలమున నొప్పింప గురుఁడు సరభసముగ ను
జ్జ్వలబాణావృతుఁ జేసిన, బల మఱి దనుజుండు మాయఁ బన్నెఁ గుపితుఁ డై.

వ. ఇవ్విధంబున హిడింబాసూనుండు నేసినమాయం జేసి. 133

క. గురుఁడు మొద లైనయాపన్నిరువురుఁ గురుపతియు నొవ్వ నేటులఁ బడి నె
త్తురు దొరఁగ సోలి సంగరధరణిం బడినట్లు దోఁచెఁ దత్సేనలకున్. 134

చ. కనుఁగొని సైన్యముల్ విఱిగి క్రందుకొనన్ వెసఁ బాఱ నాపగా
తనయుఁడు సేన నాఁగి యివి దైత్యులమాయలు గాని బొంకు బొం
కని యెలుఁగెత్తి చెప్పఁగ భయంబున నమ్మక పోయె నట్లు వో
యినఁ జనుదెంచెఁ గౌరవమహీశుఁడు దీనత భీష్ముపాలికిన్. 135

వ. వచ్చి యి ట్లనియె. 136

క. నీవును ద్రోణుఁడుఁ గలుగం, గా వైరులచేత నేను గష్టపడితిఁ గా
దే వారితోడఁ దలపడి, చా వొందెను విజయ మొండె సంపాదింతున్. 137

చ. అన విని నవ్వి పాండవులయంతటివారికిఁ గాక నీకు మా
ర్కొన నగు నయ్య [1]యిప్పుడును కుత్సితవర్తన మిట్టిదుస్తరం
బునఁ దగులావు సేయ మముబోఁటులు లేరె చలంబు డింపు మీ
వని పలితోడఁ జెప్పి సరిదాత్మజుఁ డప్పుడు ప్రాభవంబునన్. 138

వ. భగదత్తు నాలోకించి. 139

క. దనుజు లొనరించుమాయలు, నినుఁ జేరవు వారి గెలుతు నీ విప్పుడ యీ
జనపతి మెచ్చఁగ నాదైత్యుని గెలువుము నీదుసేనతో నడరి వడిన్. 140

వ. అని భీష్ముండు పలికినం బ్రాగ్జ్యోతిషపతి మేటిమగండు గావున నమ్మాటకుం బొంగి
సింగం బడరినచందంబున నార్చి సుప్రతీకంబు నెక్కి సేనాసమేతుం డై. 141

1 యిప్పుడుచు కుత్సిత.

తే. పరఁగి తోఁతెంచుపాండవబలముమీఁదఁ
గవియుటయు నంతఁ నంతఁ గౌరవులమూఁక
మరలి యేర్పడఁ జూచి యమ్మాట యపుడు
నిజముగాఁ గొని యాజికి నిగిడె మగుడ. 142

వ ఇట్లుభయసైన్యంబులుం దలపడినసందడికయ్యంబున నపరాహ్ణం బగుచునుండ. 143

క. నగపతియుఁ బోనిగజపతిఁ, దగ నేడ్తెఱ నెక్కి ప్రబలదైత్యబలముతోఁ
నిగుడఁగ ఘటోత్కచుం డా, భగదత్తునిమీఁదఁ గవిసెఁ బార్థివముఖ్యా. 144

వ. తదవసరంబున వృకోదరుం డరదంబురయంబు మెఱయ నయ్యభిమన్యుద్రౌపదేయ
ప్రముఖులుం దానును హైడింబునకుం దోడై కడంగ నట్టియెడ. 145

ఆ. పొదివి పలువు రేయఁ బొడువ వ్రేయఁగ భగ,దత్తుదంతిరక్తధార లొప్పెఁ
జెలువు రెట్టి గాఁగ జేఁగుఱుసెలయేఱు, లున్నతాచలమున నురులునట్లు. 146

క శూలంబున హైడింబుఁడు, గాలాకృతితోడ వైవఁ గా నది పొడియై
రాలెడునట్లుగ మగఁటిమి, వ్రాలినభగదత్తుఁ డేసె వడి భల్లమునన్. 147

వ. ఇట్లేసి యార్చి వెండియు. 148

ఆ. భీముహరులఁ గూల్చి పేర్చి సౌభద్రాది, యోధవరుల నెల్ల నుఱక తఱుచు
టంపవానఁ దడిపి హయరథభటసమూ,హంబుఁ జంపె సమదహస్తిఁ బఱపి. 149

క. మందరము మహాంభోనిధి, యందుఁ దిరుగునట్లు పాండవానీకములో
నం దిరిగి సుప్రతీక మ,మందగతిం జంపెఁ బెక్కుమాతంగములన్. 150

క. అలిగి దశార్ణాధీశుఁడు, గొలిపెను భగదత్తుమీఁదఁ గ్రూరగజము ను
జ్జ్వలము లగునతనితోమర,ములతాఁకున నది చలించి మొగతిరిగె వెసన్. 151

వ. ఇవ్విధంబునం బోరుభగదత్తుం గనుంగొని గండు మిగిలికురువిభుండు గురు
కృపాదియోధవీరసమేతంబుగాఁ దఱిమినం దమబలంబులు గోలాహలబహుళంబు
లగుటయుఁ బాండవాగ్రజుండు పార్థపాంచాలపురస్సరుండై యవ్వలనికిం
గ్రొవ్వలరం గోల్తల నేసె నట్టిసమయంబున. 152

అర్జునుఁ డిరావంతునిచచ్చుట భీమునిచే విని దుఃఖించుట.

క. నరుఁడు ధనుర్గుణరావ,స్ఫురణంబును దేవదత్తభూరిరవము నం
బరము పగిలింప నానా,శరములఁ గురుసైన్యసరభసత్వం బుడిపెన్. 153

ఆ. అపుడు నేరి భీముఁ డతనికి భుజగేంద్ర
కన్యకాసుతుండు గలనఁ బడుట
నల్లఁ జెప్పుటయును నడలి యొచ్చుట నని
యడిగి యతఁడు సూప నచటి కరిగి. 154

వ. దనుజఖండితుం డయిపడి యున్న యయ్యిరావంతుశరీరంబు గనుంగొని యా ధనంజయుండు. * 155

చ. ఘనతరశోకవేగమునఁ గన్నుల నీళులు నించి యాసురయో
ధనునవినీతియుం బిదప ధర్మతనూజుఁడు సంధి గోరి ప
ల్కినతగవుం గడంగి యసికిం దలకొన్న నిజోద్యమంబుఁ దోఁ
చిన మదిఁ దిట్టుచుం గవినుతి సేయుచు రోయుచు నుండె నయ్యెడన్. 156

వ. ఇట్లు పుత్రశోకానలసంతప్తచిత్తుం డగుసవ్యసాచిం జూచి గోవిందుండు మంద స్మితంబు సేసిన. 157

క. కని యతఁడు దెలిసి నీచే, వినినది యిది మున్న దీని విడిచితి నహీభం
జన తేరు నడపు గురుబల, వినిపాతనపాటవమున విహరించుటకున్. 158

వ. అని పలికినం బద్మనాభుండు రథంబు రయంబున మనమొనపయిం బఱపం బార్థుండు పటుబాణపరంపరలు వఱఁగింప భగదత్తుండును గృపాచార్యుండును త్రిగర్త పతియును భీష్ముం గూడుకొని యాక్రీడి నెదిర్చిరి సాత్యకి యడరినం గృతవర్మ బాహ్లికులు మార్కొనిరి మారుతి గవిసినం గుంభసంభవుండు దలపడియె నతని ప్రాపున నేపు మిగిలి నీపుత్రకు లాబకమర్దను మర్దింపం గడంగి కవిసిన. 159

క. గురునంపవెల్లి నాఁగుచు, సరభసముగ వారిమీఁద శరవర్షంబుల్
గురియుచు వారలయమ్ములఁ, దెరలక భీముండు పటుగతిస్యందనుఁ డై. 160

వ. సమరక్రీడ సలుపుచుఁ గురుకుమారులు దొరఁగించునారాచధారల నొచ్చి యాజ్యధారాక్రాంతుం డై నయర్చిష్మంతుండునుంబోలె మండి యుద్దండ కోదండనైపుణ్యంబు సూపినం గుండభేదియు ననాధృష్యుండును గనకధ్వజుండును విరావియు సుబాహుండును దీర్ఘబాహుండును దీర్ఘలోచనుండును దీర్ఘనిద్రం బొందిరి పెఱవారు వెఱచఱచి విఱిగి పఱచిన నజంబుల వెనుకొనువృకంబు విధంబున వృకోదరుండు దోర్విలాసంబు మెఱసె నప్పుడు ప్రాద్గ్జ్యోతిషుండు చండ నీపెద్దకొడుకు బలుమొనలం బురికొల్పికొని చలంబునం గొత్తల సేసినం గాం తేయ వ్యూహంబులు నభినవోత్సాహంబునం బోక పెనంగిన. 161

తే. ధరణి నెత్తుటఁ దోఁగి యాభరణకాయ
శస్త్రఖండజాలంబులఁ జాల నొప్పెఁ
బలుచ గాకుండఁ గుంకుమ మలఁది పెక్కు
దెఱఁగుతొడవులు దొడిగిన తెఱవపోలె. 162

---

* క. "నీ చెలువును నీబలువును, నీచతురత నీబలంబు నీసాహసముం
నీచక్కఁదనము నే నే, రాచూలికిఁ గలుగఁ గందు రా రా కుట్టా.
వ. అని యంత నిలువక.". ఈపద్యగద్యములు 155-వ దానికిఁ దర్వాత నచ్చుప్రతులలో ముద్రింపబడియున్నవి గాని వ్రాతప్రతులం జూపట్టవు.

వ. అంత. 163

క. తిమిరము గవిసినఁ బాండవసమితియుఁ గౌరవులు రణము సాలించి నివా
సములకుఁ దగఁ జని రయ్యష్టమయామిని సుదితపటువిషాదుం డగుచున్. 164

క. కురువిభుఁడు నగరు సొచ్చియుఁ, జొరమిన గాంధారవిభుని సూతతనూజుం
ద్వరితముగఁ బిలువు మని యాతురతం బలుమాఱుఁ జెప్పె దుశ్శాసనుతోన్.

వ. చెప్పిన నతండు వారిం గూర్చికొని వచ్చుటయు నేకాంతంబున నమ్మహీకాంతుండు
వారలతో నిట్లనియె గాంగేయగురుకృపాశ్వత్థామలు మధ్యస్థులై పాండవబలం
బులం జెఱుచునట్టిసంరంభంబునకుం జొరరు మనసేనలు నానాఁటికి సన్నంబులై
సమయుచు వచ్చె నేమి సేయం గలవార మనిన విని రాధేయుండు రణక్రీడా
లంపటుం డై. 166

క. నరనాథ యింక భీష్ముని,దురమునకుం దేకు మేను దోర్బలవిభవో
ద్ధురతం బాండుకుమారో,త్కరముం దత్సేనలను మదం బడఁగింతున్. 167

క. అని పలికిన విని దుశ్శాసనుఁ గనుఁగొని మనము వోయి శాంతనవునిభం
డన ముడిపి వత్త మని చెప్పి నరేంద్రుఁడు వీడుకొల్పెఁ బెఱవారిఁ దగన్. 168

వ. ఇట్లు కర్ణసౌబలుల నిజనివాసంబులకుం బోవం బనిచి బహుప్రకారసౌరభసంవా
సితంబు లగుజలంబుల జలకం బాడి పరమసురభిచందనానులేపంబులను జీని
చీనాంబరపరిధానంబులను మహనీయమాల్యాభరణంబులను బ్రస్ఫీతమణిమయ
భూషణధారణంబులను దగ నలంకృతుండై తమ్ములుం దగువారలుం బరివేష్టింపఁ
బరిమళపరంపరాభాసితనూతనతైలధారాభిషేకప్రదీపితంబు లయినకరదీపికా
సహస్రంబులు వెలుంగ వేత్రహస్తులు దొలంగు తొలంగుం డని సందడి నెడ
గలుగ జడియ వందిసందోహంబులు సంకీర్తనంబులు సేయ మాగధమంజుల
గానంబులు వీనులం బొరయఁ బాఠకపఠనరవంబుల మనంబు రంజిల్ల రమణీయ
రత్నఖచితం బగురథం బెక్కి మందమందగమనంబున మందాకినీనందనుమంది
రంబు నేరం జని తదీయద్వారంబునం దేరు డిగ్గి దుశ్శాసనుముంజేయి కరతలం
బున నవలంబించి యల్లన నడచి యుచితప్రకారంబునం బ్రవేశించి యప్పితా
మహుపాదంబులకుం బ్రణామంబులు సేసి తత్పీఠసమీపంబున సమంచితకన
కాసనంబున నతం డనుప నాసీనుం డై చేతులు మొగిచి యమ్మనుజపతి యతని
తో ని ట్లనియె. 169

మ. నిను మున్నెంతయు నమ్మి పాండవులయుచ్ఛేషంబు నే జీరికిం
గొన నీపోరెడుచందముల్ దెలియఁ బెక్కుల్ సూచితిం జేరి చే
రి నయం బిచ్చుచు నొంప నూల్కొనక వారిం బట్టి పాలార్చె దొం
డన నేరం గురుముఖ్య యింక నిట నీవాలంబు సాలింపవే. 170

చ. అని మొన దేవదానవుల కైనను మార్కొన రాదు నిన్ను నేఁ

డెనిమిదినాళ్లు లయ్యె సమయింపవు నొంపవు సవ్యసాచి న
ప్పని యటు లుండ నిమ్ము నినుఁ బ్రార్థన సేసెద నింతవట్టు నా
చనవునఁ బోవ నిచ్చి నృపసత్తమ పోరికిఁ గర్ణుఁ బంపవే. 171

వ. అనవుడు. 172

క. అమ్మాట మనమునకు వా, లమ్మై తాఁకుటయు భీష్ముఁ డత్యంతవిషా
దమ్మున నించుకవడి మా,నమ్ము దగం దాల్చి యుండె నతవదనుం డై. 173

వ. పదంపడి నిట్టూర్పు నిగిడించి మొగం బెగయించి భూపాలు నాలోకించి. 174

క. తలకొని నీకుం బ్రాణం,బులు డాఁపక యొపినట్లు వోరఁగ నిమ్మెఁ
బలుకఁ దగునె యక్కటట నా,వలనం గలభక్తి యెల్ల వమ్మునఁ గలయన్. 175

వ. అని పలికి యలుక వోడమి వెండియు. 176

సీ. కాల్పఁడే మహనీయఖాండవం బింద్రుని నమరగణంబుతో విముఖుఁ జేసి
బహుదివ్యశరములు వడయఁడే యెక్కటిబవరాన మెప్పించి శివునిచేత
గంధర్వులకు నోడి కర్ణుండు నీతమ్ములును బాఱ విడిపించికొనఁడె నిన్ను
నిను నను ద్రోణు నాతనిపుత్త్రుఁ గృపుఁ గర్ణు గెలిచి విరాటుగోవులఁ గొనండె

ఆ. తక్కు పెక్కు లెడలఁ బెక్కండ్ర నేమేమి, నేసె వినమె యట్టిజెట్టి నిన్ని
దినము లిట్లు దొడరి పెనఁగియు నీచేత, నేఁడు వినఁగ వలనె వేఁడిపలుకు. 177

క. తగనిపని యని తలంపక, పగగొంటి వజయ్యు లైనపాండుసుతులతోఁ
దెగి యింక నీవు రణమున, మగఁటిమి వాటింపు రిత్తమాటల నగునే. 178

వ. అని మఱియును. 179

క. గాండీవి గెలువ రాదు శి,ఖండిని జంపంగ నాకుఁ గాదు వినుము న
న్నొండుమగలు మాఱొక్కనినం, జెండుదు నుగ్రముగ మున్న చెప్పితి నీకున్. 180

క. *ఏనును నాదళమున ద్రుప,దానీకవిరాటసైన్యయాదవబలసం
తానములతోడఁ బెనఁగెదఁ, బూనుఁడు మీ రెల్లఁ బాండుపుత్త్రుల గెలువన్. 181

ఆ. నడికిరేయి వచ్చినను నొవ్వఁ బలికినఁ, గలుగునయ్య జయము గడఁగి నీవు
నడవు మనికి నెల్లి నాచేతిఁ బలువు సూ, చెదవుగాక వేయునెప్ప నేల. 182

క. అనినఁ బ్రియ మంది నగరికిఁ, జని పతి సుఖనిద్ర నేసి సముచితసమయం
బున మేలుకాంచి కయ్యం,బున కాయిత మయ్యె మేను వొంగారంగాన్. 183

వ. ఇట్లు సన్నద్ధుం డయి బలంబుతో వెడలి నీపుత్త్రుండు భీష్ము నుపలక్షించి భూపతి
ప్రకరంబులతో ని ట్లనియె. 184

భీష్మునినవమదివసయుద్ధము.

తే. ఇతఁడు పాంచాలు రాదిగ నెల్లబలముఁ
జంపి పాండుతనూజుల సమరభూమి

---

"* అహం తు సోమకాన్ సర్వాన్ పాంచాలాంశ్చ సమాగతాన్, నిహనిష్యే నరవ్యాఘ్ర వర్జయిత్వా శిఖండినం" అని మూలము. ఆదళ మునన్ = ఆపాండవసేనయందు.

గెలువఁ గల వాఁడ నని రాత్రి పలికె నేఁడు
దఱిమి మనలావుఁ జేవయు మెఱయ వలయు. 185

క. అని యాడుతులువమాటలు, విని బీభత్సుండు సిగ్గు విపులవిషాదం
బును నొక్కపెట్ట పుట్టఁగ, ననిమిషతటినీతనూజుఁ డతిదుఃఖితుఁ డై. 186

వ. తన్నుం దాన యుపశమించుకొని యున్నం గనుంగొని కౌరవేశ్వరుం డతని
కన్నెఱంగినవాఁ డై దుశ్శాసనునితో ని ట్లనియె. 187

క. మన మెల్లఁ బితామహునొ,ద్దన యుండుద మదియుఁ గా కితనిముందట బె
ట్టన వలయు శత్రుబలమ,ర్దను లిరువది రెండువేలరథములవారిన్. 188

వ. అని నియోగించిన నతం డట్లు చేసె నద్ధరణీశుండు గురుకృపాశ్వత్థామల నాలో
కించి గాంగేయుం జూపి సత్యవ్రతుం డగునీతండు శిఖండిపై నేయ నని మన
మెత్తి విడియునాఁడ చెప్పుట మీ రెఱుంగుదుర కాదె యన్నీచునకు గోచరంబు
గా కుండ నిమ్మహానుభావుం బొదివికొని కావలయు ననిన వారలు నట్ల కాక
యని రయ్యమరనదీసూనుండు సర్వతోభద్రవ్యూహం బొనర్చె నందుఁ గృపా
చార్యకృతవర్మ శల్యశకునిసుదక్షిణసైంధవులును గురుకుమారులుం దానును
ముందట నిలిచెఁ దదనుమతిం గుంభసంభవభూరిశ్రవోభగదత్తులు వలపటను
సోమదత్తద్రోణపుత్రవిందానువిందులు డాపటను హాలాయుధాలంబుసశ్రుతా
యువులు వెనుకను దిగ్గర్తప్రకరపరివృతుం డై జననాథుండు నడుమను నిలిచి
రంతకు మున్న కౌంతేయులు సైన్యసమేతంబుగా వెడలి రట్టియెడ నర్జునుండు
మన మొగ్గరంబు సూచి ధృష్టద్యుమ్ను న కి ట్లనియె. 189

తే. కంటె గాంగేయు నతనిచక్కటి శిఖండిఁ, బెట్టు మీఁతని మన మెల్లఁ బిండుగట్టి
పొదివి కొనివత్తె మివ్విధంబునకుఁ దగ ద,శంబుగా మోహరింపు బలంబు నెల్ల.

వ. అనిన విని యతం డట్లు చేయుదు నని సాత్యకివిరాటులు వలపటను నభిమన్యు
పాంచాలకేకయులు డాపటను నకులసహదేవద్రౌపదేయపురస్సరుం డైన యుధి
ష్ఠిరుండు నడుమను జేకితానకుంతిభోజులు వెనుకనుంగా నొనర్చి యగ్రభాగం
బున శిఖండి నునిచి యతనికెలంకుల డాసి భీమసేనఘటోత్కచు లొక్కవలనను
బార్థుండుఁ దాను నొక్కదిక్కునను నిలిచి తక్కినయోధవీరులం గలయం జేర్చిగట్టి
మొనగా నమర్చె ని ట్లుభయసైన్యంబులుం బన్ని భేరీభాంకారశంఖాదినిస్వనగ
ర్జాస్ఫూర్జితబహుళంబుగా నొండొంటిం దాఁకె నట్టిసమయంబున. 191

క. చెంగట నభిమన్యుండు పి,శంగతురంగప్రచారచంచద్రథుఁ డై
పొంగి మనదిక్కు ప్రజమీఁ,దం గవిసెం జిచ్చు దూది దరికొనుమాడ్కిన్. 192

వ. ఇట్లు గవిసి. 193

తే. మెఱసి మండలచారి యై కొఱవి ద్రిప్పి, నట్లు గురుకృపసింధురాజాదు లైన
యోధవీరులు వెగ డంద నులివు మిగిలి,తరువఁ బడునట్టి క్రియ సేన[1]దిరుగఁబడఁగ.

---

1 దిరుగువడఁగ.

వ. ఇట్లు మాఱు లేక తఱుము చున్న సౌభద్రుం గనుంగొని కౌరవపతి యలంబు
సుతో నిట్లనియె వీఁడు రెండవయర్జునుం డై మనబలంబులఁ గలంచు చున్నవాఁ
డర్జుననందను నెదుర్కొన నీవ కాని మాఱు లే దేము పాండవుల కడ్డపడియె
దము నీవు వీనిం బోదివి భంజింపుము. 195

అలంబుసుఁడు దుర్యోధనప్రేరితుం డై యభిమన్యుపైఁ గవియుట.

క. అనవుడు నతండు దుర్దమ,దనుజావలి మున్ను గాఁగఁ దఱిమెం గుంతీ
తనయబలము గారాకులు, పెనుగాలిం దూలునట్లు భీతిం జెదరన్. 196

ఉ. అప్పుడు ద్రౌపదేయులు రయంబున నడ్డము సొచ్చి దైత్యులం
గుప్పలుగా మహిం బెలుచఁ గూల్చిన దానవనాథుఁ డమ్ములం
గప్పెఁ గడంగి వారల నఖండపరాక్రమలీల వారు వాఁ
డొప్పఱి తేరికూబరమ యూఁతగ వ్రాలఁగ నేసి యార్చినన్. 197

క. ఆలోనన తెప్పిఱి లయ, కాలుండునుబోలె నసుర గన్నుల నిప్పుల్
రాలఁగ వారలసిడములు, నేలం బడ నేసి చాపనికరము ద్రుంచెన్. 198

వ. త్రుంచి నవ్వుచు. 199

తే. ఒకని నొకని నైదైదు మహోగ్రభాసు
రాస్త్రముల నేసి నొంచిన నతనిమదము
సొంపు సోదరవ్యథయును జూచి యడరె
నప్పు డాతనిపై సుభద్రాత్మజుండు. 200

వ. అప్పు డుభయసైన్యంబులవారును వెఱఁ గంది. 201

క. దనుజుఁడు మాయాధికుఁ డ,ర్జునతనయుఁడు దివ్యశరధరుం డె ట్లగునో
యను చుండఁగ నయ్యిరువురు, నని నేసిరి వృత్రవాసవాకృతి దోఁపన్. 202

క. ఇతరేతరశరకృతశో,ణితధారలు నిగుడ నపుడు నిర్ఝరధావ
ద్యుతు లడరఁ బొలుచునగముల,గతిఁ బొలిచిరి వార లప్రకంపోన్నతు లై. 203

క. దనుజేశ్వరుండు మాయం, బొనరించినఁ దమము గవిసె భూనాయక ఫ
ల్గునసుతుఁడు భాస్కరాంబక,మున వెలుఁగొనరించె సురసమూహము వొగడన్.

తే. అసుర వెండియుఁ బెక్కుమాయలు ఘటింప
శక్రపౌత్త్రుండు దివ్యాస్త్రజాల మడరఁ
జేసి యన్నింటి నడఁగించి చెలఁగి నొంప
రథము డిగిపాఱెఁ బెలుచ నారాక్షసుండు. 205

క. రక్కసుఁడు విఱిగినం గడు, నుక్కున సౌభద్రుఁ డడరు నురవడి గని న
ల్దిక్కులఁ బఱచెం దమలోఁ, జిక్కువడుచుఁ గౌరవేంద్రుసేనలు భీతిన్. 206

వ. అప్పుడు పెక్కండ్ర రథికులతోడం గూడి గాంగేయుం డభిమన్యుపయిం గవిసిన.

తే. అతఁడు దానికిఁ దలఁకక యందఱకును, నన్ని రూపు లై పోరంగ నర్జునుండు

సరభసంబుగ భీష్ముపై నురవడింపఁ, బొంగి యురువాఁగు నిరువురఁ బొదివె బోరసి.

వ. అట్టిసంకులసమరంబున నభిమన్యుపై నడరుకృపాచార్యుం దాఁకి సాత్యకి బెడిదంపునారసంబు లేసిన వాని నన్నింటిని నశ్వత్థామ దునిమి యతనివిల్లు ద్రుంచినం గోపించి. 209

క. ఆసాత్యకి వేఱొకవి,ల్లాసురగతి నెత్తి యుగ్ర మగునారాచం
జేసిన నాతఁడు కేతు,వ్యాసక్తుండయ్యె మూర్ఛ వచ్చి నరేంద్రా. 210

క. ఆలోనన తెలిసి మెఱుఁగు, వాలికతూపాతఁ దతనివక్షమునదుమం
గీలించి సిడము గ్రక్కన, నేలం బడ నేసి యార్చె నింగి వడంకన్. 211

వ. దానికిం గినిసి శినిమనుమండు పొగరు మిగులునారాచ నిచయంబులం బొదివిన నశ్వత్థామ రాహుగ్రస్తుం డగునుగ్రగభస్తియుంబోలె నైనం గనుంగొని. 212

క. ద్రోణాచార్యుండు సుత,త్త్రాణపరత్వమునఁ గృష్ణుతమ్మునిపై న
క్షీణోద్ధతిఁ గవియుడు గీ,ర్వాణాధిపసుతుఁడు వచ్చి వడి నెడఁ జొచ్చెన్. 213

చ. అనవుడు నాంబికేయవసుధాధిపుఁ డిట్లను ద్రోణుఁ డాత్మ న
ర్జునునకుఁ గూర్చు నాతఁడు గురుం గని యెంతయు భక్తిసేయు వా
రనిఁ దమలోన నట్లు వెస నప్పుడు దార్కొని యెట్లు వోరిరో
వినఁ గల దేర్పడం జెపుమ విశ్రుతభంగిగ నాకు సంజయా. 214

వ. అనిన నాసూతనందనుం డతని కిట్లనియె. 215

క. క్షాత్త్రము దలకొని సంగర,ధాత్త్రికి నేతెంచి గురులు దండ్రులు దమ్ముల్
పౌత్త్రులు శిష్యులు మామలు, పుత్త్రులనం గలదె తొడరి పోరన వలయున్. 216

అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధము సేయుట.

వ. వినుము. 217

సీ. అర్జునుం డడరి ద్రోణాచార్యుమూఁడునారసముల నేసి యుగ్రంపుటంప
వెల్లువ వఱపిన వెగ డొంద కాతఁ డాతనిమేనిఁ దూపులు దఱుచు గాఁగ
నాఁటించె నంత భూనాథుండు పురికొల్పఁ గాఁ ద్రిగర్తులు గురుఁ గడచి కవియ
నరుఁ డేచి వాయుబాణమ్మున నమ్మొనఁ దూలింపఁ గుంభజుశైలశరము

ఆ. వచ్చి యుడుప నలిగి వాసవి నారాచ,వర్షమునఁ ద్రిగర్తవరునిపుత్త్ర
చయముఁ [1]దెరలుచుటయు జనపతినృపశల్య,బాహ్లికులునుఁ దానుఁ బార్థుఁ దాఁకె.

వ. అట్లు దాఁకుటయు వారల నతండు గన్నెరాకమ్ములం జీకాకుపఱిచె నట్లు గురుండు మొదలైనయందఱకును నాధనంజయుపోరు దలమునుక లయ్యెఁ గురుపితామహుండు ధర్మసూతి యున్నతిట్ట కుఱికి తలలు చెండాడె శకునిభూరిశ్రవసులు గవలం దలపడిరి కళింగపతియును భగదత్తుండును నిభసేనలతోడం దొడరి భీమసేనుం బొదివిన. 219

1 దెల్పుటయును.

క. గిరి డిగు కేసరిచాడ్పున, నరదము డిగి భ్రమితపటుగదాభీలత నా
కరువలిపట్టియుఁ గవిసినఁ, గరులుఁ దెరలెఁ బవనధూతఘనపంక్తిగతిన్. 220

తే. క్రందుకొని యిట్లు మాతంగఘటలు విఱుగ
నాశ్రుతాయువుఁ బ్రాగ్జ్యోతిషాధిపతియుఁ
బోక నిలిచి యమ్మారుతపుత్త్రు జోడుఁ
దనువుఁ జించిరి వివిధాస్త్రతతులు వఱపి. 221

వ. అప్పుడు గాంగేయుండు నేయుదారుణరణంబు ధర్మపుత్త్రునకు భరం బైన నతం డెలుంగెత్తి వేరువేరం బిలిచి చేయి వీచిన నాకళింగనాథభగదత్తుల విడిచి యవుడు గఱచుచు. 222

క. కలయఁగఁ గరములఁ జరణం,బుల నురమున శోణితంబు బోరనఁ దొరఁగం
దలి రెసఁగిననడమామిడి, చెలువునఁ బఱతెంచె భీమసేనుఁ డచటికిన్. 223

వ. అంతకు మున్న ధృష్టద్యుమ్నశిఖండివిరాటద్రుపదులు ధర్మనందనున కడ్డపడి భీష్ముపై నడరి బహుప్రకారవిశిఖంబుల వెగడుపఱచిన నతం డలిగి శిఖండి నేయ నొల్లక యమ్మువ్వురను మూఁడేసివాఁడితూపుల నేసిన నావీరరథికులు హుతాగ్నిత్రయంబునుంబోలెఁ బ్రజ్వలించి బాణజ్వాలలు నిగిడించి యతని నొప్పించిరి వృకోదరుఁ డద్దెసం గవియుటం గనుంగొని కేకయగణశైనేయద్రౌపదేయులు గూడుకొని కవిసినం గౌరవసేనం జేయం గలమేటిమగ లెల్లను మిన్నేటికొడుకునకుం దలకడచి వారిం దలపడిన నిరుదెఱంగులదొరలును బలంబులును నొక్కుమ్మడిం గ్రందుకొన బెరసి పోట్లాడు చుండం జండరశ్మి వినువీథిచక్కి సగంబునకుం జను దెంచె నట్టియెడ. 224

తే రథములను సామజములఁ దురంగమముల
నుఱక [1]నెత్రుటేఱుల నీఁది తఱియ నడచి
పోరి రేటును వ్రేటును బోటు నొక్క
యలవిఁ జెలఁగంగ నుభయసైన్యములవారు. 225

వ. అప్పుడు మనబలంబులజనంబులు. 226

క. ధృతరాష్ట్రుండును బుత్త్రులు, నతిలోభంబునఁ బ్రజాక్షయము నేసిరి ధ
ర్మతనూజు గెలువ వచ్చునె, మతి లే రై రింక నేటిమాటలు మనకున్. 227

ఆ. అనుచు వగచుపలుకు లాలించుభీష్మాది, యోధవరులతో సుయోధనుండు
చెనఁటిమాట లేమి వినియెద రనిన వా, రదియు నదియు విననియట్లపోలె. 223

వ. పరాక్రమక్రీడలు సలుపు చుండి రాసందడికయ్యంబునం గిమ్మీరమర్దనుండు గద పండువు నేయు చుండె నప్పుడు. 229

1 నెత్తురు టేఱులఁ దఱియ.

క. సరభసముగ సారథి దన, యరదముఁ దెచ్చుటయు నెక్కి యతినిశితశర
స్ఫురణాపరిణతి బాహ్లికు, విరథుం గావించె సురలు వినుతింపంగన్. 230

తే. చిత్రసేనుండు సౌభద్రుఁ జిత్రబాణ, పాతమున నొంచి యార్చినఁ బాండుపౌత్త్రుఁ
డతనిసారథిఁ బడ నేసి యంతఁ బోక, తురగములఁ జంపి యాతనిత్రుళ్ళడంచె.

వ. అక్కుమారుండును దుర్ముఖుని రథం బెక్కెఁ బాంచాలపతి గుంభసంభవుపై
నడరి యతనిమేన నానాస్త్రంబులు నించిన. 232

క. ద్రోణుఁడు గోపించి తను,త్రాణం బఱువ్రయ్యి నేసి తనువున రాజ
ద్బాణంబులు గ్రుచ్చిన సం,క్షీణబలుం డై యతండు సిగ్గఱి తొలఁగెన్. 233

సీ. తఱిమి సుశర్ముండు దాఁకి యర్జును నొంచి కృష్ణుపై నమ్ములు గీలుగొలుప
నలిగి యన్నరుఁడు వాలంపకాలువ లోలి నడరించుటయు వానియఖిలబలముఁ
జేతిసమ్మెటలను చేరుకోలల వ్రేసి యంకుశంబుల నూఁటి యతిరయమున
వాహనంబులఁ దోలువారును విండ్లును బలకలు వైచుచుఁ బఱచువారు

తే. నైన మాతండ్రి క్రీడిపై నడర నడుమఁ, జొచ్చె సాత్యకి యన్నదీసుతుఁడు శక్తి
వైవ మెయి వాల్చి యదిపట్టి వైచె మగుడ, నాతఁడాభీష్ముఁడెడఁదునుమాడెనధిప.

వ. ఇట్లు ద్రుంచి. 235

క. ఆలోనన మెయిఁ దొమ్మిది, వాలమ్ములు నాఁటఁ బాండవవ్యూహము శుం
డాలరథఘోటసుభటా,భీలతఁ దలకడచి పొదివె భీష్ముని నంతన్. 236

దుర్యోధనుఁడు శకునిదుశ్శాసనుల భీష్మునకు సహాయులుగాఁ బంపుట.

క. కని కౌరవపతి దుశ్శా,సనుతో నిట్లనియెఁ గంటె శాంతనవునిపై
ఘనసేన దోఁచెఁ జని కై,కొనుఁ డీవును సౌబలుఁడు సకుంతితవృత్తిన్. 237

క. అనవుడు నయ్యిరువురు నే,పునఁ గదియుడుఁ జూచి ధర్మపుత్త్రుఁడు మాద్రీ
తనయులు నడరిన దుర్యో,ధనుఁ డపుడు తురంగమాయుతముఁ బురికొలిపెన్.

వ ఆపదివేవురు నెఱరావుతులు నొక్కపెట్ట శకునిదుశ్శాసనులకుం దలకడచి యెక్కినం
బాండవబలంబు మహామత్స్యసమూహవిహారంబునం గలంగుమడువునుం బోలె
సంక్షోభించినం గోపించి కౌంతేయాగ్రజుండును గవలును వివిధవిశిఖపరంపరలు
వరఁగింప ముందటికాళ్లు దునిసిన మ్రొగ్గతిలంబడియును మోరలు పఱియలైన
నెఱి దప్పం గూలియు గుండియ లవిసిన నెగసి కెడసియు వాగెలు ద్రెవ్విన
[1]వలియం బాఱియు నాశ్వికులు నేల కొఱగినం జెనఁటి దిరిగియు ననేకఘోట
కంబులు రూపఱిన నేపఱి యత్తురంగనికరంబు లేటమొగంబువడి చెదరి కనుకనిం
బఱచిన. 239

క. భేరీశంఖాదిరవ, స్ఫారత నప్పాండుపుత్త్రబల మేచుటయుం
గౌరవపతి శల్యునితో, గారవమున నిట్టులనియెఁ గడు దీనుం డై. 240

క. వెలివిరిసి వచ్చుజలనిధి, [2]పొలుపునఁ దోఁతెంచు ధర్మపుత్త్రునిబలుగో

1 గలయం బాఱియు. 2 పొలుపున నేతెంచు.

ర్తల నిలువరింప నీ వోక, చెలియలికట్ట వయి మమ్ముఁ జేకొను మిచటన్. 241

ఆ. అనుడు నతఁడు పాండవాగ్రజుఁ గవలను, దాఁకి విపులబాహుదర్ప మొప్ప
నారసములఁ బొదివి మారిమసంగిన, ట్లయినఁ జూచి నరుఁడు ననిలసుతుఁడు. 242

క. ఒక్కటఁ గడంగి శల్యుని, జెక్కమ్ముల నొంచుటయును భీష్మద్రోణుల్
గ్రక్కునఁ దఱిమిన నయ్యిరు,దిక్కులసైన్యములు నత్యుదీర్ణత బెరసెన్. 243

వ. ఇట్లు గలయఁ బెరసి యపరాహ్ణంబున నుభయచతురంగమథనం బగుప్రధనంబు సేసె నట్టియెడ భీష్మగ్రీష్మాదిత్యుండు వేఁడి మిగిలి వాఁడి మెఱసిననారసంబులను కిరణంబులు పరఁగించి. 244

సీ. పండ్రెంటఁ బండ్రెంటఁ బాండవాగ్రజునిభీమునిమాద్రికొడుకులమూఁటమూఁట
నేడింట నేడింట నేచి సాత్యకిని ధృష్టద్యుమ్ను నొప్పించి సమదవృత్తి
నార్చిన మాత్స్యపాండ్యానీకములును సోమకవరూథినియును మగధబలముఁ
గాశిసైన్యంబుఁ గరూశసేనయు నొక్కపెట్ట రయంబున భీష్మమీఁద

తే. నురవడించినఁ బాండవోత్కరముఁ గృష్ణు
తమ్ముఁ బాంచాలనందను సమ్ముఖమున
కడర నీ కాఁగి యందఱ కన్నిరూపు
లై మహారణ మొనరించె నస్త్రగురుఁడు. 245

ఉ. శాంతనవుం డనేకబలసంతతి నుద్భటశౌర్యసారదు
ర్దాంతపరాక్రమస్ఫురణఁ దాఁకి సముజ్జ్వలశాతసాయక
క్రాంతపరీతనిర్మథితకంపితపాలితమూర్తిఁ జేసి య
త్యంతరయంబునం దనరథంబుగతుల్ మెఱయం బ్రదీప్తుఁ డై. 246

మ. గజరాజోజ్జ్వలఘంటికావళిఁ దురంగప్రస్ఫురత్కింకిణీ
వ్రజముం గాహళదుందుభిప్రభృతితూర్యశ్రేణులన్ సుందర
ధ్వజఘంటాతతులన్ శరాసనగుణ[1]వ్రాతంబుఁ దున్మాడి ధ
ర్మజసేనాతతి ముంపఁ జేసెఁ బటుదోర్గర్వం బఖర్వంబుగాన్. 247

వ. ఇట్లు బల్లిదుం డయి మల్లడి గొని మార్కొను మగలు లేక మదంబునం బొంగి గాంగేయుండు పాండవేయులు వెఱఁగుపడ మఱియునుం గడంగి దుర్వారంబు లగుదివ్యాస్త్రంబులు దీటుకొల్పి యేదిక్కు సూచినం దానయై రథికులను హస్తికులను నాశ్వికులనుం దునిమిన గంధసింధురక్రీడనంబున మ్రోడుపడినయుద్యానంబుచందంబున నగు చున్నచోట్లును గాలుబలంబులం గనుపుకొట్టినం గాలు చేయి తల డొక్క [2]యని యేఱుపాటు లేక వండం దఱిగినయ ట్లున్నయెడలును బెక్కుదెఱంగులచప్పుళ్లు నిగుడ రథచయంబునవయవంబులుం గరిహయనికరం బులయెమ్ములు విఱుగం గార్చిచ్చు పొదివిన వెదురుటడవితెఱంగునం దోఁచు

1 వ్రాతంబులం ద్రుంచి. 2 యను వేఱుపాటు.

పట్లును దఱచుగొడుగులు విటతాటనంబు సేసినం బెనుగాలిం జిక్కువడినకుసు
మితకాశవనంబునుం బోలుచక్కట్లును బహురత్నమయమకుటాదిభూషణవ్రజం
బు వివిధవర్ణచామరజాతంబు నఱికి పడవైచినం బ్రబలోద్ధతలులాయలులితం
బయి కమలకైరవోత్పలాకీర్ణం బగుకొలని ననుకరించుప్రదేశంబులును నై
పాండవసైన్యంబులు దైన్యంబు నొందియుఁ గలగుండుగొనియు బెండు
వడియుఁ గలంగం బాఱియుఁ దొలంగం దెరలియుం గోలాహలబహుళంబు
లగుట గనుంగొని గోవిందుండు. 248

ఉ. అర్జున చూచితే మనబలావళి నెల్లఁ గలంచు చున్నవాఁ
డూర్జితశౌర్యసంపదయు నుగ్రభుజాబలవైభవంబు వి
స్ఫూర్జితవిక్రమోద్ధతియుఁ జూపె నదీసుతుఁ డిట్టిచోట నీ
దుర్జయదర్పవిభ్రమము దోఁపఁగఁ జేయకయున్కి యొప్పునే. 249

వ. అనిన వివ్వచ్చుండు విచారడోలాయత్తం బగుచిత్తంబుతోడ నిరుత్సాహుం డై
యున్నంజూచి వెన్నుం డతని కిట్లనియె. 250

క. మును మత్స్యనాథునగరం,బున సంజయుతోడ నీవు పొంగుచు బెట్టా
డినమాట లెల్ల మఱచిన, నిను నగరే రథికవరు లనింద్యచరిత్రా. 251

వ. అనుటయు నర్జునుండు 252

ఆ. సకలబంధుజనులఁ జంపి కౌరవహీన, మైనరాజ్య[1]మహిమ యేను బడసి
యనఘ యేమిసుకృతమాచరించినవాఁడ, నగుదు మనసు గొలుపదయ్యె ననికి.

వ. అయిన నీతో[2]నప్పటప్పటి కేటిమాటను గలవు మిన్నేటికొడుకుం బడవైచెదం
దేరునడపు మనుటయు నారాయణుండు నదీనందనుస్యందనంబునకు సమ్ముఖంబుగా
రథ్యమ్ములం ద్వరితగతి నడపినం దెరలినసైన్యంబులు గూడికొని గాంగేయు
పయిం గవియ నతండు సెలంగి మహాస్త్రనికరంబులు నిగిడించి యబ్బలంబు నిలువ
రించి సింహనాదంబు సేసి. 254

మ. ఖరనారాచపరంపరోగ్రనిహతిఁ గాండీవియంగంబు లా
తురతం బొందఁగ నేసి బాణమయగాత్రుం జేసి గోవిందు ని
ష్ఠురలీలం దురగంబులం బటుశరస్యూతాస్యముల్ గాఁగ స
త్వరుఁ డై యేసి రథంబు గూడఁ బొదివెఁ వాలంపమొత్తంబునన్. 255

వ. అప్పుడు. 256

తే. బీఱువోయి రథ్యంబులు మాఱుమొగము
వడినఁ దా నొచ్చియుండియుఁ దడవి శౌరి
నూలుకొనఁ జేసి తఱిమిన వ్రాలి తీవ్ర
భల్లమునఁ గ్రీడి భీష్మునివిల్లు దునిమె. 257

1 విభవ మేను. 2 నిప్పటి కేటి.

క. అతఁ డొండొకవి ల్లెత్తిన, నతిరయమున నదియుఁ దునుమ నాతం డౌరా
శతమఖనందన యనుచును, ధృతి వేతొకవింట శరతతిం బరఁగించెన్. 258

క. ఆబెట్టిదంపుటంపఱ,చే బీభత్సుండు నొచ్చి చేడ్పడి మఱియుం
దా బంటుతనమ పటుబా,హాబలముగఁ బోరుచుండె నంగము దూలన్. 259

క. విప్వచ్చునొప్పు నెంతయుఁ, గ్రొవ్వున భీష్ముండు గడఁగుకొల్లలయుం ద
క్కెవ్వరు నాతనిఁ జేరక, దవ్వుల నిల్చుటయుఁ జూచి తనచిత్తమునన్. 260

క. దారుణరోషం బడరఁగ, నారాయణుఁ డపుడు సైరణం దొఱఁగి వెసం
దేరినొగలఁ బగ్గము లిడి, క్రూరత[1]మునికోల యెత్తికొని యిల కుఱికెన్. 261

శ్రీకృష్ణుఁడు రథంబు డిగి భీష్మునిపైకిం బోవుట.

వ. ఇట్లు లంఘించి. 262

మ. ధరణీచక్రము గ్రక్కునం గదల దిగ్దంతావళశ్రేణికిం
ధరముల్ ప్రొగ్గఁబడన్ దిశావలయ ముత్కంపంబు గా నీబలం
బురులం బాఱఁగ భీష్ముపైఁ గవిసె రౌద్రోద్రేకముం జూచి ఖే
చరలోకంబును సంచలింప హరి చంచద్బాహుఘోరాకృతిన్. 263

తే. లలితపీతాంబరంబువిలాస మొప్ప
సింహనాదోద్భటం బగుచెలువుతోడ
మెఱుఁగువెలుఁగును గర్జయు మెఱయ వచ్చు
కారుమొగి లనఁ గృష్ణునాకార మొప్పె. 264

వ. అట్టియెడ. 265

క. బలుజీవము వోయిన వెలు,వెలఁ బాఱుచు నీదుయోధవీరులు పొలిసెం
బొలిసె నదె భీష్ముఁ డనుచును, గలఁగం బడి యట్టు లెత్తి కనుఁగొనుచుండన్ 266

చ. కనుఁగొని భీష్ముఁ డుల్లము వికాసము నొందఁగ నల్ల నవ్వి యి
ట్లనుఁ జనుదెమ్ము వేగమ మహాత్మ వికస్వరపుండరీకలో
చన యిది లెస్స నాకిచట శాశ్వత మైనయశంబు నచ్చుట
న్వినుతికి నెక్కుసద్గతియు నీదయఁ జేకుఱఁ జేయు మిష్టమున్. 267

వ. అని పలుకునంత జంభాంతకసూనుండు సరభసంబుగా రథంబు డిగ్గ నుఱికివెన్ను వెనుక నెయిది కరంబులఁ గ్రుచ్చి పట్టిన నతండును దిగిచికొని వెండియుం బోవం బోవఁ బదియడుగుల కొలంది నాకొంతేయుండు పదస్థైర్యంబును బాహు వీర్యంబును మెఱయ మహీతలం[2]బూనిమెట్టినిలువంబట్టి నిట్టూర్పు నిగిడించుచు నద్దనుజమర్దనుతో ని ట్లనియె. 268

ఉ. కయ్యము సేయ నే నని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ
వియ్యెడఁ దప్పితేని జగ మే మను నించుకసేపు పోరులన్

---

1 మొలుకోల. 2 బూఁది దొట్టి నిలువం.

డయ్యుట దప్పె నాపయిఁ గడంగినభీష్మునిపాటు సూతు రా
వయ్య రథంబుమీఁది కిటు లాశ్రితమానము వీటఁ బుత్తురే. 269

వ. అని ప్రార్థించినం బార్థుపలుకులకుం బ్రియం బంది ముకుందుం డూరక మరలె నయ్యిరువురు నెక్కినయరదంబు శిఖరద్వయసుందరం బైనశైలంబునుంబోలెం బొలిచి నిలిచినం బ్రళయకాలభైరవరవం బగువారిదంబుకరణి గర్జిల్లుచుఁ బటునారాచపటలాసారంబు నిగిడించి వారల వెగడుపఱిచి యచ్చట నొండొరుల మెచ్చక యఱిమి తఱిమిన వైరుల రూపుమాపి భీష్ముండు భీషణాకారుం డై పరిశ్రాంతు లయినకృష్ణార్జునులును భీతులగుభీమసేనప్రముఖులును జేయునది లేక చూచుచుండం బాంచాలబలంబుల బారిసమరునప్పుడు బలుమానిసి చలిచీమలం గాలం జమరుచందంబు దోఁచె నయ్యవసరంబున. 270

క. తా నస్తశిఖరి మఱువడఁ, [1]బోనియపుడు పాండురాజపుత్త్రవిరాజ
త్సేన పొడ వడఁగు ననుకృప, నో నలినాప్తుండు గ్రుంకె నుర్వీనాథా. 271

వ. అట్టియెడ ధర్మతనయుం డతిఘోరం బగుసంధ్యాసమయంబునం బంకనిర్మగ్నరైనగోవునుంబోలె నున్ననిజసేనం జూచి యొక్కింతసేపు చింతాక్రాంతుం డై యప్పటికిం దిగుచుటయ కర్జంబుగాఁదలంచి తగువారలనెల్లం దివియనియమించి.

క. గాంగేయుచేత నెంతయు, భంగపడితి మనుచు వగచుపార్థాదులు ద
న్నుం గొలిచి చనఁగ విడిదలకుం గడు విన్న నయి పోయెఁ గురువంశనిధీ. 273

వ. ఇట్లు పాండవవ్యూహంబు లోహటించి పోయినం దారును దమబలంబులఁ దివియ నియమించి. 274

చ. ఎలమి నమస్కరించుచు నహీనపరాక్రమభంగు లేర్పడం
బలికి యుదాత్తవాక్యములఁ బ్రస్తుతి సేయుచు భీష్ము నందఱు
న్బలసి భవత్తనూజులు మనంబులు నిండి ముదంబు మోములన్
వెలివిరియంగ నేఁగిరి నవీనవిభూతి నివాసభూమికిన్. 275

వ. ఇట్లు ధర్మతనయుండు దొమ్మిదవనాఁటిబవరంబున బెండువడి యానిశాసమయంబునందు రహస్యపరాక్రమంబున. 276

క. మనమున విషాద మడరఁగ, ననుజులఁ గూర్చికొని దానవాంతకుసదనం
బునకుం జని యి ట్లను నాతనితో నాత్మీయకార్యదశ [2]దెలియుటకున్. 277

క. కార్చిచ్చు గవిసి మృగతతి, నేర్చుకరణి నేఁడు భీష్ముఁ డేచినకడిమిం
బేర్చి మనసేనఁ బొదివె శరార్చుల నిర్వీరుఁ గన్నులారం గంటే. 278

మ. మనవా రెవ్వరు నోర్వ రాతనికి దుర్మానంబునం జేసి యే
మును గార్యస్థితిఁ గాన నైతి విను నిర్మూలంబుగాఁ బోరఁ జ
చ్చిన సామ్రాజ్యము గొన్నయట్లగునె [3]నిశ్చింతంబునం గానన

1 బోనాడును. 2 దెలియంగాన్. 3 నిశ్చింతంబుగాఁ గానన.

బునకుం బోయెదఁ దమ్ములం గొని తపగవ్రాజ్యాండ నై యుండెదన్. 279

క. మున్నును నేఁ గారణము గ, నన్ని యిడుమ లనుభవించి రనుజులు వీరిం
గ న్నారఁ జూతుఁ గాని జ,గన్నుత భీష్మునకుఁ [1]గోలుగా నీఁ జాలన్ 280

వ. నీకు మాఁదెస ననుగ్రహంబు గలదేని కయ్యంబు దక్క ధర్మవిరోధంబు గాకుండు నట్టియొక్క తెరువు సెప్పు మని సకరుణంబుగాఁ బలికిన విని శౌరి సాంత్వన వచనంబుల ననునయించి యతని కి ట్లనియె. 281

క. సత్యప్రతిజ్ఞుఁడవు నీ, వత్యద్భుతబాహువీర్యు లనుజన్ములు దౌ
ర్గత్యము గల్గునె నీకు న,మాత్యుఁడనై యేను రాజ్యమహిమ నొనర్తున్. 282

క. వగవఁగ నేటికిఁ బార్థుఁడు, దెగువకుఁ జొరకున్న భీష్ముఁ దెగఁ జూచి వెసం
బగ యడఁగించెద నన్నుఁ, మగిడింపక చూచుచుండు మనుజాధీశా. 283

తే. సఖుఁడు సంబంధి శిష్యుండు సవ్యసాచి, నాకు నతనికి నై యేను నరవరేణ్య
కూర్మిపై నిత్తుఁ గండలు గోసి యైన, నరయ నాతండు నాయెడ నట్టివాఁడ. 284

వ. ఉపప్లావ్యంబున నతండు సంజయుతో నాడినబలుమాటలకు నులూకుండు వచ్చి నప్పు డతనిపలుకులం బుట్టినబెట్టిదంపుఁదనంబునకుం దగినయంత నాకుం జేయ వలయు నేను నీరెండెడలం బెక్కులు పలికినవాఁడ మీ కిరువురకు నొండొరువుల పలుకులు పరిపాలించుట సమయం బయి యుండు ననిన వసుదేవనందనునకు ధర్మనందనుం డి ట్లనియె. 285

క. కయ్యము సేయక తగుసా,హాయ్యము సేయఁ గలవాఁడ నని పలికితి ని
న్నియ్యెడ నేఁ బొంకింతునె, దయ్యము నా కేల యిట్టిదైన్యము దెచ్చెన్. 286

వ. నాకు దేవవ్రతునకు నొక్కసమయంబు గల దమ్మహాత్ముండు కౌరవులకు నయి కయ్యంబు సేయుటకును నాకు హితం బగుకార్యంబు బుద్ధిం దలకొనుటకుం బూనినవాఁ డతండు రాజ్యం బొసంగు నని పలికి సఖేదంబుగా ని ట్లనియె. 287

ఆ. అకట తండ్రి సచ్చినంతనుండియు మము, నరసి ప్రోచినట్టియనుఁగుఁ దాతఁ
జంప మదిఁ దలంచు టెంపు సూచితె రాజ,ధర్మ మింత క్రూరకర్మ మగునె. 288

వ. అనవుడు. 289

తే. విని మురాంతకుఁ డితఁడు శాంతనవుకడకు
నరుగఁ జూచినవాఁ డని యాత్మ నెఱిఁగి
క్రమ్మఱంగ నే తెంచెదు గాక యనిన
యన్న దీసూనుతోఁ బెటివాక్యములు దలఁచి. 290

వ. అజాతశత్రున కి ట్లనియె. 291

ధర్మరాజు రహస్యప్రకారంబున భీష్మునియొద్దకుఁ బోవుట.

ఆ. నీతలంపు లెస్స నీవు మున్న నినట్ల, కాక భీష్ముఁ డలుక గదిరి పోరఁ

---

1 గొలుపు గా.

జక్కఁ జూచెనేని శత్రువుల్ వాలియరె, యిప్పు డతనిపాలికేఁగు మధిప. 292

సీ. నీవు దన్నడిగిన నిజవధోపాయం బవశ్యంబుఁ జెప్పు దేవవ్రతుండు
మనము రహస్యవర్తనమున నందఱమును జని యమ్మహాత్మునకు భక్తి
నెఱఁగి తెల్లంబుగ హితకార్యగతి వినయంబుమైఁ బ్రార్థించి యడిగి యతని
సదయమంత్రోపదేశంబున నెగడుద మని యిట్లు హరి నిశ్చయంబు సేయ

ఆ. నయ్యజాతశత్రుఁ డనుజులు నతఁడును, దాను సౌమ్యవేషధరణ మొప్ప
నతనిగూఢవృత్తి నాపగాసుతుమంది,రమున కరిగి సముచితముగఁ జొచ్చి. 293

వ. అతనిం గాంచి యధికభక్తిం బ్రస్తుతనపూర్వకంబుగాఁ దత్పాదంబులకుం బ్రణ
మిల్లిన నతం డత్యాదరంబునఁ బేరువేర వారలందఱ నేమంబు లడిగి యిట్లనియె.

క. ఇచ్చటికి మీర లందఱు, వచ్చినపనియేమి యేది వలసిన నడుగుం
డిచ్చెద దుష్కర మైనను, జెచ్చెరఁ దలకొని ఘటింపఁ జేసెదఁ బ్రీతిన్. 295

వ. అని తెలివొందినమొగంబుతో నడిగిన దీనాననుం డగుచు ధర్మసూనుం డతని
కి ట్లనియె. 296

క. మా కెమ్మెయి సామ్రాజ్యము, సేకుఱు నెబ్భంగి బహుళసేనోత్సాద
వ్యాకులత రాక తక్కుం, జేకొని యత్తెఱఁగు కరుణఁ జెప్పఁగవలయున్. 297

క. అనవుడు నేఁ బెనఁగఁగ మీ, కనఘా సైన్యక్షయంబు నగు సామ్రాజ్యం
బును గా నేరదు గావున, నను నిర్జింపంగ శోభనము లెల్ల నగున్. 298

వ. అని పలికిన శాంతనవునకుం గౌంతేయాగ్రజుండు. 299

ఉ. చిచ్చఱకన్నుమూసికొని చేతిత్రిశూలము డాచి లీలమై
వచ్చినరుద్రుచందమున వ్రాలుదు వీ వనిలోనఁ నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టిమగవారికి నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి మెవ్విధిన్ గెలువ వచ్చు మహాత్మ యెఱుంగఁ జెప్పవే 300

క. అనుటయు ని ట్లను గంగా,తనయుఁడు నీ చెప్పినట్ల తథ్యం బది న
న్ననిమిషులు గెలుతురే చే, ధను వుండఁగ వినుము తద్విధము దేటపడన్. 301

తే. ఇట్టివానిఁ గ నన్ను మీ రెఱిఁగి యిచటి
కిందఱును వచ్చి యక్కటా యిట్టు లడుగ
మాఁకు బ్రియ మైనకార్యంబు మేయికొనంగఁ
గనుటకంటెను సుకృతంబు గలదె నాకు. 302

వ. ఏ నాయుధవ్యాపారంబువలన నుదాసీనత్వంబు నొందినను నన్ను జయింపసమకూ
రుజోడు వుచ్చినవానిని నైదువుఁ బెట్టినవానిని సిడంబు డించినవానిని నంగనను
నంగనాపూర్వుని నంగనాభిధానునిఁ దలచీర వీడినవానిని భ్రాతృహీనుని నపుత్ర
కునిం గని యేటుఁ బోటుఁ దక్కి సమరంబు సేయ మానుదు మఱియు నొక్క
వ్రతంబు పూనినవాఁడం బుట్టినప్పుడు లేక నడుమ దైవం బిచ్చినపురుషత్వంబు

గలవానితోడఁ గయ్యంబు సేయం గావున మీకు నుపాయంబు సెప్పెద ద్రుపదు
నపత్యం బైనశిఖండి యట్టివాఁడగుట మీ రెఱుంగుదుర కాదె విశేషించి ముందటి
పుట్టువున నంగన యగుట వాని కెదు రేయ కుండుదు నర్జునుండు వానిం బుర
స్కరించుకొని వచ్చి యే నేయుట మానినయెడ నొప్పించి పడ వైచు నది
పదంపడి బంధుమిత్త్రు లగు ధార్తరాష్ట్రుల గెలుచుట సుకరం బగు నిది నాపను
వేను బనిచి నట్ల చేయుం డని సహృదయంబుగాఁ జెప్పిన నట్లు దేవవ్రతుచేత
ననుజ్ఞాతులై వార లతనికి నమస్కరించి వీడ్కొని విడిదలకుం బోవుచున్న
సమయంబున బీభత్సుండు. 303

ఆ. సురనదీసుతుండు పరలోకగతి నిరీక్షించుటకును దాను గృతకవృత్తిఁ
జంప వలయుటకును సవిషాదమానసుం, డగుచు నిట్టు లనియె నచ్యుతునకు. 304

క. గురునిఁ గృతప్రజ్ఞుని ధర్మరతు వయోవృద్ధు లోకమాన్యు దయాళున్
సురతటినీసుతు వంచనఁ, బురుషోత్తమ చంప బుద్ధి పుట్టదు నాకున్. 305

ఆ. [1]నన్నుఁ బాంసుకేలి నున్న నర్మిలి నెత్తి, మేనిధూళి దనదుమేను వొరయఁ
బ్రీతిఁ గౌఁగిలించి మాతండ్రి గుణము లగ్గించి కన్ను నీరు నించునతఁడు. 306

ఉ. అక్కట తండ్రి లేనిమము నర్మిలిఁ బెంచినతాత నిమ్మెయిం
దెక్కొనఁ గా దతండు సముదీర్ణభుజాబలశౌర్యశాలి యై
యిక్కడి సేనఁ జక్కడిచె నేనియుఁ జూతున కాక ధర్మముం
దక్కుట కోర్వఁ జాలుదు నె ధర్మజుతమ్ములు క్రూరకర్ములే. 307

వ. అనిన విని కృష్ణుం డాజిష్ణున కి ట్లనియె. 308

ఉ. క్రూరత కోర్చి యించుకయు రోయక పైకొని యెల్లభంగులన్
వైరులఁ జంపి భూప్రజకు వర్ధనముం గలిగించి పాడిమైఁ
గో రరి గొంచు [2]సద్వ్యయము గోరి యొనర్చుట రాజధర్మవి
స్తారము గా బలారికి వచస్పతి సెప్పుట యప్రసిద్ధమే. 309

చ. అని మొన నోర్తు భీష్ము ననియాడిననీదగుపూన్కి లోక మె
ల్లను విని యుండగాఁ నిటు చలం బెడలం జన దెట్టు లైనఁ జం
పన తగు రాజధర్మపరిపాలన గా కిది క్రూరకర్మమే
నిను విధి పంచె శాంతనవునిం దెగటార్పఁగ వేయు నేటికిన్. 310

చ. అనుటయుఁ గ్రీడి యిట్టు లను నా ద్రుపదాత్మజుజన్మ మాపఁగా
తనయవధార్థ మం ద్రదియుఁ దప్ప దతండును వాని నేయఁ డే
ను నతని నేయుచందమున నూల్కొని యన్యుల నేయు చుందు వాఁ
డనితరవధ్యశాయుఁ డగు నాయనఁ బాఁ బడ నేయు నుగ్రతన్. 311

వ. అనవుడు నవ్వి కవ్వడికిం గమలనాభుం డి ట్లనియె. 312

---

1 నన్ను బాలకేళినున్నచో నర్మిలి, తోడ నెత్తి మేనిధూళి బెరయఁ. 2 సద్ర్వయము.

ఉ. నీ వాకరుండు దక్కఁగ ననింద్యపరాక్రమశాలి భీష్మునిం
జావఁగ నేయ నెవ్వఁడును జాలఁడు నీతలఁ పెన్నిభంగులన్
దైవముపూఁపువోలెఁ దుది దాఁకునె యవ్విధ మిట్లు లుండఁగాఁ
ద్రోవఁగ వచ్చునే యెటులు ద్రోచినఁ బోవదు చూచి యుండుమీ. 313

వ. అని పలికిన విని యతం డట్లు కాక యప్పటికి నెట్లయిన నట్లయ్యెడు నని యర్జునుం డియ్యకొనిన గోవిందుండును ధర్మనందనాదులుం బ్రమోదంబు నొంది రివ్విధంబున శిబిరంబున కరిగి పాండవులు పుండరీకాక్షుని నిజనివాసంబున కనిచి తమతమనికేతనంబులకుం జని యారాత్రి సుఖనిద్ర నేసి రని చెప్పిన సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 314

క. పాండుసుతు లేమిభంగి శిఖండిం గూర్చికొని యాపగాసుతుపై ను
ద్దండగతి నడచి రెట్లు ప్ర[1]చండతతో సమరకేలి సలిపిరి చెపుమా. 315

భీష్ముని దశమదివసయుద్ధానుక్రమము.

వ. అనుటయు నాసూతనందనుం డతని కి ట్లను సూర్యోదయసమయంబున బాండుసూనులు సేనాసమేతులై వెడలి మోహరించునప్పుడు ముందట శిఖండి నిలిపి యతనికెలంకుల భీమార్జునులును వెనుక నభిమన్యుద్రౌపదేయులును వారియిరువంకలం జేకితానశైనేయులునునట పిఱుంద ధృష్టద్యుమ్నాదిపాంచాలకుమారులము న్నిడికొని కవల సుభయపార్శ్వంబులం బెట్టికొని యుధిష్ఠిరుండును వీరిసూరెలం బొదివికొని విరాటద్రుపదముఖ్యు లగుపృథ్వీపతులను గేకయపంచకధృష్టకేతులును నిలిచి రిత్తెఱంగున గట్టిమోహరంబు దీర్చుకొని నడచి రంతకుమున్న మనవారును వెడలి భీష్ముం డగ్రభాగంబున నుల్లసిల్ల నీకుమారు లమ్మహాత్ముం బరివేష్టింపఁ గుంభసంభవతత్సంభవులు దక్షిణవామభాగంబులను గృపకృతవర్మభగదత్తపురస్సరులై కురురాజు మధ్యభాగంబునను బృహద్బలకాంభోజముఖ్యులైనమహీపతు లమ్మనుజేంద్రుచుట్టును ద్రిగర్తు లపరభాగంబునను బన్ని బలుమొన యమర్చికొని త్రోచి నడచి రి ట్లిరువాఁగునుం గవిసి వివిధతూర్యస్వనంబును నింగి ముట్ట నొండొంటిం దాఁకిన. 316

క. సమరం బప్పుడుఁ దనుజులు, నమరులునుం బెనఁగుచంద మై తోఁపఁగ భూ
రమణ విను మేమి సెప్పుదు, జముపురమున నగ్గలంపుసందడి యయ్యెన్. 317

వ. అట్టియెడ. 318

మ. కవ లుద్దామపరాక్రమస్ఫురణమైఁ గౌరవ్యసైన్యంబు సి
క్కువడం జేయఁగ భీమపార్థులును గోకొమ్మంచు నొక్కుమ్మడిం
గవియం బాండవసేన యుబ్బి యడరంగాఁ జూచి కల్పాంతభై
రవభీమాకృతి నేచి భీష్ముఁడు శరవ్రాతంబు గుప్పించినన్. 319

---

1 చండసమరకేళి నెట్లు సలిపిరి.

ఆ. కాలు కాలు పెనఁగి కాలుబలంబులు, నొడ్డగెడవుగా రథోత్కరంబు
మ్రొగ్గతిలఁగ గుఱ్ఱములు నేల యద్రువ మా, తంగఘటలు గూలెఁ దక్షిణంబ.
క. కనుఁగొని శిఖండి పెస మా,ర్కొని భీష్ముని నేసె మూఁడు క్రూరాస్త్రములం
గని యతఁడు మరలి చూడ క, తని నుద్దేశించి పలికె దరహాసముతోన్ 321
ఉ. ఎవ్వత నేని ధాత సృజియించెఁ దగఁ బ మగవానిఁ గాఁగ నా
[1]కొవ్వమిఁజేసి యట్టినిను నుగ్మలి నేయఁగ నొల్ల నాపయిం
గ్రొవ్వెసలార నీవు శరకోటి వెసం బరఁగించితేని నే
నవ్వదుఁగాని కోపము మనంబునఁ బుట్టదు సూ శిఖండినీ. 322
వ. అనినం గోపించి శిఖండియు నతని కి ట్లనియె. 323
క. గెలిచితి రాజుల నెల్లను, బలియుం డగుపరశురాముప్రతివీరుఁడ వై
యలవుకలిమి నెఱపిన నీ, చలము బలము నాకుఁ జూపఁ జాలవు కంటే. 324
క. ఏయు మొకనేర్పుమై ని, శ్లేయక క్రీడించి యరుగు మె ట్లయినను మ
త్సాయకముల నినుఁ గూల్చెదఁ, జా యెవ్వత నైతి నేమి సూచెదు నన్నున్.
క నేఁ డెమ్మెయి నైనను నీ, పోఁడిమి సెడఁ దోన తవిలి పొదువుదు నిన్నుం బ
వాఁడిమగఁ డనుట యుడుపుదు, వేఁడిమిసొం పెసఁగ నస్త్రవిద్య మెఱయుదున్.
వ. అనుచు మఱియు నయిదమ్ము లేసె నప్పలుకులు విని ఫల్గునుం డాత్మగతంబున నేఁడు శిఖండిచందంబు వింత యయి యున్నయది నదీనందనుండు సమయుటకు సమయం బైనదైవదత్తోత్సాహంబున నేచి పలికెం గావలయు నని యూహించి యుపోద్బలంబుగా నతని కిట్లనియె 327

అర్జునుఁడు శిఖండికిఁ బ్రోత్సాహంబు గలిగించి భీష్ముపైఁ గవియించుట.

ఆ. ఇట్టు లాడి పిదప నేమియుఁ జేయంగ
జాల కున్న మనల జగము నవ్వ
నేను గలుగ నిన్ను నెవ్వరి కేమియుఁ
జేయ రాదు భీష్ము నేయు మదరి. 328
వ. అనియె నప్పుడు గాంగేయుండు దొలంగి పాంచాలబలంబుపైఁ దఱిమినం దెఱపి గని పాండవబలంబులు గాండీవి మున్నుగాఁ గవిసినం గౌరవసేన దెరలి మరలినం జూచి కురురాజు సురనదీసూనుతోడ నీవు గలుగ మనసైన్యంబు దైన్యంబు నొంద నగునే యనవుడు రారాజుతో నతండు. 329
క మును పదివేవురఁ జంపుదు, నని యిచ్చినబాస వచ్చె నవనీశ్వర నీ
మనిచినఋణంబు దీర్చితి, విను లా విట మీఁదఁ దఱుఁగువిధమై తోఁచెన్. 330
ఆ. నేఁటిభంగి సూడ నృపవర పాండవు, లొండె నన్ను వారి నొండె నేను
సమయఁ జేత గలుగు సమసెదరే యొక్క, మర్త్యచేత వారమర్త్యబలులు. 331

1 కావ్వమిఁ జేయ నట్టినిను.

వ. ఐనను నాచేతిబలువు సూడుమీ యని పలికి పేర్చి పటుతరశరార్చులం బ్రచండ
నరనాథయూథంబులం బొదివికొని పాండవులకుం దేఱి చూడరాక నిర్ధూమ
దహనస్వభావుం డైనపితామహుప్రాపున భవత్పుత్త్రులు శత్రుబలంబుల బడలు
వడం జేయం దొడంగిన వారిం గనుంగొని. 332

ఆ. పాండవేయమాత్స్యపాంచాలయాదవ, పాండ్యకేకయాదిబలము లొక్క-
మొగిన త్రోవనీదు మొనలు మాఱొక్కనుటయు,నపుడు పోరుఘోరమయ్యెనధిప.
వ. అట్టియెడ నర్జునుండు శిఖండి నాలోకించి. 334
తే. నీవు భీష్మున కలికినఁ బోవ దేను,గలుగ వెఱ పేల యతనిపైఁ గవియు మెయిది
కొని మదీయబాణంబులఁ గుప్పఁగూరఁ,బఱపి కూల్చెద నీతనిఁ బటురయమున.
వ అనిన నాతనిపలుకులు విని యెలుంగెత్తి ధృష్టద్యుమ్నుండు. 336
క. మనయోధు లందఱును శాం,తనవునిపైఁ దఱుమఁ డింద్రతనయుఁడు గలుగన్
మన మతనికి శంకింపఁగఁ, బని లే దని పలికి యార్చి బలువిడి నడరెన్. 337
వ. అప్పుడు ధర్మజభీమనకులసహదేవులును సుభద్రాతనయద్రౌపదేయులును ద్రుపద
విరాటులును సాత్యకిచేకితానధృష్టకేతుకేకయమాగధులును మఱియునుం
జేయం గలరథికులు నొక్కపెట్ట బెట్టడరిన నిక్కడ గురుపుత్త్రభూరిశ్రవసులును
గృతవర్మకృపకాలభోజపతులును వికర్ణదుర్ముఖవివింశవిచిత్రసేనులును లోనైన
యోధులు దేవవ్రతునకుం దలకడచి వారిం దలపడి రిట్లు మందాకినీనందను
పయిం గవియుపాండవసైనికులను నతని కడ్డపడుకౌరవ్యవీరులను జూచునెడ
సురల కనిమిషత్వంబు సార్థకం బయ్యె నయ్యవసరంబున. 338
క. మొనసి శిఖండిని ము న్నిడి,కొని యురవడిఁ దఱుమునరునకును వెస దుశ్శా
సనుఁ డడ్డపడియెఁ బొంగిన,వననిధికిని వేలవోలె వసుధాధీశా. 339
వ. ఇట్లు నిలువరించి. 340
క. ఇరువురఁ గృష్ణుల నాతం, డిరువదిబలునారసముల నేసెం గ్రోధ
స్ఫురితుఁ డయి నొంచెఁ గ్రీడియు, నరనాయక యతని నూఱు నారాచములన్.
తే. అతఁడు నొచ్చియు నాటించె నైదుదూపు,లింద్రసుతుఫాలమున నాతఁడేచివిల్లు
దునిమి పెల్లేయఁ [1]దలఁకక దుస్ససేనుఁ, డన్యధనువున నిరువదేనమ్ము లేసె. 342
క. ఆతూపులు నఱికి పరి,స్ఫీతం బగునారసంబు పృథుతరవక్ష
స్స్యూతంబు సేసి విజయుఁడు, నీతనయుని మూర్ఛవుచ్చె నిష్ఠురవృత్తిన్. 343
వ. ఇట్లు దుశ్శాసనుండు సోలి వ్రాలుటయు. 344
క. సారథి యరదము భీష్ముని,తేరివెనుక [2]కెగిచె నంతఁ దెలి వొంది ధృతి
స్ఫారుఁ డగునక్కుమారుఁ డు,దారగతిన్ మగిడి వచ్చి తాఁకెం గ్రీడిన్. 345
వ. తదవసరంబున సాత్యకితో నలంబుసభగదత్తులును నభిమన్యుతో సుదక్షిణుండును

---

1 దరలక; చెరలక. 2 కరి గ.

విరాటద్రుపదులతో నశ్వత్థామయు సహదేవునితోఁ గృపాచార్యుండును నకులు
నితో వికర్ణుండును ఘటోత్కచునితో దుర్ముఖుండును భీమసేనుతో భూరిశ్రవ
సుండును జేకితానుతోఁ జిత్రసేనుండును ధర్మనందనుతో నస్త్రగురుండును దల
పడిన బెట్టిదం బగుబవరం బయ్యె నం దిరుదెఱంగులయోధులు నన్యోన్యధ్వజ
భంజనంబును బరస్పరతురగహననంబును నితరేతరసూతనిపాతనంబును మిథః
కోదండఖండనంబును జేయుచుండం బటుతరశరసంపాతసంపాదితశంపాజాలకా
భీలంబును భీషణగుణరణనగర్జాస్ఫూర్జితంబును రక్తధారాసారఘోరంబును
నగునపూర్వపర్జన్యసమయంబు దోఁచె నప్పుడు గయ్యంబుకలరూ పంతయుం
గనుంగొనుటకు మింటిక్రేవ నున్నవెరవుగా దనుపసువ సవిత్రుండు చక్కని
మింటికిం జనుదెంచె [1]నట్టియెడ. 346

మ. పటుదుశ్శాసనబాణపంక్తి నతిదర్పస్ఫూర్తిమైఁ ద్రుంచి యు
త్కటకోపానలదీప్తవక్త్రుఁ డగుచుఁ గాండీవి పెల్లేయుడుం
ద్రుటితజ్యాలతికాధనుర్ధ్వజుఁడు నిర్లూనాఖిలాంగుండు నై
రటదశ్వం బగుతేరితో నతఁడు సంత్రాసంబునం బాఱెనన్. 347

తే. ఫల్గునుఁడు భీష్ముముందటిబలము నెల్లఁ, జటులరథవల్గనుం డయి చంపుచున్నఁ
జూచి ద్రోణుండు గురురవస్ఫురణఘూర్ణ, రోదసీభాగుఁడగుచుమార్గొనఁ గడంగి.

ద్రోణాచార్యులశ్వత్థామను భీష్మునకు సహాయంబుగాఁ బంపుట.

వ. అక్కడ నడచినం గౌంతేయాగ్రజుండు తోడన తవిలి సేనాసమేతంబుగా నడ్డ
పడి పోనీక పెనంగుచుండ నక్కుంభసంభవుండు. 349

క. అప్పుడు [2]క్రోధమునం గను, నిప్పులు రాలంగఁ దనకు నెఱసంగడమై
యొప్పినతనయున కిట్లని, చెప్పెం దత్కాలగతివిశేషము లెల్లన్. 350

చ. తడఁబడె దివ్యబాణములతంత్రము మంత్రము దప్పెడుం గడు
న్వడఁకెడుఁ జాపదండము మనంబును నాకు వశంబు గాదు వీ
డ్వడియెడుఁ జెయ్వు లంగము గడంక దొఱంగెడు నేఁటిభంగిఁ గ
వ్వడి తనపూన్కి దీర్చుట ధ్రువం బని బుద్ధి జనించెఁ బుత్రకా 351

వ. అతనిమును మటు తల యెత్తి చూడుము. 352

క. కూలెడుగుఱ్ఱంబులు ధర, వ్రాలెడు నేనుఁగులుఁ గెడయురథములు నై యా
భీలయుగాంతసముద్భట, కాలపురోభాగరేఖ గానఁగ నయ్యెన్ 353

వ. అదియునుంగాక. 354

తే. అదరి కురుసేనపై గ్రద్ధ లాడఁ జొచ్చెఁ, బడుచు నున్నవి యుల్కలిక్కడవినంగ
వచ్చె నతిరూక్షభంగి శివారుతంబు, లాపగానందనునకుఁ గీ డావహిల్లు. 355

---

1 ననుకరణి మధ్యాహ్నం బయ్యె నట్టియెడ. 2 క్రోధము గన్నుల, నిప్పులు.

వ. యుధిష్ఠిరు మొగంబునం గ్రోధం బగ్గలంబై తోఁచుచున్న యది ద్రౌపదేయనకుల సహదేవసహితుం డయి తలుముసతని మిగిలి నాకు రా రాదు నీవు దేవవ్రతు పాలికిం బోయి యతనికి దాపట వలపటం బ్రాపై నిలువు మిసి ప్రాణంబులు డాఁచుసమయంబుగా దని పలికి పనిచిన నశ్వత్థామ యుద్ధామగతిం జనియె నక్కడ భీమసేనుండు. 356

క. నరుఁ డేచి శిఖండిఁ [1]బురస్కరించుకొని యపుడు భీష్ము సమయింపఁగ స త్వరుఁ డగుటకుఁ దగ రణతత్పరుఁ డై కురుసేనమీఁదఁ దఱిమెం బెలుచన్. 357

వ. ఇట్లు దఱిమి గాంగేయుముందటిబలంబుల బారిసమరం దొడంగిన భగదత్తకృప కృతవర్మశల్యసైంధవచిత్రసేనదుర్మర్షణవిందానువిందకర్ణులు పదుండ్రు నొక్క పెట్టె యతనిం బొదివి నానాస్త్రసంతానంబుల నొప్పించిన నొచ్చియుం జలింపక పోరునమ్మారుతిం గనుంగొని కిరీటి తోడై తఱియ నుఱికి ధనువులతునియలను బాణంబులపఱియలను గేతుచ్ఛత్త్రచామరంబులచెక్కలను భూషణంబులపొళ్లను బుడమిం గప్పినంజూచి సుయోధనుండు సుశర్మాదిభూపాలకుల నాలోకించి యాభీమార్జునులం దాఁక నియోగించిన. 358

క. ముందటిపదుండ్రు నానృపు, లందఱునుం గూడి పెనఁగి యయ్యిరువురచే తం దూలపోవఁ జొచ్చినఁ, గ్రందుగ బలుమొనల నెల్లఁ గవియం బనిచెన్. 359

వ. ఇవ్విధంబునం బెక్కుమొనలు పయిం బడిన నయ్యిరువురకు బోరు భరం బగుట యెఱింగి సౌభద్రసాత్యకిప్రముఖు లగురథికజనంబులు సైన్యోపేతంబుగాఁ దోఁచి యేచిన. 360

క. పాండవబలములయుత్యుద్దండపరాక్రమము సూచి దర్పోద్ధతవే దండములఁ గనియ కేసరి, చండత భీష్ముండు వాడివె శరనఖరములన్. 361

క. డొల్లెడుసూతులుఁ బెలుచం, ద్రెళ్లెడుతురగములుఁగా నతిక్రూరగతిం బెల్లేయుచు సత్వరముగ, నెల్లెడలం దాన యగుచు నేత్తెఱఁ బొదివెన్ 362

వ. ఇట్లు పెద్దయుంబ్రొద్దు విహరించి యపరాహ్ణం బగుటయు నతం డాత్మగతంబున.

తే. ఉత్తమక్షత్త్రియుల నెల్ల నుగ్రవృత్తి, నేఁడు పదినాళ్లు లేని నానిశితశరచ యములఁ గూల్చితి వేసరినట్టు లయ్యె, మేనితోడిపా త్తింకిట మానుటొప్పు. 364

వ. అని తలంచి తొలంగి బలంబులం దెరల్చికొనుచుం గయ్యంబు సేయుచందంబునం గౌంతేయాగ్రజుం గదిసి యల్లన యతనితో ని ట్లనియె. 365

క. జనియించినంతనుండియు, జనపతులం గ్రూరవృత్తిఁ జంపుచు నుండం జనియెం గాలము విసివితి, ననఘా యే నింకఁజాల నాసురవిధికిన్. 366

ఆ. మీరు నాహితంబు గోరుదు రేని శిఖండి మున్ను గాఁగఁ గడఁగి యంత వట్టువారు నొక్కపెట్టకాఁ బైఁబడి, యేయుఁ డింకఁ దడవు సేయ వలదు 367

---

1 బురస్కరుఁడుగఁ గొని.

వ. అని పలికి సమరప్రకారంబునం[1]దేరు గ్రేళ్లుదోలి పాంచాలబలంబులపయి నడరె నప్పు డయ్యాజాతశత్రుండు సమీపవర్తి యగుధృష్టద్యుమ్ను నాలోకించి. 368

క. దేవవ్రతుపలుకులు విం,టే వేగమ పనుపు మొక్కటిగఁ దఱుమఁగ యో ధావళి నెల్లను భీముఁడు, నీవును నరుతోడఁ గూడి నిగుడుఁడు పెలుచన్. 369

వ. అనవుడు నతండు. 370

సీ. మాత్స్యకైకేయాది మనుజేంద్రులకుఁ జేయఁ గలయట్టియోధవీరులకుఁ జేయి సూపి మసన్నదీసూనుపైఁ గవియింపఁ బవనజపార్థులప్రాపుకలిమి వెఱపేది యందఱుఁ దఱుమఁ గౌరవపతి తమ్ములు దొరలును దానుఁ దాఁకఁ గడచి తాఁకినఁ బోరు ఘనమయ్యె నప్పుడు సౌభద్రుఁ డమ్మహీశ్వరుని నొంచె

తే. ద్రోణతనయుండు శైనేయు బాణమయశ,రీరుఁ గావించెఁ జేదీశపౌరవు లస [2]మానఘోరాక్రమం బొప్పె మారుతాత్మ,జుండు రారాజు నేనికిపిండుఁ జదిపె.

వ. మఱియు నందు నిందును మందాకినీనందనుపయిం ద్రోవను నతనిం గావను దలంచి కడంగినసైనికు లనేకులు నానాప్రకారంబుల వివిధాయుధంబులం బెనంగుచుండ. 372

క. మొనసి మృగేంద్రు మృగేంద్రుఁడు, చెనయం జనుపగిది నరుఁడు శీఘ్రగతిఁ శాం తనవుపయిఁ గవియ దుశ్శాసనుఁ డడ్డము సొచ్చె దేవసంఘము వొగడన్. 373

ఆ. అతని కప్పు డెదుర నమ్మైన నెవ్వరుఁ, జాలరైరి సవ్యసాచి యొకఁడ నిశితవిశిఖపంక్తి నిగిడించి నొప్పించి, యొత్తి భీష్మువెనుక కొదుఁగఁ జేసె. 374

వ. తదవసరంబున సరభసంబున. 375

క. భగదత్తుని నాకవ్వడి, వెగ డొందఁగఁ జేసి యతని వెల్లినుఁగుఁగెం పుగఁ జేసిన నాతండును, నిగిడెం బాంచాలమేదినీపతిమీఁదన్. 376

వ. ఆఖండలనందనుండును శిఖండిం దఱిమి తెఱపి సూపి దేవవ్రతు నేయు మని పురికొలిపె నంత. 377

క. మనయోధప్రకరము శాం,తనవుం దలకడచి యత్యుదగ్రత నయ్యా ర్జునుఁ బొదివె నతం డలిగినఁ, బెనుగాలిం దూలు మొగిలుపిండును బోలెన్. 378

ఆ. అట్టియెడ శిఖండి యాపగాసుతుమీఁద, వాలుటమ్ము లేయ వాని నేయ నొల్ల కతఁడు గెలనియోధవీరావళి, నేయుచుండె శౌర్య మెసక మెసఁగ. 379

క. నరుఁడు శిఖండిం దఱిమిన, శరము లతఁడు భీష్మునురుభుజామధ్యమునం గురియఁగ నవ్వుచు నుండెం, గరి యంత్రజలంబు దొరఁగఁ గానున్నక్రియన్. 380

వ. ఇట్లు దేవవ్రతుండు శిఖండి యేయుట సరకు సేయక యతం డగ్గమైన నేయక సాయకంబులు సవ్యసాచిపయి నిగిడింప మగిడి దుశ్శాసనుండు గడింగి కవ్వాడి వెగడుపడునంతకయ్యంబు నేసి నొచ్చి పాసినం గౌరవపతి గనుంగొని యులుంగు

---

1 జేరు గేళ్లు దోలి. 2 మానవిక్రము లై యొప్ప మారు.

సూపి చేయి వీచి పురికొల్పినం గళింగమాళవబాహ్లీకవిదేహాశూరసేనప్రముఖ బలంబులు బలమర్దనుతనయుదెసకుం గవిసిన. 381

తే. అతఁడు దివ్యాస్త్రజాలంబు నతిశయంబు, సూపి చతురంగబలముల రూపుమాపి యుఱక తఱిమి శిఖండికిఁ దెఱపి సూప, వాఁడితూపులు భీష్ముపై వాఁడు నినిచె.

వ. ఆసమయంబునం గృప శల్య వివింశతి వికర్ణులం గూర్చికొని పేర్చి దుశ్శాసనుండు శాంతనవున కడ్డపడినం బార్థుం డయ్యేపురను విరథులం జేసిన. 383

క. కురుపతియు ననుజవర్గముఁ, బరమక్రోధమునఁ దెంపు బలుపును మెఱయం గా సురనాథనందనునిపై, నురవడిఁ ద్రోచుటయు సేన లుగ్రత నడరెన్. 384

క. పాండవబలములు దలపడి, భండన మొనరింప నగ్రభాగంబున ను ద్దండతఁ బోరెడుమనుమల, తండము గని మెచ్చి యప్పితామహుఁడు వెసన్. 385

తే. అరిబలంబు పై నొక్కదివ్యాస్త్ర మేయఁ
దలఁచి యరిఁబోసి తిగిచి యుదగ్రవృత్తిఁ
గవిసి ముందట నున్న శిఖండిచూడ్కి
దొడరుటయుఁ డాల్మిమైఁ దెగ [1]యుడిపె నధిప. 386

వ. అంత. 387

క. సోమకమాత్స్యప్రముఖో, ద్దామబలము లేచి పెలుచఁ దఱుముటయును సం గ్రామతలము సేనాంగ, స్తోమాంగమయంబు సేసె దుర్దాంతగతిన్. 388

క. సేనల నిమ్మెయి భీష్ముఁడు, దీనతఁ బొందింప [2]నలిగి ధీరత్వము వీ రానీకం బగ్గింప శ, తానీకుఁ డెదిర్చె నతని నాసురభంగిన్. 389

విరటుతమ్ముఁ డగుశతానీకుండు భీష్మునిచేఁ జచ్చుట.

వ. ఇట్లు దాఁకి విరటుతమ్ముండు వాలమ్ముల నొప్పించినం గోపించి. 390

శా. విల్లుం గేతువుఁ ద్రుంచి సూతు వెస నుర్విం గూల్చి రథ్యంబులన్
డొల్లం దీవ్రత నేసి యాతఁడు భుజాటోపంబు శౌర్యంబు శో
భిల్లన్ వైచిన శక్తియుం దునిమి యాభీలద్యుతిప్రస్ఫుర
ద్భల్లం బొక్కటి భీష్ముఁ డేసి నఱకెం దన్మస్తకం బుగ్రతన్. 391

వ. ఇవ్విధంబున శతానీకుం జంపిన. 392

క. మొన లెల్ల విఱుగ మధ్యం,దినమునయినుమాడ్కి బయలఁ దేజోనిధి శం తనుసూనుఁ డొప్పె నప్పుడు, గనుఁగొని యిట్లనియె శౌరి గాండివితోడన్. 393

క. మనమోహరములు సెడి కను,కనిఁ బాఱెదు నిప్పు డాపగాసుతునకు గ్ర క్కున నీవు మార్కొనక తక్కినఁ గార్యము దప్పుఁ బొదివి గెలువుము కడఁకన్.

వ. అనిన విని యతండు రథరథ్యసారథిసహితంబుగా సురనదీనందను నమందమార్గణ పుంజంబునం బొదివె శిఖండియుం జేరి నారాచంబుల నొప్పించిన దేవవ్రతుండు

---

[1] యుడిచె నధిప. [2] గడఁగి.

వాని నేయ నొల్లనిసందున నాసవ్యసాచి యతనివిల్లు దునిమి పెల్లేయుచున్నం
జూచి సైరింపక శల శల్యకృప కృతవర్మచిత్రసేనభూరిశ్రవగ ప్రభృతివీరలోకం
బతిలోకంబుగ దివ్యాస్త్రజాలంబులు నెఱపుచు [1]నేయుచు భీష్మున కడ్డపడుండు
దలకడవుం డనునెలుంగులు నింగి ముట్ట బలసమేతంబుగా నడరినం గని సమీర
నందనసాత్యకిసౌభద్రవిరాటద్రుపదఘటోత్కచప్రముఖయోధవర్గం బనర్గళభంగిం
దఱుమం దత్సైన్యంబులు గూడుకొని కవిసిన దివిజదానవసంపాతసమయసమరం
బయ్యె నందుఁ బురందరనందనుండు మనస్సైనికులకందఱ కన్నిరూపులయి యైంద్ర
వారుణాగ్నేయాదిమహాశరంబులం దెరల్చుచు సురక్షితుం డైన శిఖండిం బురి
కొల్పికొని మీతండ్రి నేయించుచు నతం డెన్నివిండ్లెత్తిన నన్నిటిం దోడ్తోన
తునుమాడుచుండె నాక్రీడిపై నతం డుగ్రశక్తి ప్రయోగింప నదియునుం ద్రుంచి
సూతునిం గేతనంబునుం గూల్చిన. 395

సీ. మనమున భీష్ముఁ డిట్లని వితర్కించుఁ బాండవుల నాయొక్కవింటన కడంగి
గెలువనే వీరికిఁ గృష్ణుండు ప్రాపు గాకున్న నిం కది యట్టు లుండనిమ్ము
కృష్ణుఁ దోడుగఁ గొని కీడ్పడి వీరలు వచ్చినఁ జెప్పితి వధవిధంబు
సమర ముపేక్షించి శాంతిమై నుండెద నడిచిపా టేటికి ననఁగ నెఱిఁగి .
తే చదల సుర లిట్లు మే లిది సమ్మతంబు, మాకు నని ప్రీతిమైఁ జెప్పుమాట లాతఁ
డొక్కరుండును వినియె నేనొకఁడు వింటి,మునిమహానుభావంబున మనుజనాథ.

వ తదవసరంబున సూక్ష్మజలశీకరశిశిరం బగుమారుతంబు మరుత్తటినీతనయుమీఁద
సుడిసె సురదుందుభులు మ్రోసెఁ గుసుమవర్షంబులు గురిసె నవియు నన్య
గోచరంబు లయ్యె నిట్లు నిశ్చయించియు నమ్మహాత్ముం డూరకున్నం గెలనికొక
భంగి యై తోఁచు నని తలంచి. 397

తే. ఒక్క విల్లెక్కువెట్టంగ నుఱక వెస శి,ఖండిపటుమార్గణంబులఁ గడఁగి చేయ
నతఁడుమిసిమింతుఁడును గామి కల్లనవ్వి, పఱ పెఁదనయమ్ము లతనిపై ఫల్గునుండు.

వ. శాంతనవుండును సముల్లాసంబున నేసిన. 399

క. నరుఁడు దనమీఁదఁ దొరఁగెడు, శరములు వారించి యతనిచాపం బధిక
త్వరితగతిఁ ద్రుంచి యతని,స్థురనారాచంబు దనువు సొర నేయుటయున్. 400

వ. తమకుం దమయోధవరులకుఁ వారింపం జేరం జెనయం గొలఁది కాక వెల్లివిరి
సినశరనిధిభంగిం బొంగినవివ్వచ్చు వెఱఁగుపడి చూచుచుం దన్ను విడువక
కెలంకుల నున్నకొడుకులం గనుంగొని మీతండ్రి రారాజుతో ని ట్లనియె. 401

మ. అని దేవాసురకోటి కైనను నశక్యం బిమ్మహావీరు మా
ర్కొన వీఁ డల్గిన మర్త్యు లేరెదు రుదాగుం డైనయాక్రీడి ద
క్కిన నిప్పాండవసైన్య మింతయును వ్రగ్గింపంగ నేఁ జాలుదుఁ

---

1 నేయుండు భీష్ము.

యు నీవు నెఱుంగుదు వెఱింగియు న న్నడుగ నేల భువనత్రయంబునందును
వస్తుప్రకారంబులు నీయెఱుంగనియవియుం గలవే యది యట్లుండె నితండు దీని
నగ్గురుకరుణం బడసినవాఁడై. 200

క. విను మాఁటదివోళెం దన, తనువున కడ్డంబు గాఁగఁ దగిలిచికొన్నాఁ
డనఘ యిటులైన నెట్లగు, నని యెఱుఁగఁడు దీనివిధము లన్నియుఁ దెలియన్

క. నావింటిబలువుఁ జేతుల, లావును జూడు మిదె నీతలం కుడుగఁగ నే
నీవిభునిఁ గవచరక్షితుఁ, డై విలసిల్లంగ నీక యలఁచెదఁ గృష్ణా. 202

వ. అంగిరసుం డమరపతికి నొక్కమహాస్త్రం బిచ్చె దాని నతండు నా కొసంగె నది
నిఖిలకవచనిర్భేదనశీలం బై యుండు దాని నిమ్మెయిమఱు వఱువుళ్లు సేసెద. 203

క. అని వేస నాదివ్యశరం, బనూనమంత్రప్రకాశ మగునట్టులు గా
గొనయమునఁ జేర్చి తిగిచినఁ, గని యశ్వత్థామ బాహుగర్వం బలరన్. 204

తే. అధిప సర్వాస్త్రఘాతి యై యతిశయిల్లు
నస్త్రమునఁ జిత్రముగఁ [1]దెగ యంద తునిమె
నమ్మహాస్త్రంబు న ట్లది వమ్ము గాఁగ
నెఱిఁగి వెఱఁ గంది హరికతఁ డిట్టులనియె. 205

వ. ఆచార్యపుత్రునస్త్రప్రభావంబున నవ్విశిఖంబు వినిహతం బయ్యెఁ బునఃప్రయో
గంబు సేసిన నది యొప్పమి సేయు నని వింటి నావింటిబలిమిన సాధించెదం
జూడు మనునవసరంబున నయ్యురువురను దుర్యోధనుండు 206

క. తొమ్మిదితొమ్మిదివాలిక, యమ్ముల ము న్నేసి పటుశరాసారము పైఁ
గ్రమ్మించిన మనదెసఁదూ,ర్యమ్ములునుం గీర్తనములు నార్పులుఁ జెలఁగెన్. 207

ఆ. అలిగి యవుడు గఱచియన్నరుఁ డానృపు, తురగములను సూతుఁ దునిమి వైచి
రథము నఱికి యధికరయమునఁ దఱచుగ, నాఁటెఁ గరతలముల నారసములు

వ. ఇట్లు విరథుండును వికలహస్తుండును నై విషణ్ణుం డగుచున్నరనాథుండు వెడం
గగుటం గటకటంబడి యాకంకటంబు నిష్ఫలం బనుబుద్ధిం బుచ్చి వైచి యొం
డొకకవచంబు దొడిగె నయ్యెడరు గనుంగొని శీఘ్రంబునం దత్సైనికోత్తములు
చతురంగబహుబలంబుతోఁ గవిసి కవ్వడిం జుట్టి ముట్టి యలుఁగులసోనలు
గురిసిన నతండు సంరంభవిజృంభితుం డగుటయు 209

చ. అఱిముఱిఁ ద్రెళ్లెఁ దేరులు గజావళి గూలెఁ దురంగమాంగము
ల్గిఱిగొనియెఁ మహిఁ భటులు లెక్కకు మిక్కిలి సేన పాడుగా
నఱుమయి రప్డు కృష్ణుఁడు నినాదము భూగగనాంతరంబునం
దఱచు గ నొత్తె నిర్మథితదానవసైన్యముఁ బాంచజన్యమున్. 210

తే. అట్లు భీషణ మగునర్జునాక్రమంబు, ఘోర మైనమురారిశంఖారవంబు
నధికభయసంభ్రమంబులనావహింప, నధిప నలుగడఁ బఱచె సైన్యంబు గలఁగి.211

---

1 తెఱయంగఁ.

వ. ఇత్తెఱంగున. 212
క. మును సంకటపడి మూఁకలు, గనుకని విచ్చుటయుఁ బిదప గాండివి మెఱసెం
బొనుఁగుపడి యుండి తగుగా,డ్పున మండుమహానలంబుపోల్కి మహీశా. 213
వ. అయ్యవసరంబున సింధు రాజరక్షకం బైనబలంబు సంక్షోభసహితం బగుసుత్సా
హంబునం బొదలి శంఖభేరీపణవాదిక్వణనమేదురసింహనాదభరితరోదసీకుహరం
బయ్యె నచ్చిడిముడిపడుట యవలోకించి. 214
క. మందస్మితసుందరవద, నేందు లగుచు హరియు నరుఁడు నేత్తెఱఁ బ్రియముల్
డెందములం బొంద భవ, న్నందనుపై నురవడించినం గని కడఁకన్. 215

—◎ వృషసేనుండు లోనగుసేనమంద్రుల్ రథికు లొక్కపెట్ట యర్జునుపైఁ గవియుట. ◎—

క. వాలఁ బొదువ నడరుబలు, తేరుల మొత్తముల మిగిలి దీప్తపటురథో
దారు లగుచు నెనమంద్రురు, వీరులు దఱిమిరి నితాంతవేగోజ్జ్వలు లై. 216
వ. వా రెవ్వ రెవ్వ రంటేని. 217
క. దండిమగ లైనవృషసే,నుండు శలుఁడు సైంధవుండునుం గృపుఁడును గ
ర్ణుండు గురునందనుఁడు శ,ల్యుండును భూరిశ్రవుండు నుర్వీనాథా. 218
వ. అందఱు నొక్కమొగం బై. 219
క. తన వైనప్రతిన నెఱపుట, కును ముఖ్యోపాయ మది యగుట నట్లు సుయో
ధనుఁ బరిమార్పఁ గడఁగుఫ, ల్గునుఁ దలపడి రాత్మశంఖఘోషంబులతోన్. 220
క. అట్టియెడ దేవదత్తము, బి ట్టొత్తె నరుండు పెక్కుపిడుగులమ్రోఁతల
బెట్టు వఱచుతన్నినదము, పుట్టించెను దిగులు నీదుపుత్రకుసేనన్. 221
తే. చెవులు బీఁటలువాఱంగఁ జెలఁగునమ్మ, హారవమ్మున కులుకక యతనిమీఁద
విభుఁడుఁగర్ణాదులును శరవృష్టి గురిసి, రడరి సైంధవుదిక్కున కడ్డపడుచు. 222
వ. ఆసమయంబున నశ్వత్థామ యుబ్బి డెబ్బదిమూఁడుమార్గణంబుల మురవైరిని
భల్లత్రయంబునం బార్థుని నైదుశరంబులం దురంగంబులం గేతువు నేసిన నవ్వా
సవి యతని నూటయాఱింటను గర్ణునిఁ బదింటను వృషసేనుని మూఁటను
నొప్పించి యొక్కక్తివాతియమ్మున శల్యుచాపంబు ముష్టికిం ద్రుంచిన. 223
సీ. వేగంబ వే ఱొక్కవిలు గొని మద్రేశుఁ డతనిపైఁ దొమ్మిదియమ్ము లేయ
ముప్పదిరెంటను మూఁట నేనింటను బదియింట నఱువదిబాణములను
గర్ణభూరిశ్రవకర్ణనందనకృపగురుపుత్త్రు లేసి రన్నరుని మఱియు
నాతనిమీఁద దివ్యాస్త్రంబు లైదు గోవిందుమై సప్తతివిశిఖములును
తే. ద్రౌణి నిగిడించె నట్టిసందడి జయద్ర,థుండు వారలమఱువున నుండి పఱపె
సరభసముగఁ ద్రిసప్తతిసాయకంబు, లమ్మహాబాహుదెసఁ గౌరవాధినాథ. 224
వ. ఇట్లు పెక్కం డ్రొక్కపెట్ట పె ల్లేసినం గినుక నూనిననవ్వు రౌద్రరసంబు
నలంకరింప, 225

క. వడి రాధేయుని నాతని, కొడుకును బండ్రెంట మూఁటఁ గుదియించుచుఁ గ
వ్వడి యొకబలుతూఁపున నెక్కుడురయమునఁ దునిమె శల్యుకోదండంబున్.
ఆ. తునిమి తోన యతనిఁ దొమ్మిదియమ్ముల, స్రుక్కఁ జేసి మూఁట సోమదత్త
తనయు నెనిమిదింట ద్రౌణిని నిరువదే,నింటఁ గృపుని నొంచి నిలువరించె. 227

వ. మఱియు నిరువదిమెఱుంగువాలమ్ము లశ్వత్థామయంగంబునం గ్రుచ్చె ని ట్లిందఱ తోడను గ్రందుకయ్యంబు సేయుసమయంబున నొక్కొక్కమరి వారిపిఱుంద [1]నోర వాఱం దోఁచుజయద్రథు నేయం దీఱ కున్నం దమకంబున నెడనెడ నతి ముఱిం దద్రథంబు దెసకు నతఁడు వాఱ విడిచినవిశిఖంబులు నూఱు గల వప్పుడు భూరిశ్రవుండు వాసుదేవునిచేతిమునికోల నొకకోలం దునిమి కదిసి కిరీటిమేనం ద్రిసప్తతిశరంబులు వరఁగించెం దక్కటివారును నొక్కమొగిం గ్రూరనారాచం బులు గుప్పించి నొప్పించిన 228

శా. కోపాటోపమహోగ్రమూర్తి యగుచుం గోదండటంకారలీ
లాపూర్ణంబుగ భూనభోంతర మతం డయ్యోధులక్ బాణజా
లాపాతంబునఁ దూల నేసి చటులవ్యాపారఘోరానిలా
క్షేపక్షోభితవారివాహచయభంగిం జూపె నేపారఁగాన్. 229

వ. అట్లు విచ్చియుం గూడికొని మూఁకలం గూర్చికొని యొండొరులం బురికొల్పికొని.
క. ఆరథికు లొక్కమొగి నవ్వీరునిపైఁ గవియుటయును విస్ఫురితశరా
సార మతఁడు నిగిడించిన, వారిబలము లెల్ల రక్తవారిం దేలెన్. 231

వ. ఇత్తెఱంగునం దెరలుచుం బొదువుచు భవదీయసైనికలోకంబు వోక పెనంగె ననిన విని యప్పు డేమేమియడియాలంబులతో నెవ్వ రెవ్వరిసిడంబులు మెఱసి యుండె నని యాంబికేయుం డడిగిన సంజయుం డి ట్లనియె. 232

సీ. ప్రస్ఫురద్వానరపతియును సింహలాంగూలంబు నుజ్జ్వలగోవృషంబు
వారణకక్ష్యయు భూరిమయూరంబు సీతయుఁ గాంచనసింధురంబు
రత్నయూపంబును రజతవరాహంబు నుద్దీప్యమానమహోరగంబుఁ
గేతనంబుల నొప్పుఁ గ్రీడికి నాచార్యసుతునకుఁ గృపునకు సూతజునకు
తే. నతనినందనునకును మద్రావనీశ్వ,రునకు శలునకు భూరిశ్రవునకు సైంధ
వునకు రారాజునకు నిట్లుదనరి మెఱయుఁ,బడిసిడంబులునభమునఁబ్రబలునిగుడ.
క. మనతొమ్మిదిసిడములకం,టెను నుజ్జ్వల మగుచు నొక్కటియ పైకొ యొం
దును దాన తోఁచు నయ్యర్జునుసిడము మహోగ్రతం గురుక్షితినాథా. 234
తే. అనుడు నమ్మేదినీశుఁ డి ట్లనియె నట్లు, క్రీడి విస్మయావహరణక్రీడ సలుప
గురునిదర్పంబుచే నాఁకగొనినధర్మ, సూనుసైన్యంబు లెట్లయ్యె సూతతనయ.
వ. అనుటయు సంజయుం డతని కి ట్లనియె. 236

[1] నరవాఱం.

క. అర్యొడ [1]ఖేచరులకు వెఱఁగయ్యెడుచందమున నట్టియవసరమున బ
ల్కయ్యము గురునిబలముతో, నయ్యె యుధిష్ఠిరబలోచ్చయంబున కధిపా. 237

వ. ఆసంకులసమరంబున బృహత్క్షత్త్రుని క్షేమధూర్తియు ధృష్టకేతుని వీరధన్వుం డును నకులుని వికర్ణుండును సహదేవుని దుర్ముఖుండును సాత్యకిని వ్యాఘ్ర దత్తుండును దలపడిరి శల్యుండు సేనాముఖంబునకు వచ్చుచుం బోవుచున్నవాఁ డగుట నుచితంబుమెయి నచ్చటియనికిఁ జొచ్చి ద్రౌపదేయులం దాఁకె భీమ సేనుని నలంబుసుండును ధర్మనందను నాచార్యుండును మార్కొని రప్పు డయ్యుధిష్ఠిరుండు. 238

## ధర్మరాజు ద్రోణునితో యుద్ధము సేసి యోడిపోవుట.

క. గురు మెయిఁ దొమ్మిది సునిశిత,శరముల నిసుచుటయు నతఁడు సక్రోధుం డై
యిరువదియేనిట నాతని, యురస్థ్సలము నొంచి పొదివె నుగ్రాస్త్రములన్. 239

క. రథమును నశ్వమ్ముల సా,రథిఁ దన్నును గప్పుశరపరంపర లెల్లన్
వృథ సేసెం గరలఘుతా, ప్రథితుం డగుధర్మసుతుఁడు బాణౌఘములన్. 240

చ. అలిగి గురుండు ధర్మజుశరాసన మేర్తెఱఁ ద్రుంచి పెక్కు ల
మ్ముల సతురంగసూతముగ ముంచె రథం బది యెల్లఁ జూచి సే
న లతఁడు పేర్చె నిమ్మనుజనాథుఁడు సచ్చునొ యోడి పాఱునో
బలిమిఁ దొఱంగి పట్టుపడి పా డఱి పోవునొ యంచు నున్నెడన్. 241

క. ఒండొకవిలు గొని ధర్మసు,తుం డానిబిడాస్త్రసంతతులు రయముమెయిన్
ఖండించి తీవ్రరశ్ముల, మండెడుఘనశక్తి వైచె మార్తురు దలఁకన్. 242

సీ. శక్తి యాచార్యునిశక్తి మాయించుఁ బొమ్మని చూపఱెల్లను నట్టు లెత్తి
రక్కుంభసంభవుఁ డపుడు బ్రహ్మాస్త్రప్రయోగంబు సేసిన నుగ్రభంగి
నయ్యస్త్ర మాశక్తి నద్భుతంబుగ నేలఁ గలపి యుధిష్ఠిరువలను నిగుడ
నమ్మహీవిభుఁడు బ్రహ్మాస్త్రంబునన యది, యడఁగునట్లుగఁ జేసి యతనిమేన

తే. నైదుదూపులు నాటి శరాసనంబు, దునుమ గద గొని వైచె నుద్ధురత నతఁడు
పటియు గద వైవఁ దత్సన్నిపాతజాత, చటులపావకజ్వాలలు చదల నిగుడ. 243

వ. ద్రోణుండు కోపించి. 244

తే. ధర్మతనయురథ్యంబుల ధరణిఁ గూల్చి
ధనువుఁ గేతువుఁ దునుమాడి తనువు నొంప
నాతఁ డరదంబు డిగ్గి నిరాయుధుండు
నూర్ధ్వబాహుండు నై యూరకుండె నధిప. 245

క. కనుఁగొని గురుఁ డవ్విభు నేయను బోడువను జేతు లాడ కట పార్శ్వములం
దనచూడ్కిఁ బడినహయరథ, మనుజద్విపసముదయముల మడియించె వెసన్.

1 నభశ్చరుల వెఱఁ.

క. పోనీఁడు పోదువుఁ గుంతీసూనుని గురుఁడనుచు నుండఁ జూపఱగము ల
క్ష్మానవపతి యతిరయమునఁ, దా నెక్కెం బాఱి పిన్నతమ్మునిరథమున్. 247

వ. ఇట్లు పాండవాగ్రజుండు సహదేవునిరథం బెక్కి తొలంగం దోలుకొని పోయె
నట్టియెడ. 248

తే. క్షేమధూర్తి బృహత్క్షత్త్రు శితశరముల
నొంచి విలు ద్రుంప నొండుధనువు [1]రయంబు
వఱలఁ గొని హయసారథిధ్వజయుతముగ
నతనిమస్తక మిలఁ గూల్చి యార్చె నతఁడు. 249

చ. కడువడి వీరధన్వుఁడు త్రిగర్తులు వొంగఁగ ధృష్టకేతువిల్
నడిమికిఁ ద్రుంచినన్ మొగమునం దళుకొత్తెడు కెంపుసొంపుతోఁ
జిడిముడిపాటు లేక యతిశీఘ్రమునన్ ఘనశక్తి నాతఁ డె
క్కుడుముద మొప్ప నానృపతిఁ గూలఁగ వైచె సురల్ నుతింపఁగాన్. 250

వ. సహదేవుండును మగిడి వచ్చి దుర్ముఖునిం దలపడి దోర్విలాసంబు మెఱయం
బోరి పోరి. 251

ఉ. కేతువుఁ గూల్చి రథ్యముల గీటడఁగించి శరాసనంబుతో
సూతునికంఠముం దునిమి స్రుక్కఁగ నంగము బాణపంచక
స్యూతము సేయ నీదుతనయుం డరిగెన్ నిరమిత్రు తేరిపై
కాతతసంభ్రముం డయి రయంబునఁ బాండవసైన్య ముబ్బఁగాన్. 252

వ. అంత నిలువక. 253

తే. తఱిమి సహదేవుఁ డాత్రిగర్తక్షితీశ
తనయుఁ డగునిరమిత్రునిఁ దునిమి యొప్పె
ఖరునితలఁ ద్రెవ్వనేసి రాఘవుఁడు మెఱయు
తెఱఁగు దోఁప నీసేనకు వెఱపు గదుర. 254

క. నకులునిఁ దాఁకి వికర్ణుం, డొకపరి యైనను బెనంగ నోపక తిరిగెన్
సకలబలముఁ జూడఁగ జాలికిఁ బై కొని యడరి తగరు దెరలినమాడ్కిన్. 255

తే. వ్యాఘ్రదత్తుండు సాత్యకినస్త్రవృష్టి, [2]ముంచె ముంచిన నతఁడు కోపించి సూతుఁ
జదిపి హయములఁ బోరిగొని చటులవృత్తిఁ, జంపె నమ్మగధక్షితీశ్వరకుమారు. 256

వ. శల్యుండును ద్రౌపదీపుత్త్రుల నేవుర నైదైదుబాణంబుల నేసి మఱియును మార్గ
ణనికరంబులు నిగిడింపం జలింపక వా రాసోమదత్తి నొక్కమ్మడిం జుట్టుముట్టిన
నతం డందఱ కన్నిరూపు లై యేపునం బెనంగు చుండ. 257

చ. హరిసుతసూతి మావుల బకాంతకసూనుఁడు చాపమున్ యుధి
ష్ఠిరతనయుండు కేతువుఁ గడిందిమగంటిమిఁ ద్రుంప సూతునిం

---

1 రయమునఁ, గొనుచు హయరథసూతకేతనయుతముగ. 2 ముంచుటయును నతఁడు కోపించి.

బోరిగొనియెన్ వెసన్ నకులపుత్త్రకుఁ డిమ్మెయిఁ జిక్కువడ్డఁ జె
చ్చెర సహదేవనందనుఁడు సేసె శిరంబును మేను వేఱుగాన్. 258

సీ. వెస మారుతియు నలంబుసుఁడును బోరుచో నద్దానవేంద్రునియంపబలువు
చేత నతండు మూర్ఛిల్లి యాలోనన తెలిసి కాటుకకొండపోలుపు గెలుచు
నాతనిమేను పెల్లలరినమోదువు తెఱఁగుగాఁ జేసిన నుఱక వాఁడు
మాయావిలాసోగ్రకాయంబు గైకొని యఖిలదిక్కులఁ దోఁచి నిఖిలబలము
తే. నుఱిపి నెత్తురుటేఱులు వఱపి భీమ,సేన మాయన్న బకుని నా లేనిచోట
నట్లు సేసితి గాక నీయలవుఁ జలము, నింక మెఱయంగ వచ్చునె యేను గలుగ.
తే. అనిన విని కెంపు గనుఁగవ నడరఁ గినిసి
యుజ్జ్వలత్వాష్ట్రబాణప్రయోగమునఁ బ్ర
భంజనాత్మజుఁ డమ్మాయ వాయఁ జేసి
[1]తఱిమి యేసి యారక్కసుఁ బఱపె నధిప 260

వ. ఇవ్విధంబున మనదిక్కునఁ జేయం గలదొరలచావును నోటమియుం జూచి మూఁకలు గలంగినం గుంభసంభవుండు రోషసంరక్తలోచనుం డయి తలకడచి సాత్యకిప్రముఖపాండవపక్షవీరులఁ గ్రూరనారాచనిచయంబుల నిలువరించి నెఱయం బొలిచి నిలిచి మెఱయుటయును. 261

చ. తఱిమి ఘటోత్కచుండు బలదర్పము లేర్పడ ద్రోణుమీఁద నే
త్తెఱ నడతేరఁ గాంచి చనుదెంచి యలంబుసుఁ డమ్మహాసురుం
గుఱియుఁగఁ జేసె శాతశరకోటికి నడ్డము సొచ్చుసాత్యకిం
బిఱిఁదికిఁ ద్రోచి యద్దనుజు భీమతనూజుఁడు ముంచె నమ్ములన్. 262

అలంబుసుండు ఘటోత్కచునితో యుద్ధంబుసేసి చచ్చుట.

తే. భూరిచక్రంబు వెస నలంబుసుఁడు వైవఁ
బెలుచ గద వైచి పొడిసేసె భీమసుతుఁడు
కడుఁదురులు గవిసి కఱచుకరణి యయ్యె
మూఁక నత్తునియలు వెసఁ దాఁకునపుడు. 263

క. ఆచక్రం బట్లయిన ని,శాచరపతి వివిధశక్తిజాలము వఱపం
జూచి ఘటోత్కచుఁ డది వ,మ్మై చెడ నర్ధేందుశరచయం బడరించెన్. 264

వ. ఇట్లు దొడంగి యయ్యిరువురు దానవేశ్వరులును. 265

మ. బహుహేతిప్రకరంబులన్ బహువిధోపాయంబులన్ విస్ఫుర
ద్బహుమాయాకృతరూపజాలముల శుంభద్వీరసంరూఢి మై
మహి యల్లాడఁగఁ బోరఁ బాండుతనయుల్ మాత్సర్యధుర్యాత్ము లై
సహితోద్యోగత నయ్యలంబుసు శరచ్ఛన్నాంగునిం జేసినన్. 266

---

1 ఇల్లిదుఁడ దగురక్కసుఁ.

సీ. అతఁడు మాయాబలోద్ధతి నాశరావలి మొఱఁగి దావానలముక్తమైన
కరివిధంబున వ్రేఁగి యిరువదేనమ్ముల ననిలజు ధర్మనందనుని మూఁట
సహదేవు ద్రౌపదీసంభవులను హిడింబాసుతు నైదైదు బాణములను
నకులు డెబ్బదిమూఁటఁ బ్రకటవిక్రమ మొప్ప నేసి యార్చిన నల్గియింతపట్టు

తే. రథికవరులును గిట్టి మార్గణచయంబు
లొక్కమొగిఁ దొరఁగింప వాఁ డుఱక యేటు
లాడఁ గదిసి ఘటోత్కచుఁ డతనిసూతుఁ
ద్రుంచి యరదంబు రూపడఁగించె నధిప. 267

వ. ఇట్లు విరథుం డయి యలంబుసుం డిలకు లంఘించి మాయ గైకొని సాయకా
సారంబు ఘోరంబుగాఁ గురిసిన నమ్మారుతిసుతుండును దేరు డిగ్గి యగ్గలం బగు
మాయాకృతమార్గణజాలంబున నది దూలించి గదవైచిన నక్కిమ్మీరానుజుండు
పీడితుం డయి ఖడ్గంబు గొని గగనతలంబున కెగయుటయు హిడింబకొడుకును
గృపాణపాణి యై తోడన యెగసె నయ్యిరువురును సుడిగాడ్పునం దొడరి తిరు
గుడువడు మొగిళ్లచాడ్పున నొప్పి యొరకుఁ బెనంగుడేగలచందంబునఁ జిత్రగ
తులం బోరి పోరి భూతలగతు లై యుబ్బునం దలపడిన బెబ్బులులకరణి నొండొ
రుల మేనులు నెత్తుట జొత్తిల్లం జేసి పాసి యొకళ్లొకళ్లకంఠంబులు లక్ష్యంబులు
గాఁ గరవాలంబులు వైవ నవి యొండొంటిం దాఁకి మండుచు మహిం బడిన
మల్లయుద్ధసన్నద్ధు లై కిట్టుచుం బట్టుచుఁ బాయుచు వ్రేయుచు నొడుచుచుం
బొడుచుచు మఱియు ననేకప్రకారంబుల వీరత్వంబును విశారదత్వంబు సేనలకు
వెఱఁగు పుట్టింపం బోరాడి రట్టియెడన్ బకావరజుండు డస్సినం బవమానపౌత్త్రుం
డు పడవైచి తాను మీఁదై జానుకూర్పరముష్టిఘాతంబులు నిర్ఘాతపాతంబు
లుంబోలెఁ బ్రయోగించి నొప్పించి యతనితొడలు నెమ్ములు నొక్కమ్మడిం
బొడిపొడిసేసి నుఱిపిడికిం జొచ్చినప్రబలహాలికునిలీల నేలం బెట్టి కాలం జమరి
చంపి పొంపిరివోవు మగంటిమిం బేర్చి యార్చినం బాండవబలంబుల సింహనాదం
బులుఁ దూర్యనినదంబులుం జెలఁగె నప్పు డాఘటోత్కచుండు ధర్మనందనున
కభివందనంబు సేసిన నతండు సంతుష్టాంతరంగుం డై యాలింగనంబును మూర్ధా
ఘ్రాణంబును జేసి యగ్గించె ననిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె 268

ఉ. అంతకు మున్ ఘటోత్కచున కడ్డము సాత్యకి సొచ్చె నంటి వాఁ
డంతకసన్నిభుండు గురుఁ డద్భుతవిక్రముఁ డద్దెసన్ సము
ద్ధాంతతఁ బేర్చి వార లటు దార్కొని మిన్నక పోవ నేర్తు రే
కొం తయినన్ రణంబు గలుగుం గలభంగి యెఱుంగఁ జెప్పుమా. 269

వ. అనవుడు నాసూతనందనుం డతని కిట్లను సాత్యకి దఱిమి మనమొన నుఱుము
సేయం దొడంగిన ద్రోణుండు దార్కొని యిరువదేనుకుప్పకోలల నతనిచేత

నేటులు వడి మూఁడునారసంబుల నతని నొప్పించె నయ్యాదవవీరుండు పంచాశీ ద్బాణంబుల నొంచిన ధనుర్ధరుండు దొమ్మిదియమ్ము లెమ్ములం గీలించి. 270

క. మఱియును శరశతకము మెయిఁ, గిఱిగొలిపిన వృష్ణివరుఁడు గినియఁగ లే కే పఱి యున్నఁ జూచి యార్చుచు, మెఱసిరి నీతనయు లుబ్బు మిగిలి నరేంద్రా.

వ. అప్పుడు వినియును గనియును ధర్మతనయుండు ధృష్టద్యుమ్నాదియోధవరుల నాలోకించి. 272

ఆ. పులుఁగుఁ ద్రాటఁ బట్టి యలయించి యాడెడు, బాలునట్లపోలె బాణగురుఁడు గడఁగి కృష్ణునరుజుఁ గారించు చున్నవాఁ, డతనిఁ బొదువుఁ డితని కడ్డపడుఁడు.

వ. భీమసేనపురస్సరు లై కవియుం డనుచుం దానును దఱుముటయు నాసైనికో త్తములు సాత్యకిం గడచి యాచార్యుం గదిసిన. 274

క. విందులఁ గనిన ట్లాతఁడు, మందస్మితుఁ డై యెదిర్చి మార్గణజాల స్పందితులఁ జేసె వారల, నందఱ కవ్విధము రోమ హర్షణ మయ్యెన్. 275

వ. అట్టియెడ. 276

క. ఇరువదియేవురుపాంచా,లురు నూర్వురు కేకయులును లూనాంగకు లై ధరఁ దొరఁగిరి పెఱమొత్తము, కరినికరము రొంపిఁ బడినగతి నుండె నృపా. 277

వ. ఇట్లు ద్రోణుండు బరవసంబు సేసినం బాండవయోధులు పైఁ బెట్టం జాలక సొలసి యున్న సమయంబునం బాంచజన్యధ్వని విని యుధిష్ఠిరుం డక్కడ నాలించి గాండీవగుణఘోషంబు గర్ణగోచరంబు గామికి మనంబు గలంగ నెలుంగు గుత్తు కం దగుల సాత్యకితో ని ట్లనియె 278

ధర్మరాజు సాత్యకి నర్జుననకుఁ దోడ్పడఁ బొమ్మని ప్రార్థించుట.

చ. ఒక్కఁడ చన్నవాఁడు విజయుండు మహీరజ మెక్కుడయ్యె న ద్దిక్కునఁ బాంచజన్యమ యుదీర్ణత మ్రోయఁ దొడంగె నక్కటా చిక్కెనొ కౌరవాధములచే నతఁ డియ్యెడ నీవ యొక్కఁడుం దక్క నొరుండు దిక్కుఁగ నుదగ్రుఁడు బంధుఁడు లేమి వేఁడెదన్. 279

క. త్వరితముగఁ జనుము సఖుఁడు,గ్గురుఁడుఁ గదా నీకు నర్జునుం డుపకృతిత త్పరు లై నెగడెదు సు త్తమ,పురుషులు వేచుతఱి వచ్చె భుజవీర్యనిధీ. 280

చ. దురమున బంధుమిత్రులకుఁ దోడ్పడు టెంపును ధాత్రి యెల్ల భూ సురులకు నర్థి నిచ్చుటయు సూరిజనుల్ సుకృతంబు లెన్నఁ చో సరియుఁగఁ జేసి చెప్పుదురు శాశ్వతకీర్తియు నిన్ను నొందు నా హరి నను నాసుహృజ్జనుల నందఱఁ గాచుటఁ గ్రీడిఁ గావవే. 281

క. గురుపుత్రకర్ణమద్ర,శ్వరకృపభూరిశ్రవసులు శత్రుజనభయం కరులు జయద్రథునకు నై, నరుఁ బొదివిన నతఁడు నొచ్చె నాకుం జూడన్. 282

క. ఆమోఘము నాభుజంబులు, సామేనుం గలదె కేశవానుజ యొచ్చో

నేమగలకు నమ్మూర్తికి, [1]నేమిదలంచునొకో దైవ మెయ్యది దుదియో. 283

ఉ. ద్వైతవనంబునందు [2]గుణధన్యుఁడు గాండివి నాకుఁ జెప్పె ని
ర్ఘాతవిరోధి సత్యకసుతుండు సహాయుఁడు గా జయింతుఁ బ్ర
ఖ్యాతిగ ధార్తరాష్ట్రబల మంతయు నే నని దానికిం దగం
బ్రీతి యొనర్పవే నరవరేణ్య రయంబునఁ బోయి వానికిన్. 284

క. హరి యొకఁడు నీ వొకండవుఁ, బరమాప్తులు గలిమి నరుఁడు భారపుఁబనికిం
జొర నలుకఁడు నీకూరిమి, పౌరపొచ్చెము గాక యుండఁ బోవఁగ వలదే. 285

ఆ. పరమకరుణ నైన బంధుభావంబున, నైన భుజబలంబునతిశయమున
నైన నెల్లభంగి నర్జును రక్షింపఁ, బోవఁ దగు మహానుభావ నీకు. 286

క. అతఁ డొకటి యైన నేనే, గతిఁ బోదుం జెపుమ యెల్ల కార్యంబులలో
నతనికిఁ దోడ్పడఁ బోవుట, యతిముఖ్యము దానిఁ జేయుమనఘవిచారా. 287

క. అలఘుబలుఁడు శైనేయుఁడు, గలుగఁగఁ బాండవుల గెలువఁగా వచ్చునె వా
రల కతఁడు గోట యంద్రు, రిపులు దానికిఁ దగఁగ నెఱపు భుజగర్వంబున్. 288

క. హరి గురుఁడు నీకుఁ గ్రీడియు, గురుఁ డిరువురయెడరు దీర్పఁ గోరి గురులకుఁ
గురుఁడ నగునేన చేసెదఁ, బరమప్రార్థనము దీనిఁ బాటింపు తగన్. 289

క. కురుబలము సొచ్చి నీ దగు, శరములదర్పంబు సూపి చయ్యనఁ జని య
న్నరుఁ గైకొని నాయుల్లము, పరితాపము దీర్పవే నృపాలురు మెచ్చన్. 290

వ. అనిన విని సాత్యకి ధర్మనందనున కిట్లను నీవచనంబు లుచితంబు లేను నప్పార్థునకు రణంబునం బ్రాణంబులు దాఁప విశేషించి నీ వింత ప్రార్థించి పనుప నూరకుండు దునే యతండు సైంధవవధార్థంబుగా నట సను చుండి కృష్ణుఁడు వినుచుండ నాతోఁ జెప్పినతెఱంగు విన్నవించెద నవధరింపుము. 291

క. మనకు నిమిత్తములెంతయు, ననుకూలము లయ్యె గెలుతు మాహవమున [3]నేఁ
జనియెదఁ బ్రతిజ్ఞ దీర్పఁగ, ననఘా ధర్మసుతురక్ష కరుగుము నీవున్. 292

క. విను సింధురాజువధమును, మనుజాధిపరక్షణంబు మనకు సరియ కా
వున నే నొకపని నీ వొకపని మేకొని చేయు టరయఁ బాడియ గాదే. 293

ఆ. ఏను నిలిచినట్ల కా నూఱడిల్లు నీ, వున్న నన్న రేశ్వరోత్తముండు
నిర్భరుండ వగుము నీవు నాదెస న్నాకు, హరి గలండు గలఁడె యచట నితఁడు.

వ. ఎల్లభంగుల రాజరక్షణార్థంబుగా నీకుం బోవ వలయుఁ బరాక్రమధుర్యుం డగు నాచార్యుప్రతిన యెఱుంగవె యని చెప్పిన నట్లకాక యనినన్నతనిచే నిక్షేపంబుగాఁ గైకొని యేను నీకడకుం జనుదెంచితి గురుండు ప్రతిననెఱపునేని విజయుం డు జయద్రథుం జంపుట యప్రయోజనంబకాదే యది యట్లుండ నిమ్ము నీచిత్తమ్మున వలవనివెఱపు గట్టుకొనియెదవు కృష్ణసారథికం బగుజిష్ణురథం బప్రతిహత

---

1 నేమి దలఁచు నొక్కో దైవ. 2 గుణవర్యుఁడు. 3 కేఁ.

మనోరథం బగుట యెఱుంగ వలవదే యనుటయు నమ్మహీపతి యతని కిట్లనియె

క. అది యగు నైనను నినుఁ బెం, పొదవఁగఁ గాచికొని యిచట నుండుటకంటెన్
మది నధికం బై తోఁచిన, యది నీ వర్జునునిపాలి కరుగుట నాకున్. 296

క. కడువడి నీ వరుగఁగ వడ,ముడియును నీవెనుక శీఘ్రమున నెయిదుం గ
వ్వడి కుశలి యైన విజయం, బొడఁగూడును మనకు దీని కొడఁబడు మనఘా.

చ. ద్రుపదవిరాటకేకయులు దోర్బలధుర్యులు ద్రౌపదేయు లు
గ్రపుబిరుదుల్ ఘటోత్కచుఁ డరాతివిదారి శిఖండి ధైర్యసా
రపరుషమూర్తి సంగరధురంధరు లిద్దెసఁ దక్కఁగల్గువా
రపరిమితుల్ గొనందు ద్రుపదాత్మజుఁ డగ్గురు బోరఁ జీరికిన్. 298

క. విను మాధృష్టద్యుమ్నుం, డనలంబునఁ గుంభ భవవధార్థముగాఁ బు
ట్టినవాఁడు గాఁడె నాదెస, ననుమానం బేల యోర్చు నాతం డతనిన్. 299

వ. అనవుడు శినిపుంగవుం డొక్కింత చింతించి పార్థుపజ్జం బోవుట బంటుతనంబున
కూనంబు గా దితండునుం బెద్దయుం దటిమి పలికెడుఁ బోదున కాక యని మనం
బున నిశ్చయించి యధిపతియాననం బాలోకించి. 300

సాత్యకి ధర్మరాజు వేఁడినచొప్పున నర్జునుకడకుఁ బోవ సమ్మతించుట.

క. భవదీయరక్ష యిమ్మెయి, సువిహిత మగునేని మేలు పొచ్చెద భేరీ
రవబృంహితహేషాభై,రవకౌరవసేనఁ గలఁగి క్రందుకొనంగన్. 301

శా. వైరం బాత్మల నిండి యుండ భుజగర్వంబుల్ దలిర్పంగ దు
ర్వారోత్సాహులు వీరె కొందఱు నృపుల్ రారాజకార్యంబు వి
స్తారోదగ్రము సేయఁ బూని విలసత్సంరంభు లై పన్ని యు
న్నా రీదట్టపుమూఁక లెట్టు లగునో నాకోల్తలం జూడుమీ. 302

క. ఈసేనలు భేదించి భుజాసంపద వెలయఁ బార్థసాహాయ్యం బే
జేసెద నీపం పనియెదు, భాసురదీపమున కన్యబలతమ మెదురే. 303

క. దవ్వని చూడకు మార్తుర, క్రొవ్వడఁచెద సింధువిభునిఁ గూల్పఁ గడఁగునా
విన్వచ్చుమెచ్చుతెఱఁగున, నవ్వుచుఁ గవిసెద మరుద్గణంబులు వొగడన్. 304

వ. రథ్యంబులదగ యుడుపను సారథిదప్పియుం దీర్పను రథంబు సవిశేషసన్నాహంబు
సేయను వలయు ననినం బ్రీతి నొంది యప్పాండవాగ్రజుండు పనుపం దజ్జ్ఞులైన
పరిచారకు లత్తురంగంబుల నీరికిం దిగిచి ఖాణం బెత్తితడవి దారుకానుజుం డగు
నాసూతు నుపయుక్తాహారుం జేయుటయు వాఁడును విశిష్టాయుధసమేతంబుగా
నయ్యరదంబు [1]సుకల్పితంబు నేసి సింహధ్వజంబు గ్రాలం దెచ్చె నంతకు మున్ను

---

1 సవిశేషకల్పితంబు.

సాత్యకియుఁ గృతస్నానుం డై యాప్యాయనమధుపానంబున నెలమిం బొంది యమ్మహీపతిపాదంబులకుం బ్రణతుం డైనం గౌఁగిలించికొని యతండు దీవించినం బెండ్లికిఁ బోవులీలం దేరెక్కి యెక్కుడినవిల్లును మెచ్చు వచ్చునమ్ములును దొడల పైఁ బెట్టికొని కదలి చనుసమయంబున భీమసేనుండును నగ్రజునకుం బ్రణామంబు నేసి తనతోడన రాఁ గదలినం గని యాశినిపుంగవుం డతని కి ట్లనియె. 305

క. అక్కట రా వలవదునా, [1]కెక్కటి యీసేన దఱిసి యేఁగుట భరమే యిక్కడన నిలువు ద్రోణుని, యుక్కునఁ బతి కెడరు పుట్ట కుండఁగ వలయున్.

వ. అనవుడు నతం డట్ల కాక యేను రాజరక్షణంబునకు నిలిచెద నీ వప్రమత్తుండ వయి యరుగు మనిన వదనంబు వికసింప నీయట్టి పెనుఁబ్రాపు గలుగ నా కెదు రెవ్వరు సవ్యసాచి సైంధవుం దెగటార్చినం బేర్చినకౌతుకంబున వచ్చి నిన్నును మాయన్నను గౌఁగిలించుకొనియెద నని పలికి యవ్వీరుని నిలిపి లేళ్లగమిఁ గనుం గొనుబెబ్బులియుం బోలె నీసేనం జూచుచు నడచె నని యిట్లు సంజయుండు సాత్యకిసంరంభంబు ధృతరాష్ట్రునకుం జెప్పె నని చెప్పిన వేడ్క యుల్లంబున నివ్వటిల్లఁ బదంపడి చెల్లినభండనంబువిధంబు వినిపింపు మనుటయు. 307

ఉ. నిర్మలచిత్తభృంగరమణీయవికస్వరపుండరీకతా
ధర్మనిరూఢ సంసరణతాపనిరాకరణప్రగాఢస
త్కర్మఫలాకృతీ భువనతా[2]విభవప్రకృతీ తపక్రియా
కర్మఠసంయమీశ్వరసఖా సమతాసమవేతచిత్సుఖా. 308

క. పరిధానప్రావరణీ, కరణాదృతపీతవసనగజచర్మ సము
ద్ధురవాహనీకృతోజ్జ్వల, గరుడవృషభ పరమమోక్షకర దురితహరా. 309

మాలిని —

నిరుపమగుణరాశీ నిర్గుణత్వప్రకాశీ
భరితభువనకార్యా భవ్యనైష్కర్మ్యధుర్యా
వినతనిరతిభావ్యా విశ్వలోకైకసేవ్యా
స్ఫురితబహుశరీరా శుద్ధనైరూప్యసారా. 310

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయినశ్రీమహాభారతంబున ద్రోణపర్వంబునందుఁ దృతీయాశ్వాసము.

---

1 కెక్కడియీసేన; కెక్కడ నీసేన. 2 విభవప్రకృతీ.

శ్రీ

గణేశ శారదాగురుభ్యో నమః.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము, చతుర్థాశ్వాసము.



మత్త్వాయుష్మత్త్వసు
ధీమత్త్వప్రదకటాక్ష దీపితభక్త
స్తోమారామవసంతా
వ్యామోహప్రశమకరణ హరిహరనాథా. 1

సాత్యకి మొగ్గరంబు సొరం దొడంగుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. ధర్మపుత్త్రుండు వనుప సాత్యకి గడంగి, తనబలము దెస నడచుట వినినయాంబి
కేయుఁ డర్జునుఁ గలయ శైనేయుఁబోవ, విడిచి రే మనవారని యడుగుటయును. 3

వ. సంజయుం డతని కి ట్లను నట్లు మఱుంగి బనిచి యుధిష్ఠిరుం డాచార్యువల నవ
లోకించి యాశినివరుపిఱుందన తఱిమె నప్పుడు ధృష్టద్యుమ్నుం డవష్టంభంబున
నెలుం గెత్తి పురికొల్పఁ బాండవసైనికులు గవిసిన మనవారును మార్కొనిరి
తదనంతరంబ. 4

క. తలలను గరముల వక్ష, స్థలముల జఘనములఁ దొడలఁ జరణంబుల న
య్యలఁ గప్పెదుసాత్యకికో, ల్తల కోర్వక నీబలము గలంగం బడియెన్. 5

క. విచ్చినమూఁకల కడ్డము, సొచ్చినఁనేడ్వురు నృపాలశూరోత్తములం
బుచ్చె జముం గొలువఁగ వి,వ్వచ్చుమఱఁది పెఱనృపాలవర్గము దెరలన్. 6

సీ. ఆసమయంబున నతని మార్కొని కుంభభవుఁ డేడుదూపులు వఱపె మేన
నతఁ డస్త్రసప్తకహతుఁ జేసె నాతని సద్గురుఁ డాఱింట నశ్వములను
సూతు నాతని నొంచె నాతఁడయ్యాచార్యునేపుమైఁ బదియును నేడు నాఱు
నెనిమిదియును బదునెనిమిదియును శాతశరముల నొప్పించి తురగచయము

ఆ. నాల్గుసాయకముల నడికించి సారథి, నొక్కమార్గణమున నుబ్బడించి
యార్చుటయును ద్రోణుఁ డలిగి వాలమ్ములఁ, బొదివెఁ దద్రథంబుమదమెలర్ప. 7

వ ఇట్లు బాణజాలంబులం గప్పి గురుండు సాత్యకి నుపలక్షించి, 8

క. నాచేతిబలువు గని నీ, యాచార్యుం డోడి తొలఁగి యరిగెను నీవే
త్రోచి యట వోవువాఁడవు, సూచెదు గా కెట్లు నిన్ను స్రుక్కించెదనో. 9

క. అనవుడు ధర్మాత్మజుపనుపున నే గాండీవికడకుఁ బోయెద నన్నిం
తన నేటికిఁ దడ వయ్యెడు, ననుగ్రహము సేయు మర్థ్మమది పెద్దలకున్. 10

క. అని పలికి తొలఁగి పోవుట, మనమున నూహించి దైత్యమర్దనుతమ్ముం
డను సూతుతోడ ద్రోణుఁడు, మనలం బోనీక పెనఁగు మాత్సర్యమునన్. 11

వ. తడసినఁ గర్జంబు దప్పు నితనికి నోసరించి పోవ వలయు విను మిదియె బాహ్లీకబలం
బదె యంగసైన్యం బల్లదె దాక్షిణాత్యసేన వీనియం దొక్కసందున వెడలుద
మివి గడంగి యడ్డపడిన నొప్పించి చిక్కువఱచి పోవ మనిన నట్ల కాక యని
యద్దారుకానుజుండు ద్రోణునకుం దొలంగించి తేరు దోలం దీవ్రబాణంబులు
గురియుచు నగ్గురుండు వెనుతవుల నయ్యాదవసింహుండు సింహవిక్రమంబున
[1]నంగచమూచ్ఛేదనంబు సేసి చనునెడఁ గృతవర్మ యాతనిం దాఁకి. 12

క. ఆఱమ్ము లతనిమేనం, దూఱం గా నేసి నాల్గు తురగాంగముల
[2]గీఱించినఁ గని ద్రోణుం, డూఱడి ధర్మజునిదెసకు నున్ముఖుఁ డయ్యెన్. 13

వ. అక్కడ మొగ మయ్యు నిక్కడ నేమఱక యుండె నప్పుడు. 14

క. కృతవర్మయెడల సాత్యకి, శితసాయకములు పదాఱు సెరివినఁ గోపో
ద్ధతి మెఱయఁగ బఱుదూపుల, నతఁ డాతని నుచ్చి పోవునట్లుగ నేసెన్. 15

వ. వెండియు. 16

చ. విలు దునుమాడి వక్షమున వే పదియేడు నాఁట నాతఁడు
జ్జ్వలఘనశక్తి వైచి కృతవర్మునిబాహువు నొంచ ధైర్యని
శ్చలమతి నొండువిల్లు గొని సారథిఁ జంపిన సూతకృత్య
వలనుగఁ బూని యారథికవర్యుఁడు నిల్చె నితాంతధీరతన్.

వ. నిలిచియు సాత్యకిదెసం దఱుమక భీమసేనపురస్సరం బైనబలంబున 17
ధంబున నతని బెట్టు వఱచి యాశైనేయుం డచటు గడచి చనియె ననిన విని
ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 18

చ. గురుకృతవర్మముఖ్యు లతిఘోరపరాక్రమశీలు రట్టినా
దొరలను సైన్యసాగరము దోర్బలసంపద గాసి సేసె న
న్నరుఁ డడిగాక క్రమ్మఱ వినం గడు విస్మయ మిట్లజయ్యుఁ దై
వెరవున లావునం బరిభవించుచు సాత్యకి యేపు సూపెనే. 19

మ. హరియుం బార్థుఁడు నట్లు నేర్పు గలబాహాశక్తిమైఁ జొచ్చుచో
దొరలుఁ సేనలుఁ బెల్లు గూలుటకు నాదుర్యోధనుం డెంతయా
తురతం బొందెనొ దంతిఘోటకపదాతుల్ సాత్యకిస్ఫారదో

1 నంగచమూభేదంబు. 2 బాఱించినఁ.

స్స్ఫురణన్ బ్రగ్గుట కెట్లు దాను ననుజుల్ [1]శోకించెనో యక్కటా. 20

వ. అనవుడు సూతసూనుం డమ్మానవపతి కి ట్లనియె. 21

క. నీయవినయంబు పెంపున, నీయాపద సంభవించె నింక వగచినం
బాయునె యితరులక్రియ శో,కాయత్తుండ వగుట నీకు నర్హమె యధిపా. 22

వ. సుస్థిరుండ వై సమరప్రకారంబు వినుము సాత్యకి యత్తెఱంగునం జని కాంభోజ
సేనఁ జొచ్చిన నందలి మేటిమగలు దలపడి రట్టియెడం గుంభసంభవుండు. 23

క. కని కృతవర్మకు సారథి, నొనర్చి తనకృత్యమునకు నునిచి కడఁగి యా
శినివరు వెనుకొన ధర్మసు,తునిదొర లయ్యస్త్రగురునిఁ దొడర నడరినన్. 24

క. వారిఁ గృతవర్మ మార్కొని, దారుణశరశిఖల నేర్చి తల్లడపఱుపం
గా రయము గుంది నిలిచిరి, వా రొండొరుఁ జూచుచును వివర్ణాకృతు లై. 25

వ. ఇట్లు హార్దిక్యుబలువిడి కోహటించినరథికులం బురికొలిపికొని వృకోదరుండు
సోదరపుత్త్రమిత్త్రసహితంబుగా నతనిపైఁ గవిసె నట్టిసమయంబున నయ్యనిల
జుండును ధృష్టద్యుమ్నుండును శరత్రయంబులను ధర్మనందనద్రుపదులు బాణ
పంచకంబులను హైడింబుం డేడమ్ములను మత్స్యపతి పదియేనింటను సహదేవుం
డిరువదేనింటను శిఖండి యిరువదింటను ద్రౌపదేయులు డెబ్బదిదూపులను
నకులుండు సాయకశతంబునను నొక్కుమ్మడి నమ్మేటివిలుకానిం బొదివిన నతండు.

సీ. ఐదైదుశరములు నందఱ స్రుక్కించి భీముని నేడింట బెట్టు వఱచి
ధనువుఁ గేతనమును దునిమి డెబ్బదిదూపు లతిరయంబున నురమాడ నేయ
సోలినయమ్మరుత్సుతుఁ జూచి యందఱు నాకృతవర్మపై నడరి రంతఁ
దెలిసి వృకోదరుం డలఘుదారుణసముజ్జ్వలశక్తి నాతని వైవ నతఁడు
తే. [illegible] జేయ [illegible]డ్డవిల్లెత్తి యతని
[illegible]వట్టు సేయుటయు నాస
[illegible]ఁ దక్కటివారి నొంచె
[illegible]డుమూఁడమ్ము లేసి యవ్వాఁడిమగఁడు. 27

తే. అందఱును జుట్టు ముట్టి తీవ్రాస్త్ర[2]జాల,కములఁగృతవర్మ నొంప శిఖండి గదిసి
యాక్రమించిన విలు ద్రుంచె నాతఁడప్పు,డతనిచాపంబు దునిమె నుగ్రాసి వైచి.

క. ఆలోనన భోజపతిన్, వాలమ్ములఁ బొదివి రెల్లవారలు దానం
దూల కతఁడు బలువిలు గొని, క్రాలుచు నాభీమముఖ్యరథికుల నొంచెన్. 29

వ. అప్పుడు. 30

ఉ. ఒండొకచాప మెత్తికొని యుగ్రత శాంతనవాంతకుండు వే
దండమువోలెఁ గిట్టిన నుదగ్రత సింహానఖోపమస్ఫుర
త్కాండములం దదంగము రథంబుపయిం బడ నేసె భోజనా

1 శోకించిరో. 2. నస్త్ర,కమునఁ.

థుం డది యాజికిం దొలఁగఁ దోలె రయంబున సూతుఁ డార్తుఁ డై. 31

వ. ఇట్లు శిఖండి గం డడంగి పోయినం గని మత్స్యచేదికేకయాదిసైన్యంబులు బరవసంబు సేసి యురవడించిన నాకృతవర్మ మర్మభేదనస్ఫారనారాచపరంపరా ప్రవాహంబుల వానినెల్లం గలంచెఁ దత్కలకలం బాలించి సాత్యకి య ట్లబ్బలంబులు వికలంబు లగుట యాలోకించి విజయునకుం దోడ్పడం బదంపడి పోఁ దగు రాజువల నారయువలయు నని యూహించి తనకు నడ్డపడిన భారద్వాజునితోడి సమరంబు సాలించి మరలి యరదంబు దోలుకొని యరుగుదెంచి కృతవర్మనిం దాఁకి యేసిన నతండునుం బొగ లేనిమంటచందంబున నుద్దీపించి [1]సాయక జ్వాలలు నిగిడించిన నవి మగిడించి యాశైనేయుండు. 32

శా. భల్లం బొక్కట విల్లు ద్రుంచి రయమొప్పన్ నాల్గిటన్ వాజులం
ద్రెళ్లన్ బెట్టుగ నేసి సూతుతల సందీప్తైకబాణాహతిన్
డొల్లం జేసి యదల్చి యిట్లతనియాటోపంబు మాన్పించి యు
త్ఫుల్లాస్యుం డయి పోవ నడ్డపడినం ద్రుంచెం ద్రిగర్తావళిన్. 33

వ. ఇట్లు కృతవర్మ విరథుం డైన రయంబునం బురికొని యురవడించినపాండవసైన్యంబులం గని కుంభసంభవుం డాశినివరువిక్రమవిహారంబున కడ్డపడం గడంగక యాసైన్యంబులసంరంభంబు దనవిజృంభణంబున వారించి నిలిచె నిత్తెఱంగునం ...గ గనేనఁ జిక్కువఱచి తఱిమి చనునయ్యాదవరత్నంబు ప్రయత్నంబునకు దేశంబులగ్గ...య నుత్తుంగమాతంగ...బును గొలిపి జలసంధుండు మదాంధుం డయి మార్కొనుటయు. 34

జలసంధుం డనురాజు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట.

క. ప్రదరప్రవాహమున న, మ్మదవద్ద్విరదంబుపటుగమన
బొదవిన సాత్యకి విలు బెట్టు దునిమె నమ్మగధనాథుఁడు

తే. తునిమి నవ్వుచు నేఁబదిదూపు లురము, నందు నాఁటిన శైనే
దంపువిలు గొని యాతనిధనువు నఱకి,యుఱక యఱువదియమ్ముల

వ. దానికిం జలింపక జలసంధుండు.

చ. పటుగతి నాశినిప్రవరుబాహువు దోమరకీలితంబు సే
యుటయును గాక త్రుంచె ధను వుగ్రకృపాణము వైచి యాతఁ డు
త్కట మగునల్క నొండువిలు గైకొని వాని నికృత్తహస్తునిం
ద్రుటితశిరస్కునిం బ్రదరఘాతమదావళుఁ జేసి యార్చినన్. 38

క. వెలుకుఱి యచ్చటిమూఁకలు, గలఁగినఁ గని తనముఖంబు కయ్యంబునకున్
బలియురఁ గృతవర్మాదుల, నిలిపి గురుఁడు వచ్చి యాశినిప్రభుఁ దాఁకెన్. 39

వ. ఇవ్విధంబునం గడంగినకుంభసంభవుం జూచి యతనిప్రాపున దుర్మర్షణ దుస్సహ వికర్ణ దుర్ముఖ దుశ్శాసన చిత్రసేనప్రముఖు లగుకురుకుమారు లొక్కపెట్ట కవిసి

1 సాయకజాలంబులు నిగిడించిన.

మిక్కుటం బగుతూర్యరవంబులతోఁ బెక్కుమ్ముల సాత్యకిం బొదువ నత్తుములం బునకు దుర్యోధనుం డేతెంచి తమ్ములం గలసినం గనుంగొని గురుండు వార లతనికోపుదు రనుబుద్ధిఁ బాండవసేనాముఖంబునకుం జనుదెంచిన నయ్యచ్యుతా నుజుం డారథికు లందఱ కన్నిరూపు లయి వారలశరాసారంబులు నివారించు చు నొకని ననేకబాణజాలంబుల నొప్పించు చుండ నక్కౌరవేశ్వరుం డుద్దామ గతిని గవిసి వాలమ్ము లాతనితనువునం జొనిపిన నతండు. 40

క. నగుచు విలు దునిమి తీవ్రాశుగముల నొంచుటయు నీదుసుతులెల్లను నా మృగపతివిక్రముపైఁ దఱచుగ నిగిడించిరి ప్రదీప్తసునిశితశరముల్. 41

క. చిక్కువడక సాత్యకి యొక్కొక్కని నయి దయిదు దృఢమహోగ్రాస్త్రములఁ ద్రుక్కించి యెనిమిదిటఁ బేరుక్కున నక్కురునృపాలునొడలం గ్రుచ్చెన్. 42

ఉ. అంతటఁ బోక రత్నమయ మైనభుజంగపతాక గూల్చి య త్యంతరయంబుమై ధనువు నశ్వచయంబును సూతుమేను నిం తింతలు వ్రయ్యలై పడఁగ నేసిన బెగ్గిలి తేరు డిగ్గి భూ కాంతుఁడు వాఱె సేన కలఁగంబడి మ్రొగ్గయ నతండు నవ్వఁగాన్. 43

వ. ఇట్లు వాఱి చిత్రసేనురథం బెక్కె నక్కోలాహలం బాలించి కృతవర్మ దన రథంబు రయంబున నద్దెసకుం బఱపం బనిచి యురవడి నరుగుదెంచినం గని శిని పుంగవుండును నిజస్యందనంబు సమ్ముఖంబు [illegible] గోఱవి గోఱవిం దాఁకిన తెఱంగునం [illegible]చలపడి యొండొరులపైఁ బ్రచండబాణంబులు వర్షింపుచుం బోరునెడ జనార్దనానుజుండు హార్దిక్యు నతిక్రమించి. 44

దెలిసి వృకోదరు[illegible]సూతు [illegible]ంచి శరాసనంబుఁ
తే. [illegible] జేయ[illegible] వెరిఁగిన దొడ్డనార
[illegible] నేయఁ జచ్చినట్ల
[illegible] మోఁకాళులు మోవఁ బడియె. 45

[illegible]ద్మునం దేరిపయిఁ గూలినకృతవర్మం [2]దెగియెనకాఁ దలంచి ధనంజయుం
తే. [illegible]ఖియం దమకించి సాత్యకి యక్కడఁ బోవ నాభోజపతి దెప్పిఱి సన్నద్ధుం డై మరలి చని యెప్పటినెలవున నిలిచి యనిలతనయప్రముఖుల కడ్డపడినం జూచి యాచార్యుం డచ్చోటికతనిం జాలించి శౌర్యధుర్యుం డగునాశినివరుం డట సనుట సైరింపం జాలక రయంబున. 46

క. [3]మగుడఁ జని యాఁగి నిశితములగు నారాచములు, మూఁట నతనినుదుట బె ట్టుగ నాఁటినఁ ద్రిశిఖరయుత, నగముక్రియం బొలిచె నతఁడు నరవరముఖ్యా.

వ. అరథికవరుండును గురునిపైఁ గ్రూరనారాచంబులు నిగిడించె నిట్లు దొడంగి యయ్యిరువురు నొండొరులశరజాలంబులు వారించుచుఁ దురంగంబులయంగం

1 గెఱిగొనుదొడ్డ. 2 దెగినవానినకాఁ. 3 ఎగువఁ.

బుల రుధిరంబులు పూరించుచు సారథుల నొప్పించుచు మేనుల వాలమ్ములు గుప్పించుచు ననదృశంబులగుకరలాఘవంబులు సదృశంబులుగాఁ బోరునప్పుడు. 48

మ. ధనురాచార్యుఁడు శైశవానుజుధనుర్దండంబు ద్రుంచెన్ గదం
గొని వైచెన్ వడి నాతఁ డగ్గురుఁ డెడం గ్రూరంపుభల్లంబునం
దునుమం గ్రక్కున నొండువిల్లు గొని యాదోర్దర్పదుర్దాంతుఁడై
ఘనబాణంబుల నొంచె నించె నతఁ డాకాశంబు గర్జాధ్వనిన్. 49

ఆ. అలిగి గురుఁడు శక్తి నడరింప నది విధి, ప్రేరణమునఁ జేసి తేరు దాఁకెఁ
గాని యతనిఁ దాఁకఁ గానద యతఁడు త,ద్బాహుశాఖ నొంచెఁ బటుశరమున 50

వ. నొంచినం గోపించి. 51

క. చాపాచార్యుఁడు సాత్యకి, చాపము దునుమాడి సూతు సమ్మూర్ఛితుఁగా
నేపారి యేయ రథ్య,వ్యాపారము దాన నడపి యతఁ డని సేసెన్. 52

వ. ఆలోన నతనిరథచోదకుండు దెలిసిన నెలమిం బొంది. 53

క. బలువిడి బహుభంగుల నుజ్జ్వలశరములఁ బోరి పోరి శైనేయుఁడు చె
ట్టలఁ బడ సారథి నేసినఁ, దొలఁగంగాఁ బఱచె ద్రోణుతురగములు వెసన్. 54

ఆ. అచటిరాజలోక మగ్గురునరదంబు, ననిసదిక్కు ననుచు సంభ్రమమున
నాఁగిపోనుఁడు పట్టుఁడదలుపుఁ డేయుఁ డ,శ్వముల ననఁగఁ దెరలె సైన్యసమితి. 55

వ. ఇవ్విధంబున నిజరథంబు విఫలమన [illegible]గరథం బై పోయిన నదియ పోకగాఁ బోయి [illegible]
సన్నద్ధం బై సముద్ధతం బైనపాంచాలబలంబు [illegible] సేనాముఖంబునం [illegible]
కొలిపికొని కుంభసంభవుం డవష్టంభవిజృంభణంబు [illegible]
నిలిచె నిత్తెఱంగున ద్రోణకృతవర్మదుర్యోధనాదులగ [illegible]
చిఱున వ్వొలయ సాత్యకి సారథితో నిట్లనియె.

క. ఇక్కడఁ గృష్ణులతేజము, నక్కడ బవమానానందనాదిజనులపే
రుక్కును గెలిపించె మనలఁ, జిక్కక వెడలితిమి శత్రుసేనలచేతన్

వ. అని పలికి యర్జునుం డున్న దిక్కునకు రథంబు రయంబునం బఱ[illegible]
వాఁడును నట్లు చేయ విమలాశ్వవేగంబునం జారుభీషణం బగునత్తేరు [illegible]
దుర్నిరీక్ష్యం బై నభంబున భానురథంబు ననుచందంబున. 58

సుదర్శనుఁ డనురాజు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట.

క. అరుగఁగ సుదర్శనుం డను, ధరణీపతి యడ్డపడి[1]యె దర్ప మలర న
య్యురుపురుఁ బెనంగుటయు న,చ్చెరువుం గావించె నచటి సేనల కెల్లన్. 59

వ. అట్టియెడ నమ్మహీనాథుండు. 60

క. పలుదునియలు సేయుచుఁ దూ,పులు దనదెసఁ [2]జేరనీక పోర శినివరుం
డలిగి తురగముల సారథి, నిలఁ గూల్చి తదుత్తమాంగ మేత్తెఱ నఱకెన్. 61

1 యడల్చెఁ బెలుచ నయ్యిరు. 2 బెరయనీక.

వ. సఱికి నిజసారథిం జూచి. 62

క. గురుఁ డనుజలనిధిఁ గడచితి, నొరులు దలంపంగ నాకు నులిగాలువ లీ
నరపతుల సరకుగొన నీ, వరదము సననిమ్ము నేఁటియని కలయకుమీ. 63

వ. అనవుడు వాఁడు నగుచు నీవిక్రమంబునకు నావెరవు సంగడంబు గాదె సంగ
రంబున నేమి సేయుదు నెవ్వనిపై దేరు నడపుదు ననిన విని శినివరుండు
విష్వచ్చుచేతం జచ్చినకరితురగనరనికాయంబులతిట్టలు సూపి యజ్జాడం దేరు
వఱపు మదె గాండీవగుణచండనాదంబు వీతెంచుచున్నయది నేఁడు పాండవ
మధ్యముం డిచ్చిన ధనుర్విద్యావిలాసంబు మెఱయను బాండుసూనుల కేను
జేయుభక్తిస్నేహంబులు నెఱపను వలయు నాకడంక గని కురువిభుం డిరువురు
ఫల్గును లనుబుద్ధిఁ గలంగునట్లు సేసెద నని పలుకునవసరంబున నద్దెసం గాంభోజ
యవనసైన్యంబు లతని కడ్డపడం గడంగిన నవ్వీరుండు గుణంబు సారించి
యబ్బలంబులనికిఁ దేరు వఱపించి. 64

క. నానాస్త్రంబులు ముందఱ, వే నిగుడఁగ బడలు వడినవీరభటులపై
నేనుంగుల గుట్టంబుల, పీనుంగులమీఁదఁ దేరు వెలుచం బఱపెన్. 65

వ. ఇవ్విధంబున వెండియుం గిరాత శక బర్బర పారద యవన ప్రముఖమ్లేచ్ఛసేనల
రూపడంచి నీమూఁకలు గలఁగం దఱిసి చిత్రవర్మంబు మైచాయగా నారాచం
బులు నఖంబులును విల్లు బలుమొగంబును నై బెబ్బులివోలెం బోవం బోవ
దుర్యోధన దుశ్శాసన చిత్రసేన వివింశతి శకుని దుస్సహ దుర్ధర్షణ క్రథప్రభృతి
రథికనికరంబు రభసంబున బోకు పోకు మనునెలుంగులతోఁ బిఱిందిదెసం
[illegible] దత్కలకలం [illegible] విని యతండు సూతు నాలోకించి. 66

[illegible]హావెను,కం దగిలెదుసైన్యజలధి [illegible] శోషిం
[illegible]నం, దంద వడిం బఱపి నగుచు నరుగుద మనినన్. 67

[illegible] నబ్బల, మతిరయమున నెయిది పొదువ నరిగి కరిచతు
[illegible]యత్రిశతియు వసుమతిఁ గూల్చెను శినివరుండు మద మెలరారన్. 68

[illegible]నలువక చలంబున నాసేన శైనేయుపై బెట్టు గిట్టి నట్టియెడ. 69

[illegible]. నరతురగద్విరదరథో, త్కరములలో నతనిశరము దాఁకనిరూపుం
బరికించియుఁ గానం ద, త్త్వరితత్వంబునకు వేఱ వర్ణన యేలా. 70

క. నరుబాహాస్ఫురణమునకు, సరి యగు నెక్కు డగుఁ గాని సాత్యకిభుజవి
స్ఫురణం బల్పము గా దని, సురనికురుంబంబు పొగడుచుం జూచె నృపా. 71

మ. కురుముఖ్యుండును దోడిసైనికులుఁ బెక్కుల్ దూపు లొక్కుమ్మడిం
గురియం బిన్నటినవ్వుతో నతఁడు తత్కోదండసూతాశ్వ కే
తురథంబుల్ వికలత్వముం బొరయఁగా దోర్దర్పదుర్దాంతుఁ డై
వెరవుం జేవయు లావునుం దెలిపె నుర్వీనాథ యాసేనకున్. 72

---

1 దీప్రతరశరార్చుల, నందఱ వడిఁ బఱపి.

క. కదిసి నరేంద్రుఁడు సూతుని, మదమును దురగములఁ ద్రుబ్బు మానిచి నిశిత
ప్రదరముల నతనియంగము, పొదివె శకుని దోడుపడఁగ భుజబల మలరన్. 74

వ. పొదివిన నొదవిన కోపంబునాటోపంబున. 75

మ. ధరణీనాథ మురాంతకానుజుఁడు గాంధారేశుచాపంబునుం
గురువంశాగ్రణిసూతుకంఠము నతిక్రూరాస్త్రపాతంబునం
గరమాశ్చర్యము గాఁగఁ ద్రుంచినఁ దురంగస్తోమ మామేదినీ
శ్వరుతే రచ్చటు వాయ నీడ్చికొని పెల్చం బాఱె దుర్వార మై. 76

వ. ఇట్లు త్రెటంగునం బాఱిన. 77

క. తమ్ములు దొరలును నేపఱి, యమ్మనుజాధిపునిపజ్జ కరుగుటయును సై
న్యమ్ము వెఱచఱచి విచ్చిన, నెమ్మిఁ దనయరుగుదెస శినిప్రభుఁ డరిగెన్. 78

వ. అనిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె. 79

క. పులికిఁ బసులు వాఱినక్రియ, నలవుఁ జలము సిగ్గు విడిచి య ట్లోక్కనికో
ల్తల కోర్వక విఱిగిన పుత్త్రుల నే మని విందు నేను రోయక యింకన్. 80

క. అనుడు నతఁ డవ్విభుని కి, ట్లను నీవును నగ్రసుతుఁడు నవినయములు సే
సినఁ బాటిల్లినయాపద, విన కుండఁగ వశమె మీఁదు విను తెలియంగాన్. 81

వ. అట్లు గాసి యై కోపించి నీకొడుకు పురికొల్ప నంబష్ఠటంకణపారదప్రముఖ
దేశంబులబలంబులు దుశ్శాసనపురస్సరంబుగా రయంబునం జని సాత్యకిం జుట్టు
ముట్టిన నాజెట్టిమగండు నిజభుజవిక్ర[illegible]బునకుం బాటవంబు దలకొల్పిన.

మ. విఱిగెం బెక్కురథంబు లొక్కమొగి నుర్విం గూ[illegible]లె
దఱచై రాలెఁ దురంగమావయవసంతానంబు లింతింత
కులుకుల్ గట్టె భటాంగకంబులు రణక్షోణిం బ్రవాహం[illegible]
పఱచెన్ నెత్తురు భూతకోటి విహరింపం బ్రస్తుతింపన్ సురల.

దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి పాఱి పోవుట.

క. రోషమున దుస్సహేనుఁడు, పాషాణప్రదరనిపుణపార్వతికతతిన్
భీషణముగఁ గవియింప జిగీషం బొదువుటయుఁ జూడ్కిఁ గెం పారంగాన్.

క. శినివరుఁ డాఱా ల్లెల్లను, దునియలుగా నేయ మిగిడి తొరఁగుచు నవి వై
చినవారిన నొప్పింపఁగఁ, గనుకని నమ్మూఁక విచ్చెఁ గౌరవనాథా. 85

తే. విచ్చుటయు నంటఁ దాఁకి యవ్వీరుఁ డంప
వెల్లిఁ దేల్చిన వెగ డంది పెల్లగిల్లి
యధిప దుశ్శాసనుఁడు మొదలై నయోధ
గణము లెల్లను ద్రోణునికడకుఁ బఱచె. 86

వ. ఇవ్విధంబునఁ దనచేరువకుం జనినయాదుశ్శాసనునిం గనుంగొని మున్ను శై నేయు
చన్న దెసం బుట్టినయకోలాహలం బాకర్ణించు చున్నయఁగ్గురుం డిట్లనియె. 87

క. ఏమి యువరాజవిభునకు, నేమమె సైంధవుని నేమి నేసి నరుఁడు నీ
వేమిటి కి ట్లీరథిక, స్తోమముతో విఱిగి తెందుఁ జొచ్చెద వింకన్ 88

క. అడుకులు దిన్న ట్లగునే, కడుపునఁ గు ట్టెత్తినపుడు గడుఁ బఱచితి నాఁ
డొడ లెఱుఁగక పాండుసుతుల, నుడిగి మడుఁగ వలనె నిప్పు డొకసాత్యకిచేన్.

వ. భీమార్జునుల బారిం బడి యేమి గాఁ గలవాఁడ వని పలికి యలుక వొడమిన నంత
నిలువక. 90

చ. మఱచితె యాసభన్ భువనమాన్య గుణోత్తర యాజ్ఞసేని నీ
పఱచినపాటుఁ బాండవులఁ బల్కిన పల్కులు నాఁటి క్రొవ్వు నే
డ్డెఱయును నెందుఁ బోయె రణధీరుల వారల నల్గఁ జేసి సి
గ్గఱి తుది నిట్టు లైతి తగునక్కట తియ్యన గావె ప్రాణముల్. 91

ఆ. బ్రదుకఁ దలఁచితేనిఁ బాండునందనులకు, నింక నైనఁ బుడమి యిచ్చునట్లు
గాఁగ నన్నతోడఁ గార్యంబుఁ జెప్పు మ, వ్వెడఁగు భీష్మబుద్ధి వినక చెడియె. 92

వ. ఇట్లు సేయఁ జాల వై తేని. 93

క. ఎట వోవ వచ్చు నిను ముం,దట నిడుకొని పోర నున్న తగురాజుల నె
క్కటి దోలెడిసాత్యకి నీ, వట దఱుముదు గాక యొదుఁగ నగునే నీకున్. 94

క. అనుటయు నతండు వినియును, విననిచెవులు నేసి మగుడ విక్రమమునకున్
గొనకొని యేమియుఁ బలుకక, చనియె శినిప్రవరు [1]పజ్జ సమరంబునకున్. 95

వ. తదనంతరంబ యాచార్యుం డవార్యదోర్గర్వంబు మెఱయం దఱిమి మెఱుంగు
వాలమ్ములవేఁడిమి సూపిన. 96

...ండుత్స్థావరసూనుసైన్యములు దర్పం బేదుడన్ వీరకే
దాఁకి యగ్గురుని సూతున్ నొంచి యేనమ్ము లు
మ వాడ నేయుటయు నాతం డల్గి దీప్తోజ్జ్వల
...ంబునఁ గూల్చె నాద్రుపదసంజాతున్ మహోదగ్రతన్. 97

...ర కేతుండు వడినం గినిసి యతనియన్నలుం దమ్ములు [2]నగుచిత్రకేతుండును
...న్వుండును జిత్రవర్మయుఁ జిత్రరథుండును ద్రోణురథంబు బాణమయంబు
సేసిన నతండు. 98

క. వారలరథ్యంబులఁ ద,త్సారథులం బొడవడంచి ధరఁ దొరఁగించెన్
వారిశిరంబులు పువ్వు ల, వారణమెయి డుల్చుగంధవహుఁడుం బోలెన్. 99

వ. అప్పు డాలోకించి ధృష్టద్యుమ్నుండు గెంజాయ రంజిల్లుకన్నులం గన్నీ రొలుకం
గవిసి కుంభసంభవునురంబునం గ్రూరనారాచంబులు సొనిపిన మసమూఁకలు
హాహాకారంబు లెసఁగ నతండు మూర్ఛిల్లిన నప్పాంచాలవరుండు. 100

తే. పలకయును వాలునుం గొని యలఘుజవము

---

1 జనక సైన్యయుతుండై. 2 దలమిగిలి చిత్ర.

మేఱయ నేలకు లంఘించి మెఱుఁగు మెఱచి
నట్లు సని తల గోయుట కప్పళించి
యొగిరె నగ్గురు తేరిపై కేపు మెఱయ. 101

వ. అంతటం దెలిసి యాచార్యుండు ధైర్యధురంధరుం డై యెదురు గదియం బడి నప్పటికి సాధనంబు లగు జేనకోలందితూపుల నతని నొప్పించినం గడుఁదురులు గఱచిన వెగడుపడునట్లు మొగతిరిగి యాద్రుపదనందనుండు నిజస్యందనంబునకు వచ్చి విల్లు గొని పె ల్లేసిన. 102

క. గురుఁ డతనిసూతుఁ దునుముడుఁ,దురగములు రథంబు ననికిఁ దొలఁగఁదిగువ నా
ధరణీసురోత్తముఁడు బం,ధురపాండవసైన్యసమితిఁ దోలెం బెలుచన్. 103

క. కలశజుని తెంపుఁ బెంపును, బలిమియునుం జూచి యపుడు పాండునృపతనూ
[1]జులదెస సైనికు లెవ్వరు, నలవు మెఱసి కడఁగఁ జాల రైరి నరేంద్రా. 104

వ. అట్టియెడ. 105

ఆ. అవ్విధమునఁ బల్కి యాచార్యుఁ డట పుచ్చు, నరిగి దుస్ససేనుఁ డాశినిప్ర
వీరుఁ దాఁకుటయును గౌరవపతి త్రిగ,ర్తునిబలంబుఁ బనిచెఁ దోడువడఁగ. 106

వ. ఆసంశప్తకులలో దండిమగలు మూఁడువేలరథంబులవారు బెట్టు గిట్టిన నావృష్ణి వీరుండు పంచశతముఖ్యరథికులం బంచత్వంబు నొందించి పెఱచతురంగబలంబుల నెత్తుట జొత్తిల్లం జేసిన నాత్రిగర్తసైన్యంబు దైన్యంబు నొంది ద్రోణు దెసకుం బఱచెం బఱచినం బోవక యువరాజు శైనేయుతోడ నానానిశితశరంబులం దురంబు సేయ నతండు. 107

దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి ·కక యదిప రోడుట.

క. ధనువు దునిమి నవ్వీర నీ,తనయుఁడు పటుశక్తిపై చెఁ డ
ల్తునియలుగఁ జేసె సాత్యకి, విను మాతం డతని నొందువిల

ఆ. అలిగి కృష్ణుతమ్ముఁ డతనిచాపంబును, సూతుఁ దురగములను
దునిమి సొగయనేసియును [2]భీమసేను ప్ర,తిజ్ఞ దలఁచి చంపఁ డొ

వ. అట ధర్మజభీమనకులసహదేవులు సాత్యకి సేనం దఱియం జొ
సైన్యంబులం బురికొల్పికొని ధృష్టద్యుమ్నాదియోధుల ము న్నిడికొ
మనవారును మార్కొని పెనంగి రాశైనేయుండును నీసేన బడలువడం జేయుచు ముస్నిటం బెనుఁజోఱ దఱిసి పోవు తెఱంగునం బోవుచుండె నంత నక్కడఁ గవ్వడి యును యుగాంతకాలరుద్రునికై వడి రౌద్రరసమయమూర్తి యై తనమునుము మొనల బారి సమరుచుండె మోహరంబు మొగంబున గురుండునుం గాంతేయ బలంబులం బొరిగొను చుండె నివ్విధంబున నమ్ముప్వురచేతను ప్రజాక్షయం బగు చుండం గురుపతి భారద్వాజునాజి యరసి పోవ వచ్చి యచ్చటం బాండవసైనికుల సంరంభంబుఁ జూచి యేచి యొక్కరుండును దలకడచి యమ్మొన వనజవనంబు

1 జాలసైనికులం దెవ్వరు. 2 భీమసేనుని, ప్రతిన దలఁచి చంపరాక చనియె.

నొచ్చువారణంబునుంబోలెఁ దఱియం జొచ్చి భీమసేనుం బదిబాణంబులను నకుల సహదేవద్రుపదవిరాటద్రౌపదేయుల సాయకత్రయంబులను గేకయు లేవురను శరద్వయంబులను ధృష్టద్యుమ్నుని నిరువదింటను శిఖండిని మూఁటను ధర్మ నందనుని నైదుదూపులను నేసి మఱియు ననేకనరతురగద్విరదరథనికరంబులం బటుప్రదరశతంబుల నొప్పించె నప్పుడు. 110

తే. అతనిచాపంబుఁ గుంతీసుతాగ్రజుండు,నఱకెఁ బెఱవారు వొదివిన నుఱక వారి నెల్లఁ గుంభజుఁ డమ్ములవెల్లిఁ దేల్చి, యురవడించి యాసైన్యంబు నుబ్బడంచె.

వ. కౌరవపతియు మగిడి యాసైంధవుకడకుం జనియెఁ దదనంతరంబ కేకయమహీ నాథుండు మార్కొని. 112

క. గురుఁ డెన్నిశరము లేసిన, వెరవున నన్నింటి నన్నివిశిఖంబులఁ దా మరలిచి బ్రహ్మాస్త్రపరిస్ఫురణము సూపినఁ దదస్త్రమునన యడంచెన్. 113

క. మఱియు నతనిమెయి బాణము, లఱువది [1]గిఱిగొలుప నాబృహత్క్షత్త్రుం డే డ్తెఱ సూతు నొంప నాతం, డఱిముఱి నారాచతతుల నవ్విభుఁ బొదివెన్. 114

తే. చిక్కువడఁ జేసి చనుమఱ యొక్కదొడ్డ,నారసమ్మున బిట్టేయ నరవరుండు ద్రెళ్లె శిశుపాలతనయుండు ధృష్టకేతుఁ, డమ్మహావీరుపై వీఁక నడరి యపుడు.115

క. పెనుమంట నుఱుకుశలభం,బునుబోలెం గవిసి కోలుపులిఁ గోలఁ వ్రే సినమాడ్కి నేసె నఱువది, సునిశితబాణముల నశ్వసూతయుతముగన్. 116

తే. బాణఘట్టనఁ గటకటఁ బడి గురుండు,విల్లు గ్రుంచిన నొండొకవింట నొంచె నాతఁ డక్కుంభసంభవుఁ [illegible] 117
[illegible] కదవెచిన నది ద్రో [illegible] డతని విరథుఁ, జేసి యాపలు దునిమినఁ జ [illegible]
[illegible] ని, ప్రదరంబుల నడఁగఁ దోమరము శక్తియు బె [illegible] నెడన్. 118
[illegible] డరించిన, మదమున నయ్యోధవరుఁడు మడియించె [illegible] 119
[illegible] ధనుం జేసి.
[illegible] ఱుఁగారెడు, వాలికనారసము చేదివరుహృదయమునం
[illegible] బాడ వెగయుచు, నేలం బడి తన్నికొని చనియె జముకడకున్. 120
[illegible] యాతనికొడు కడలుం, గనలుం బిరికొనఁగఁ దన్నుఁ గవిసినఁ బొదివెన్
[illegible] ధనురాచార్యుఁడు శీఘ్రంబున బెబ్బులికొదమ లేడిఁ బొదివినమాడ్కిన్. 121

తే. పొదివి యవలీల నాతనిఁ బొలియఁ జేయ
సమదగతి మాఱుకొని జరాసంధతనయుఁ
డస్త్రగురు నొంచుటయు నతఁ డల్గి యతని
గూల్చెఁ దత్సైనికులు గనుంగొనుచు నుండ. 122

వ. అట్టియెడ వడముడి ధృష్టద్యుమ్నుండు విన నివ్విప్రవరుం డప్రతిహతతపస్తీవ్రుం డు గాకేమి చూపులన దహించునట్లు తూపుల వేఁడిమిం బగఱఁ రూపడంచుచున్న వాఁ

1 గిల్కొలుపన్. 2 బొడవు సొగసి; బోడిమి సెడి.

డనిన నాద్రుపదనందనుం డతని మాఱొక్కనం గడంగునెడ నాతనిం దలకడచి.

ఆ. క్షత్త్రవర్మ గురునిచాపంబు ద్రుంచిన, వేఱ యొక్కదొడ్డవిల్లు రయము
మెఱయఁ గొనియతండు మెఱుఁగులు గిఱిగొను,నారసమున వానినామమడఁచె.

ఉ. అప్పుడు చేకితానుఁడు శతాశుగముల్ గురుమేనఁ గ్రుచ్చి తే
రొప్పఱ సూతు నొంచి తురగోద్ధతి మాన్ప నతండు గన్నులన్
నిప్పులు రాలఁ దద్భుజము నిష్ఠురబాణహతంబు సేసి వే
కప్పె శరాళి సూతుఁడు దెగన్ హయ లోటఱి గ్రేళ్లువాఱఁగాన్. 125

వ. ఇట్లు విరథుం డై చేకితానుం డోటమికోర్చి యమ్మెయిన తొలంగె నిత్తెఱంగున.

క. పెక్కండ్రువీరులు దనపై, రుక్కున రూపఱఁగ ద్రోణుఁ డుద్ధతిఁ దోడ్తో
నెక్కఁగ నితఁడు కుమారుం,డొక్కొ యనఁగ ముదుకఁడయ్యు నుగ్రతమెఱసెన్.

వ. ఆసమయంబునం బాంచాలపతి యీబ్రాహ్మణుండు వృషభంబులుంబోనిభూపా
లుర నెల్లను సృగాలంబుల కాహారంబు సేయుచున్నవాఁడు వారింపవలదే
యని కడంగి మొనలం బురికొలిపికొనుచు నక్కజం బగుకయ్యంబు సేయుచుండం
బాండవాగ్రజుం డాత్మగతంబున.

ధర్మరాజు భీముని నర్జునునకుఁ దోడ్పడఁ బుచ్చుట.

ఉ. అర్జునుఁ డొంటి వోయె నని యక్కడఁ బుచ్చితి సా...
సూర్జితు సాత్యకిం బెలుచఁ బోవుటయ...
దుర్జయశత్రుసైన్యముల దొంగ...
వర్జితవైరి భీముఁడున...
...నమునిఁ దల...

...
త్తమ్మునఁ దలఁపఁడ ధర్మ...

తే. పెక్కుచోటుల నెఱిఁగిన...
యితఁడుగలయనయ్యెదు...

వ. అని బహువిధంబుల విచా...

ఆ. భీముఁ జేర నరిగి బీభత్సు...
నని యెలుంగు గళమున...
నశ్రులొలుక మాటయ...
డార్తి సూచి యిట్టు...

క. ఏము గలంగినయప్పు...
భూమీశ తగునె యి...

చ. అనవుడు నాతఁ డిట్లని...
స్వనము వినంగ నైన...
యను[1]వెత నిప్పు డక్క...

1 వెఱ. 2 బుడిపింపఁ

ర్థునిఁ గని సింహనాదమున రోదసి నింపుము మాకు నింపుగన్. 135

క. నీతమ్ముఁగుఱ్ఱ రూపసి, నీతివిదుఁడు సకలసుగుణనిధి మద్భక్తుం
డాతని కెడ రగునో యను, చేతోగతి పల్లటిల్లఁ జేయదె తాల్మిన్. 136

ఆ. అనిన భీముఁ డిట్టు లనియెఁ దద్రథము రథ్యముల సారథిని శరాసనంబు
నెఱుఁగు దతనికొలఁది యెఱిఁగినయదియ నీ, కేల వగవ నిపుడ యేను బోదు.

వ. దేవరయాజ్ఞఁ దల నిడికొని చని యాకృష్ణులఁ గృష్ణానుజునిం గలసి యిక్కడ
కెఱుక సేయుదు నని పలికి పాంచాలనందనుం గనుంగొని కుంభసంభవు బలి
మియు నతనిప్రతిజ్ఞ తెఱంగును నెఱుంగుదు వేమఱ కుండుము నాకుం బోక
గర్జంబు గాదు గాకున్న నేలినవానియానతి నడప వలయు ననవుడు నతండు.138

క. వినుము భవత్సేనాపతి, తనువునఁ బ్రాణములు గలుగ ధర్మజు దెసకుం
జను దెంచువాఁడె ద్రోణుం, డనుమానము దక్కి యరుగు మర్జునుకడకున్. 139

వ. అనిన ధృష్టద్యుమ్నుపలుకుల కూఱడిల్లి యనిలతనయుం డన్నచరణంబులకుం
బ్రణతుండై యాలింగనంబును నాశీర్వాదంబునుం బడసియున్నయప్పుడు శౌరి
...నంబు వీతెంచిన నవ్విభుం డవ్వీరున కిట్లనియె. 140

...నిస్వన మదె యిది మఱఁది యెడరు సైరింపక కృ
... తలఁచెద నెద్దియు మెద్దు మధికరయమునన్. 141

...గంబును దూర్యనినదంబును దనసింహ
...ంబున రథ్యంబులు నెఱయ
...గలోకించుచు నడరు
... దుర్ముఖ
...బాహుసుదర్శనబృందారకు
సుశర్మదుర్విమోచనులును
...చి పొంగుసింగంబుచందం
గదిసి బృందారకుం దెగఁ
...ర మూఁడు వెడందదూపులం
142

ననువిందసుశ
నేసి నరేంద్రా. 143

...ర్చి పఱపె రథం బొ
కప్పె నుగ్రాస్త్రములన్.

యకుంభసంభవుండు దన
...ఁ దని తలంచి యప్పవన
145

క. నను గెలిచి కాక నీ కిష్టమైన పొరఁగా నెట్లు వచ్చు మును నీతమ్ముం
డనుమతుఁ డై కాదే చొరఁ, గనియె నను డనఁడు గన్నుఁగవఁ గెంపారన్.

క. నగుఁ ద్రోణరథికునియనుమతిఁ, జొరఁ దలఁచునె మనుజసేన సురబల మైనం
దెరలిచికొని విచ్చలవిడి, నరుగుం దనవలచినెడకు నది య ట్లుండెన్. 147

చ. ప్రియములు వల్కి నన్ననుసరింపఁగఁ బార్థుఁడు గాఁడు సుమ్ము దు
ర్జయభుజశక్తినిర్మథితశత్రుఁడు భీముఁడు గాని నీవు దం
డ్రియు గురుఁడుం బ్రియుం[1]డు నని ప్రీతి యొనర్చెదఁ బూని వైరికిన్
జయ మొనరింతు గాక యని సైఁతునె దర్పము సూప కుందునే. 148

వ. అని పలికి. 149

మ. గద సారించి చెలంగి వైచిన భుజాగర్వంబు సాలించి య
మ్మొదుకం డుర్వికి దాఁటి పోయె నది రశ్ముల్ మింటఁ బర్వంగ బె
ట్టిద మై మ్రోయుచు వచ్చి బ ల్పిడుగుమాడ్కిం దాఁకుడుఁ గుఱ్ఱముల్
సదిసెన్ సారథి మ్రగ్గెఁ దేరు వొలిసెన్ సైన్యంబు భీతిల్లఁగాన్. 150

వ. అప్పు డమ్మేటిమగండు. 151

క. మనమూఁక దఱిసి యుద్ధతిఁ, జనఁ జన నీనందనులు వెసం దాఁకియు ను
బ్బినయతనివీఁక కోర్వక, కనుకని సిగ్గు సెడి పాఱిరిగా .గురుఁ డంతన్. 152

క. ఒండొకతే రెక్కి సముద్దండతఁ జని భీమసేనుఁ దాఁకి శరము లొం
డొండ నిగిడించి నొంచిన, గం డడఁగక యతఁడు గనలు గదిరినమదితోన్. 153

చ. అరదము డిగ్గి యప్పటుశరావళి కోర్చి మొగంబు వాంచి స
త్వరుఁ డయి వాన పైఁ గురియ వంచినమస్తక మొప్పఁ బోవృసుం
దరవృషభంబులీలఁ జని దర్ప మెలర్పఁగ నొక్కచే నొగల్
వెరవునఁ బట్టి తేరు ప్రజ విస్మయ మందఁగ వీచి వైచినన్.

భీముఁడు ద్రోణాదిరథికుల నతిక్రమించి యర్జునుఁ జేరఁ బోవుట.

ఆ. నుగ్గునూచమైన నగ్గురుఁ డొండొక, యరద మెక్కి యల్ల నరిగె సేన
మొగమునకు రయంబు మిగుల విశోకుఁడు, దేర భీముఁ డెక్కెఁ దేరు ప్రీతి

వ. ఇవ్విధంబున ధనురాచార్యు బెట్టు వఱచి బిట్టు సనునాజెట్టిబిరుదున
జాలక భోజబలంబును గాంభోజానీకంబును యవనాదిమ్లేచ్ఛసై
బసులు పులికిం బొఱుతెఱంగునం గలంగి పఱచె న ట్లప్రతి
సాత్యకిసమరోల్లాసంబు గనుంగొనుచు నట్ల కడిచి యప
మెఱయఁ గౌరవ్యయోధులతోడం బెనంగుసవ్యసాచిం
నతనిం గనుంగొని ప్రియంబున నయ్యర్జునుండు
గగనంబు నినిచి రమ్మహారావంబు లాకర్ణి

1 యొనర్చినఁ..., గాక నిను సైఁతునె; యొ

నకు సంతుష్టాంతరంగుం డై తనలోనన యతని నగ్గించి యన్నరనారాయణుల యొలుంగులు వినం గనుటకుం బొంగుచు నప్పార్థుండు దనప్రతిజ్ఞ నెఱపి వచ్చి తన్నుం గౌఁగిలించికొనుటం గోరుచుం గౌరవపతి యిమ్మెయిం దమ్ములు బంధులుం వెగం బొలియుట దెలిసి యయినను దీరునకుం జొచ్చి యున్నవారి నైనం గాచికొనునొకో యని యూహించుచుఁ గయ్యంబు సేయు చుండె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 156

ఆ. ఇట్లు సింహనాద మిచ్చిన భీముని, మార్కొనంగ మగఁడు మనబలమునఁ
గలిగెనే మదాత్మజులఁ గాల్పఁ బుట్టిన, చిచ్చు వాఁడు వానిఁ జెనయు టరిది. 157

చ. అనవుడు నాతఁ డిట్టు లను నమ్మనుజేంద్రున కప్డు కర్ణుఁ డ
య్యనిలతనూజు మార్కొని రయంబున వింశతిసాయకంబు లే
సిన నతఁ డేడుతొమ్మిదులు చెచ్చెర నేసి సిడం బొకంట నే
పునఁ గుదియించె నారథికపుంగవు లట్లు దొడంగి యుద్ధతిన్. 158

వ. పెనంగునెడ భీమసేనుండు. 159

క సూతసుతువిల్లు ద్రుంచిన, నాతఁడు బలువింట నొంచె నతని వెస మరు
త్సూతి యదియుఁ ద్రుంచుచుఁ ద,త్సూతునిఁ దురగములఁ ద్రుంచె దుర్దమలీలన్.

ఆ. విరథుఁ డై యతండు వృషసేనురథ మెక్కఁ,బాఱుటయును గలఁగఁబాఱె సేన
లట్టియెడ నృపాలుఁ డాచార్యుపాలికిఁ, జనియెఁ దేరు దోలికొని రయమున. 161

దుర్యోధనుఁడు ద్రోణుని దూఱ నాడుట.

వ. చని యడిచిపాటు గదుర నతనితో ని ట్లనియె. 162

క. నరుఁడును సాత్యకియు వృకో,దరుఁడును మనసేనఁ గలఁచెదరు సైంధవుఁ జే
[illegible] దగునె నరునిం, జూర నిచ్చితయేని వారిఁ జూర నీ ననఘా. 163

[illegible]న నీ వోడుట, సముద్ర మింకుట జయించె సాత్యకి గురుఁ గ
[illegible]ముమున నని యొసఁగుజనవా,దమ మేలుగఁ దలఁచితొక్కో ధనురాచార్యా. 164

ఈభంగి నీ వడంగుట, మాభాగ్యము గాక యింక మాటలు వల దీ
[illegible]భం బెట్టు లుడుగుఁ జెపుమా భవదీయబలశౌర్యమతులకుఁ దగఁగాన్. 165

[illegible] నాతఁ డిట్టు లను నక్కడ నిక్కడ నొక్కరూపునన్
[illegible]నయిారెయెడరు మాన్పఁగ నోపినయంత మాన్చెద
[illegible]ర్య మవనీవర సైంధవుఁ గాచికోల య
[illegible]గె జూదము నాఁ డధికంపుటొడ్డుగాన్. 166

[illegible]నయది యస్థిరపు గెలుపు సెడ కీజూదం
[illegible]వెరవును లావుకలిమి మనుజాధీశా. 167

సాహాయ్యంబునకు నద్దెస నున్న కర్ణాదులం

గొని కవ్వడి మొదలగునమ్మువ్వురకుం జాలి [1]సింధురాజరక్షణంబు నిర్వహింపు మేను సేనాముఖంబున నిలిచి తక్కిన యందఱ నిలువరించుట మేలు నీతోవచ్చుట కర్జంబు గాదు పొమ్మనుటయు నతండు మరలి తన్నుం దాన పురికొలిపికొనుచు నట సనియె నప్పుడు యుధామన్యుండును నుత్తమౌజుండును మున్ను కృతవర్మచేత నివారితులై నరునితోడ [2]నఱుమం జనక కెలని కుఱికి యఱిముఱి మన మొన దెరల్చికొని బయలికి వెడలి కపిధ్వజగాండీవగుణారావంబులకతంబున నతనియున్న యెడ యుపలక్షించి తిరిగి వచ్చి బలువున మనబలంబు వాయఁ బాపికొని చొచ్చి విశ్వచ్చుం జేర వచ్చుచున్నం గని యక్కురువిభుండు వారల వారింపం గడంగిన.

క. ఆయిరువురతో నజ్జన,నాయకునకు నయ్యె దారుణం బగురణ మం
దాయతనృపచాపము రో,షాయత్తత నుత్తమౌజుఁ డార్చుచుఁ దునిమెన్. 169

తే. తునిమి తోడన యురమాడ సునిశితాస్త్ర
చయము నిగిడింప రాజొండు చాప మెత్తి
యతనిహయముల సారథి నవనిఁ గూల్చె
నాతఁ డరిగె యుధామన్యునరదమునకు. 170

క. అరిగి తురగముల సూతుం, బొరిగొన విరథుఁ డయి నృపతి పొలివోవక యు
ద్ధురగతి గద గొని చని త, త్తురగంబుల సారథిని బిదుర్పలు సేసెన్. 171

తే. రథము డిగ్గి తొలంగి రారథికు లమ్మహీశుఁ డేతెంచి యెక్కె మద్రేశుతేరు
వారు నీయోధు లిరువుర బారిసమరి, యారథము లెక్కి యర్జునుఁ జేరఁ జనిరి.

వ. అనుటయు నాంబికేయుండు సంజయున కి ట్లను మనవా రెల్లం గర్ణుండు గొంతేయుల గెలుచునని యాసపడుదు రాధర్మతనయుం డాతనియాటోపంబు దలంచి రేలెల్లను గన్నుమూయండు. 173

ఆ. అట్టిజెట్టి యనిలుపట్టిచే విరథుఁ డై, పోయి పోయినట్ల పోరు గాని
మరలి కయ్యమునకుఁ జొరఁ డెట్టు లాతని, తెఱఁగు సెప్పు నాకు.

చ. అనవుడు నాతఁ డిట్టులను నన్నరనాథున కట్లు సూతనం
దనుఁ బొరివుచ్చి భీముఁడు మదంబున నర్జునుదిక్కు వోవఁగాఁ
గని యతఁ డాయితం బయి తగం దనపేరెలుఁ గెత్తి పిల్చె నా
ధ్వని విని యావృకోదరుఁ డుదగ్రగతిన్ మరలెన్ మహీశ్వరా.

వ. అట్లు దార్కొని యర్కప్రతాపు లగునయ్యిరువురు నొండొరుశరఁ
చుచుఁ దురంగంబులయంగంబులం దూపులఁ గీలించుచు
చుచుఁ జాపంబులు విఱుచుచు మైమఱువు లఱువుల్లు సే
జొత్తిల్లఁ జేయుచు నొండొరులకు వేఁడిమి సూపి
నిలతనయుండు.

1 సింధురాజప్రాణంబులు నిర్వ. 2 నరుగంబ

క. విలు దునుము సేసి గుఱ్ఱం,బుల సూతునిఁ బిలుకుమార్చి భుజగనిభశరం
బులఁ జేడ్పఱిచిన సిగ్గతి, కలఁగి పఱచి యొండురథముఁ గర్ణం డెక్కెన్. 177

క. అన విని ధృతరాష్ట్రుం డి, ట్లను నమ్మినబంటు పిఱికి యై యిటు పఱవం
గని మందబుద్ధి దుర్యో,ధనుఁ డేమని తలఁచె నొకొ తనచిత్తమునన్. 178

వ. అది య ట్లుండె నాకర్ణునిబింకంబు పిదప నె ట్లయ్యె ననవుడు సంజయుం డతని
కి ట్లనియె. 179

తే. ఆననంబునఁ గ్రోధమహానలంబు, భీషణముగ రాధేయుండు భీముదెసకు
మరలి యురవడిఁ గవియ నయ్యిరువురకును మ, హాద్భుతం బగుసంగ్రామమయ్యె నధిప.

క. బలుదేగలకై వడి బెబ్బులులపగిది మత్తకరులపోలిక దర్పో
జ్జ్వలసింహంబులచాడ్పున, నలవుఁ జలము మెఱయఁ బెనఁగి రారథికవరుల్. 181

క. పెనఁగునెడం గర్ణునిది,క్కునఁ జతురంగములు బెట్టుగోల్తల నాభీ
మునిమీఁదఁ గవిసి మంత్రిం,చినయట్టులు గూలె నతనిచేతిబలుపునన్. 182

వ. అనవుడు నాంబికేయుండు. 183

క. తోడ రెడుగోలఁదియె వానికి, వడముడిభుజవిక్రమంబు వారల మన మె
ప్పుడు విన మె కర్ణు వినమొ, యడిబీరపుఁదులువ గెలుచు నటె పాండవులన్.

ఉ. సూతసుతుండు పాండునృపసూనులఁ బోర జయించు నంచు గ
ర్వాతిశయంబునన్ మనమదాంధుఁడు కృష్ణుఁ దృణీకరించి సం
ప్రీతిగ సంధి సేయఁడ యపేతకళంకులు వారు వారికే
లా తగ వేది దైవము దలంచు రణంబునఁ జేటు సంజయా. 185

వ. తానును తమ్ములుం జెడుదు రింతియ కాక యొండు గలదే యది య ట్లుండె
భండనంబు తెఱఁ గెప్పుమనిన నమ్మనుజపతికి నాసూతసంభవుం డిట్లనియె 186

...సినసేనఁ ...చి రభసంబునఁ గర్ణుఁడు భీముఁ గిట్టి ద
...ర్పొత్తి ముప్పదిశరంబుల నొంచినఁ గెంపుసొంపు వ
...కు నొప్పు సేయఁగ నతండు వెసన్ విలు ద్రుంచి సూతుప్రా
...ఁ గొనివం జలం బెదఁ బెనంగొన వాహనచోదకుండు నై. 187

...అతండు శక్తి వైచిన. 188

...దితునియలుగా నది, దునిమి మరున్నందనుండు తొమ్మిదిశరముల్
నేయ బలువిలు, గొని యన్నియ కర్ణుఁ డేసెఁ గ్రూరాస్త్రంబుల్. 189

... యప్పవమానతనూభవుఁడు నిశితమార్గణములు పై
...నసూనుండును సాయకముల [1]సోనలు గురిసెన్. 190

...లు అంకెలు గాఁగ వారు పొలిచిరి వృషభం
..., ర్మలయుచుఁ దాఁకుచు నుదాత్తరభసోజ్జ్వలులై.

నిందించుకొనవలయు నతండు గొడుకుల దెసను వారు రాజ్యంబు దెసను విగతా
శులు గావలయు నని పలికి మఱియును. 131

ఆ. రాజరాజుఁ బాసి రాజ్యసంపద ధర్మ,తనయుఁ జేరు పెంపు దారు దెలియఁ
గాంచి సాత్యకియును గవలును భీముండు, గారవించువారు గాక నన్ను. 132

క. సురగరుడోరగవిద్యా,ధరాదిభూతములు సూతతనయుని నేఁ డేఁ
బోరి వుచ్చిన ననుఁ బొగడుచు, నరుగుం గా కునికిఁ బట్ల కంబుజనాభా. 133

వ. అని యిట్లు సల్లాపంబు సేయుచుం గృష్ణార్జునులు నిజసేనఁ జేరి రంతకు మున్న
యిరువాఁగునం జేయం గలదొరలు దలపడినం బోరు ఘోరం బయ్యె నందు.

సీ. కర్ణసూనులలో నొకం డుత్తమౌజుని చేతఁ జచ్చుటయు శోకాతురుండుఁ
క్రోధదీప్తుండు నగుచుఁ గర్ణుఁ డాతని తురగకేతనములఁ దునుమ నాతఁ
డడిదంబు సేకొని యరదంబు డిగి కృపాచార్యరథ్యంబులఁ జంపి భీష్మ
వైరి తే రెక్కె నాశౌరదృప్తుం డట్లు విరథుఁ డయ్యును బలువిడిఁ గడంగ

ఆ. నతఁడు పాదచారి యని యాశిఖండి యవ్విప్రు నేయఁ డయ్యె వేగ మెద్ది
ద్రౌణి యతనిఁ దనరథంబుపై నిడికొని, యనికిఁ దొలఁగి చనియె మనుజనాథ.

వ. అట్టియెడ. 136

చ. అనిలసుతుండు దీవ్రవిశిఖంబులు పర్వఁగ నేచి యంబరం
బునడుమఁ దేజరిల్లురవిఁ బోలెడు వేఁడిమి కోహటించి నీ
మొన దెరలంగ నారథికముఖ్యుఁడు పార్థుఁ దలంచి సారథిం
గనుఁగొని మానసంబు దలఁకంగ రణోగ్రత దక్కి యి ట్లనున్. 137

క. నరుఁ డన్నవర్తనము తెఱఁగ, గరయుట కై మది గలంగ నట చనినాఁ డ
న్నరపతిదుర్దశ గని దు,స్తరశోకం బడరి తానుఁ దదవస్థుఁ డగున్. 138

తే. అయ్యిరువురకు నొకటి యై నట్టిదైన, మనము కౌరవసంఘంబు మ్రగ్గఁ జేసి
గెలుపుగొంటిమయేనియు ఫలముదాన, నేమి గలదనువగఁ జిత్తమెరియఁ జొచ్చె.

భీముఁ డర్జునురాక గోరి విశోకునితో విచారించుట.

క. ఐనను నిప్పటిదుఃఖము, మానింపఁగ మనకు నొండు మం దెయ్యది యీ
సేనల దొరలను గౌరవ, భూనాథుని సమయఁ జూచి పోవుట దక్కన్ 140

వ. అని పలికి యవ్విశోకునకు మనదిక్కుసిడంబులు సూపి యవి యెవ్వ రెవ్వరి
చిహ్నంబు లేర్పడం జూచికొనుము మనశరంబులకొలంది యె ట్లున్న దరయు
మనవుడు నతండు పీ రెవ్వరై రేమి నీ వలిగినఁ బడక పాఱక నిలువం జాలువాఁ
డిం దెవ్వం డస్త్రశస్త్రంబులసంపద యడుగ వలదు నేఁడు దెచ్చినవానిలోన
నా తెఱ్ఱువ్రేఁగుపడి పూని వచ్చుబండి యొక్కటి యించుకయు వెలితిగాకయున్న
యది గాక యున్న నేమి భవద్బాహుదండంబునకు మూలధనం బైనగదా
దండం [1]బెల్లపనికిఁ జాలు నని చెప్పినఁ బవమానసూతి యాసూతుచేసేత

---

1 బెల్లపనులకుం జాలు.

నప్పళించి. 141

ఉ. వేడుకఁ జూడు మేను బటువిక్రమకౌతుకలీలఁ బేర్చి చెం
డాడెద వైరులన్ విదురుఁ డప్పుడు సెప్పఁడె జూద మిట్లు గా
నాడెనె రాజరా జకట యాప్రతినల్ గడతేర్చుఁ గాక బొం
కాడునె ధర్మజావరజుఁ డంచుఁ దదాప్తులు వంత బొందగన్. 142

వ. అని వెండియు. 143

ఉ. ఉత్తమకర్మ మిట్టి దని యొక్కరుఁడుం దగఁ జెప్పలేఁడ నా
కిత్తటి నేన పోలుతెఱఁ గెల్లను జేసెద నట్లుఁ గాక నా
చిత్తము మార్గవర్తియుఁగ శిక్షక మయ్యెడు దైవ మంచు న
త్తెత్తి భవద్బలంబుపయి నెల్లను జూ పడరించె నేఫునన్. 144

వ. ఇట్లు గలయం గనుంగొని యద్దిక్కు గలగుండు గొనుట యెఱింగి విశోకునితోఁ గౌరవసైన్యంబు మనము దఱుముకయ తాన కలంగెఁ గెలనం గవ్వడి గదిసెనో కాక యనుటయు వాఁడు నిపుణంబుగా నిరూపించి ముదంబునం బొదలుచు.

క. నరుఁ డదె కంటే కౌరవ, కరిసేనం గవిసెఁ గేతుకపిరుచు లంభో
ధరబృందముపైఁ గలయం, బరఁగుతటిల్లతలఁ దలఁపఁ బట్టయి నిగుడన్. 146

క. హరిమేనికాంతియును నరు, కిరీటరత్నాంశువులును గిఱిగొన రథర
థ్యరుచులు బెరసి విచిత్ర, స్ఫురణంబునఁ దేజరిల్లెఁ జూడు కుమారా. 147

వ. అనిన విని యంతరంగంబు సంతోషమయంబు గా నంగంబు వొంగ నేర్పడ నాలోకించి విశోకునకు వృకోదరుం డి ట్లనియె. 148

తే పరవ్రుడుల నూఱ్వురను మేలివాజు లిరువ,దింటి నూళులు పదునాల్గు నిత్తు నీకుఁ
బసదనము నీవు నాకు బీభత్సురాక, నూపి ముద మొనరించితి సూతవర్య.149

వ. అనియె నప్పుడు వారణఘటావిదారణంబు సేసి వాసవి వాసుదేవుతో మనతేరు భీమసేనుఁ జేరం బోవ ని మ్మనుటయు. 150

క. అతఁడు హరులఁ దఱుమఁగ నుద్ధతిఁ జనునెడ మనబలంబు దర్పమహోగ్రా
కృతిఁ బొదివినఁ జతురంగ,ప్రతతుల నన్నరుఁడు నేలపాలుగఁ జేసెన్. 151

ఆ. మందరంబుచేత మథిత మై దిరుగుసా,గరముసులివు గెలిచె ధరణినాథ
పార్థుఁ డురవణింపఁ బలువడిఁ [1]గ్రలఁగెడు, కౌరవేంద్రుసేన [2]కలకలంబు. 152

వ. కేతుచామరాతపత్రభూషణశకలంబుల నాశౌర్యభూషణుండు రణక్షోణికి విభూషణం బాచరించె నట్లు కర్ణువధంబునకు వేగిరపడి తఱుమ నుఱక మన మొన వెండియు నొండొండ పయిం గ్రమ్మిన నమ్మేటిమగండు. 153

క. పేరు గలరథికముఖ్యుల, సారథిరథరథ్యకేతుసహితంబుగ దు
ర్వారవిశిఖ[3]విస్ఫురణవి,హారంబున శతచతుష్టయము పొడి చేసెన్. 154

---

1 గడఁగెడు. 2 కళవళంబు. 3 విస్మరణ.

వ. అవ్వేఁడిమికి వెఱచఱచి యచ్చటిమూఁక విచ్చుటయుఁ గర్ణముందటిమోహారం
బుత్సాహతీవ్రం బయి యుపవణించినం గని యన్నరుం డురగనికరంబునకుఁ
గవియుగరుడునికైవడి నద్దెస కడరె నట్లడరుట యాలోకించి తనకట్టెదుట
మొన బెట్టు దాఁకి. 155

తే. వాయుసత్త్వుండు వాయుజవప్రదీప్త, తనుఁడు వాయుతనూజుఁ డుదగ్రవృత్తి
నేచి బాహాసముల్లాస మెసక మెసఁగఁ, గనుపు గొట్టె వాలమ్ములఁ గౌరవేంద్ర.

వ. అవ్వీరునాటోపంబు సూచి కురుభూపతి ప్రధానసైనికులకుం జూపి యితండు
సమసిన నక్కడ సకలంబు సమయు మీ రొక్కుమ్మడిం బొదవి పొరివుచ్చుం
డనిన వారును వారణాదిచతురంగంబులయగ్గలిక మెఱయ నతనిం జుట్టుముట్టి
యస్త్రశస్త్రంబులం బొదువుటయు నతండు 157

ఆ. వానినెల్లఁ ద్రుంచి వల వ్రచ్చికొని లీల, నిగుడుచోఱవోలె వెగడువడక
తఱిమి రక్తనదులు వఱపె మస్తకకూర్మ, హస్తభుజగతతుల నతిశయిల్ల. 158

క. కురువిభుఁడు సూచి శకునిం, బురికొల్పిన నాతఁ డుగ్రముగ మార్కొని పే
రురమున నారాచంబులు, గురిసినఁ బవనజుఁడు సరకుగొన కారథికున్. 159

క. బలునారసమున నేసిన, నలఘులఘుత మెఱయ నాతఁ డది యిరుమూఁడ
మ్ములఁ దునియలు సేయుడు నతఁ, డలిగి యతనిధనువు దునిమె నల్లన నగుచున్.

ఉ. ఒండొకవిల్లు పుచ్చికొని యుజ్జ్వలషోడశభల్లముల్ సము
ద్దండత నేసె నీమఱఁది తత్తను వాడఁగఁ జాపకేతువుల్
ఖండములై పడంగఁ దురగంబులు నొవ్వఁగ సూతు మేనఁ బెం
గండలు నెత్తురుల్ దొరఁగఁ గౌరవపుంగవుఁ డిచ్చ మెచ్చఁగన్. 161

తే. అలిగి జమునాలుకయుఁబోనియతులశక్తి, వాయుపుత్రుఁ డారథికుపై వైచె నతఁడు
వెరవుమైఁ బట్టి దాన నవ్వీరుబాహు, పుచ్చిపోవైవ మన మొన యుబ్బియార్చె.

శకుని భీమసేనుం దలపడి మూర్ఛితుం డై తనరథంబుమీఁదఁ గూలుట.

చ. అనిలజుఁ డట్లు పెల్లెసఁగు నార్పులు సైఁపక మేటివిల్లు వే
కొని కనుదోయి గెంపుగ నకుంఠితవిక్రమ మొప్పఁ ద్రుంచె నా
తనిఘనకార్ముకంబు నిశితప్రదరంబులు మేన నించె నిం
చిన నతఁ డుర్విఁ గూలెఁ గురుసేనకు బెగ్గల మగ్గలంబుగన్ 163

తే. కూలి మూర్ఛ మునింగినఁ గురువిభుండు
దనరథంబుపై నిడికొని యనికిఁ దొలఁగఁ
బోవుటయుఁ జూచి తమతమపోరు మాని
దొరలు దెరలిన మూఁకలు మరలి పఱచె. 164

వ. ఇట్లు [1]వెఱచఱచి యవిసినకలంబుజనంబులు దీవి సేరిన యట్లు కర్ణుం జేరి కాలు
దన్ని నిలిచె నన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 165

1 వఱచి యవిసిన.

తే. అట్టియెడఁ గృతవర్మద్రోణాత్మజుండుఁ
గృపుఁడు నృపతియుఁ గర్ణుండుఁ గినియఁ జాల
[1]రయిరి కిమ్మీరవైరికయ్యంబుకడఁక
యిట్టు లుండునె పదపడి యెట్టు లయ్యె. 166

వ. అనిన సంజయుం డమ్మహీపతి కిట్లనియె నప్పుడు కరూశపాంచాలచేదిసైన్యం
బులఁ దఱుముటయుం గని కర్ణుండు గడంగిన మనమూఁకలుం బురికొని పవన
తనయుతోడం బోరె నప్పాండవసేనాసముదయంబు రభసంబున నారాధేయుం
బొదివిన. 167

క. అతఁడు వివిధోగ్రవిశిఖప్రతతులు నిగిడించి ఘోరభంగి నుదారో
ద్ధతి సూపినఁ జేడ్పడి తచ్చతురంగంబులును గలఁగె జగతీనాథా. 168

చ కనుఁగొని భీమసేనుఁడు శిఖండియు సైన్యవిభుండు ద్రౌపదీ
తనయులుఁ గేశవానుజుఁడుఁ దాఁకిన నందఱు కన్నిరూపులై
తనువులు సించుచుఁ గా హయవితానము నొంచుచుఁ గేతుదండఖం
డన మొనరించుచుం బెనఁగె డయ్యుక క్రుయ్యకతండు గండునన్. 169

క. నకులసహదేవులును వారికిఁ దోడ్పడి నిశితశరపరీతునిఁ జేయం
బ్రకటితబలశౌర్యుఁడు సూతకులోద్వహుఁ డేచి వారిఁ దలఁకం జేసెన్. 170

క. పెక్కండ్రతోడఁ గర్ణుం డొక్కఁడ పోరాడి యెక్కు డుక్కున వారిం
జిక్కువడం జేయుట గడు నక్కజమై యుండెఁ గౌరవాధిప చూడన్. 171

వ. ఇవ్విధంబున నద్దెసఁ జేయంగలమగల పెగ డంకించినం బోక పొదువుపాంచా
లచేదిమాత్స్యాదివర్గంబులపై నతం డనర్గళప్రసారంబు లగుశరాసారంబులు
నిగిడించినం గరిరథ ఘోటకభటావయవఖండంబులును వివిధాస్త్రశస్త్రశకలంబు
లును జామరచ్ఛత్రకేతుభూషణభాగంబులును భూభాగంబునం దొరఁగం
బెరిఁగి నెత్తురుటేఱులు వాఱ మఱియుం బాండవయోధవరులు వరుసం బోరి
పోరి యంత కంతకు నివ్వటిల్లునాకర్ణుక్రొవ్వున నివ్వెఱపడిన నవ్వీరుండు గోవులం
దోలుకొల్పులికైవడిఁ గౌంతేయబలంబులం బఱపఁ బాంచాలురు పెండియు
నండితనంబున నతనిం దలపడిన నాతండు పంచవింశతిరథికులం దునిమి
వైవస్వతుచందంబునం జేర్చినం దూర్యరవంబులు సెలంగం దత్పుత్రులును
దుర్యోధనకృపదుశ్శాసనులు నశ్వత్థామశకునికృతవర్మలుం బైకొని . యాధర్మ
నందనుసైన్యంబు సమయింప నది విచ్చిన నెలుం గిచ్చి పో నీక నిలిపి భీమ
నకుల సహదేవ ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయులు గడంగి కౌరవసైనికులం
గనుపుగొట్టం దొడంగినం బోరు ఘోరం బయ్యె నిత్తెఱంగున రెండుదెఱం
గుల మూఁకలు దెగటాఱు చుండ గాండీవి దమమోహరంబున కుత్సాహం
బెసంగ నొక్కవలన మన మొనల నెత్తుటం దోఁచుచుం గదిసి దలయెత్తిజూచి

1 రయిరి కిమ్మీర.

శౌరి నుద్దేశించి. 172

సీ. కర్ణునికేతువు గ్రాలెడుఁ జూచితే భీమాదు లైనయుద్ధామరథిక
జనులు పెక్కండ్రతో ననిసేయుచున్న వాఁడితనిప్రాపునగురుసుతుఁడుఁ గృపుఁడుఁ
గృతవర్మయును గురుపతి సురక్షితుఁ జేసికొని వీఁకఁ బాంచాలకోటి బడలు
వఱిచెద రురవడి దఱిమి యాఁరాంధేయు గిటడఁగింతము ఘోటకములఁ

తే. బటురయమునఁ బోనిమ్మని పలుకుటయును, శౌరి యట్టులుసేయంగ శల్యుఁ డమ్మ
హోగ్రరథవేగమును నరునుజ్జ్వలంపు, టేపుఁ గని సూతపుత్త్రుతో నిట్టులనియె.

క. కేతనకపిభయదం బై, తోఁతేరఁగఁ జక్రధరచతురసారథ్య
ద్యోతితపల్లనచారు, శ్వేతహరులు మెఱయ వచ్చు వీరునిఁ గంటే. 174

వ. అని మఱియును. 175

సీ. నవ్వొడుతలలను గ్రొవ్వారుచేతుల బిరుదులు వెట్టిన చరణములను
వాతులు దెఱచిన వాజిమస్తకముల గిరిశృంగములఁ బోని కరిశిరముల
నవయవభేదంబు లడఁగెడునట్లుగఁ దుము రైనబహుగాత్రసముదయముల
భయదంబు లై మహిఁ బడువిమానములట్ల యఱవఱ లైనట్టి యరదములను

తే. నేలఁ గప్పుచుఁ దనబాణజాల మడర, నెవ్వ రడ్డము సొచ్చిన నించుకయును
దవులఁబడక సముద్ధతిఁ దివిరి మనల, దేఱి చూచుచుఁ బార్థుఁ డీదిక్కు గవిసె.

క. తోడై డాపట వలపటఁ, గూడి తఱుము వారు లేరు కోపంబున నీ
తోడిబవరమున కడరెడుఁ, గ్రీడి మనతలంపు గూడె గెలువుము గడఁకన్. 177

ఆ. పాయ వడియె సేన బరవస మలరంగ, మార్గ్యనంగ మేటిమగఁ డొకండుఁ
గలుగ నోపఁ డేపు దలకొన మనము యి, బ్బలియుఁ దలపడంగ వలయుఁ గర్ణ.

వ. అనిన విని కర్ణుండు గవ్వడిబాహాబలంబును శౌర్యసాహసంబును దపఃప్రభావం
బును ముక్కంటితోడ నెక్కటి పోరుటయును బాశుపతాదిదివ్యాస్త్రంబులు
వడయుటయును బురందరప్రముఖబృందారకులకు నజయ్యు లగుకాలకేయుల
నిర్జించుటయు విరాటుపసులం [1]బట్టించుకొనుటయు లోనుగాఁ గలవిశేషంబు
లుగ్గడించి కృష్ణమాహాత్మ్యంబు వొగడి యిట్టివారల నే నొక్కరుండన మా
ర్కొని మదం బడఁగించెద మద్రనాయక మనతేరు వారియరదంబునకు సమ్ముఖం
బుగాఁ జనని మ్మనిన నతం డట్లచేయఁ గనుంగొని కురుపతి పురికొలుపఁ గృపకృత
వర్మగురుపుత్త్రగాంధారవిభులును గొందఱు కుమారులును విక్రమాటోపంబు
దీపింప నయ్యంగరాజుం గడచి యడరి యాఫల్గునుం బొదివిన నమ్మహాభుజుండు
హరిణకులంబు గనినసింగంబువిధమున విజృంభించి యారథికులపైఁ గలయ
వివిధవిశిఖంబులు నిగిడించి ధనువులు దునిమియు ఘోటకంబులఁ గూల్చియు
సారథుల సమయించియుఁ దత్సేనాచతురంగంబుల బడలువఱిచియు నబ్బలు
మగలం దెరల్చి యెుత్తరించి కెలనన దురంబు సేయునమ్మరుత్తనయుం జేరం

1 బెట్టించుకొనుటయు.

జని బహువిరోధిజనపయోధిమగ్నుం డగుచున్న యతని నుద్ధరించి సంప్రీతుం డగునతనికి నగ్రజుకుశలం బెఱింగించి సంతోషసాగరంబునం దేల్చి నీ వింక డప్పి యార్చి కొమ్మని పలికి రాధేయరభసోత్సాహసహితం బగునీబలంబు మీఁదం గవిసిన. 179

కురుకుమారులు పదుగు రర్జునుం దాఁకి మృతు లగుట.

చ. తొడరి భవత్తనూజులు పదుండ్రు సముద్భటసింహనాదులై
వడిఁ దనుఁ జుట్టు ముట్టుటయు వారలసూతహయధ్వజంబులం
బొడి పొడి సేసి యాతఁడు రిపుల్ వెగ డంద వెడందతూపులన్
మెడలు దెగంగ నేసి రణమేదినికిన్ బలిసేసె నత్తఱిన్. 180

వ. అట్టియెడ. 181

తే. నవతికౌరవరథికులు గవిసి కడిమిఁ
బొదువుటయు నన్నిశరముల భూరిరయము
మెఱయ నందఱ దెగటార్చి తఱుమునతనిఁ
దాఁకె వేయుమున్నూ ఱుదంతావళములు. 182

వ. ఇట్లు దాఁకిన యాభీరాదిమ్లేచ్ఛ[1]నికరంబుల నతం డనేకవిధవిశిఖంబుల విరియింపం బైపైఁ గరితురగసుభటరథసమూహమ్ములు గ్రమ్మినం గని కడంగిన వడ ముడితో డ్పాటునం జేడ్పడియు నవి వోక పొదివి పెనంగిన గద గొని యరదంబు డిగ్గి యగ్గలిక నప్పవనతనయుండు దారుణరణవిహారంబున నెఱయ మెఱయం దఱుచుగా మెఱుంగువాలంపగములు గాండీవి గుప్పింప నప్పు డమ్ముఖంబు చతురంగంబులయం దొక్కఁడేనియు రక్తంబునం దోఁగనియట్టిది లేక యుండె నట్లు గార్చిచ్చు వొదివినకాననంబు చందం బయి యాసైన్యంబు రూపఱ విఱిగి 'కర్ణ కర్ణ కావు కావు' మను నెలుంగులతో నతనివెనుక కొదిఁగిన నీకొడుకు లబ్బలుమగని బలసి నిలువ నావీరుండు దీవికై పడి సమరార్ణవంబున మునుంగ నీక యమ్మోహరంబు నుద్ధరించి మాఱ్పోఁ బాటించి కిరీటి దెసకు నడరె నంతకు మున్న యరదం బెక్కి యనిలతనయుం డాధనంజయునింగూడుకొనిన నయ్యిరువురకుం దలకడచి పాంచాలు రంసూతనందనుం దలపడుటయు. 183

తే. ద్రౌపదీనందనులును సాత్యకియుఁ బోను
గాఁగ బాండవసైనికోత్కరము గవిసి
కూడికొనియుఁ బాంచాలురఁ గురువరేణ్యు
యందఱకు నన్నిరూపులై యతఁడు పెనఁగె. 184

వ. అప్పుడు. 185

సీ. జనమేజయునిసూతుఁ దనిమి రథ్యంబున నొ నేసి భీమతనూజనకుల

1 నివహంబుల...విదళింపం బైపైఁ.

సుతులచాపములు ఖండితములు సేసి ధృష్టద్యుమ్నుమాపుల సమయఁ జూచి
మెయి వెంచి సాత్యకిహయములఁ గూల్చి కేకయకుమారుని జముకడకు ననుపఁ
దజ్జనకుం డల్గి తన్ను నొప్పించి [1]ప్రసేనునిఁ దాఁ జూడఁ జెలఁగి చంపు

తే. టయును బుత్త్రశోకంబు గిన్కయు మనంబు
నందుఁ బిరిగొన రాధేయుఁ డతని నఱకె
శినివరుం డొండువాజులఁ దనరథమునఁ
బూన్చికొని వచ్చి తత్సుతుఁ బొదివె నధిప. 186

వ. ఇట్లు సూతపౌత్త్రుం డగుసుషేణుం బొదివి శినిపౌత్త్రుండు. 187

చ. హయములఁ జంపి ముప్పదిశితాస్త్రములం దెగటార్పఁ జూచి తం
డ్రి యమునిచంద మై [2]తెగితిరే శినివీరుఁడ యంచు నేయుఁడు
న్భయదమహోగ్రతఁ నిగుడునారసముఁ నడుమఁ శిలీముఖ
త్రయమునఁ ద్రుంచి మేనఁ బ్రదరత్రితయంబు శిఖండి గ్రుచ్చినన్. 188

తే. కనలి యాసూతపుత్త్రుఁ డాతనిసిడంబు
ధనువుఁ దునుమాడి పార్షతతనయుఁ డగుసు
దేవుఁ దండ్రులు గనుఁగొనం గా వధించి
యేసె సుతసోముఁ డడరిన నేపు దఱుఁగ. 189

వ. వెండియుఁ బాంచాలరథికసంఘంబులు రాధేయుమీఁద నురవణింప సమీరణ
సుతసహాయుం డగుసవ్యసాచి వానిం గడచి యక్కర్ణు నరదంబున కడరె నట్టి
యెడ నుత్తమౌజుండును జనమేజయుండును యుధామన్యుండును శిఖండియు
ధృష్టద్యుమ్నుండును నతనిం దలమిగిలి యబ్బలుమగనిం బొదివి యింద్రియం
బులు దృఢాత్మునిం గలంపం జాలనిచందంబున నాసూతనందనుఁ [3]దెలర్పం
జాలరైరి వారలకేతుచ్ఛత్త్రసూతతురగధనుస్తూణీరంబులు రేణువులు సేసి
బహుబాణంబులఁ దనువులు నో నేసి సింహనాదంబు సేసిన యయ్యంగపతిపై
సుసంగతు లై ద్రౌపదికొడుకులు గవిసిరి వారిం గూడికొని శినివరుం డాసేనా
పతి వారి నేయుసాయకంబులు ద్రుంచి యాతనికిం దోడ్పడుటకుం గడంగిన
కౌరవపతియంగంబున నెనిమిదిసునిశితవిశిఖంబులు గ్రుచ్చి పేర్చిన. 190

క. అలిగినయన్నరనాథుని, కెలఁకుల వెసఁ దఱిమి కర్ణకృపకృతవర్మల్
బలుతూపుల నేయఁగ నన్నలువుర స్రుక్కించె నతఁడు నారాచములన్. 191

తే. దొరలఁ గడఁచి బలంబు లుద్ధురత నిగుడ
వారిమొనలు నెఱిర్చిన ఘోరతుముల
సంగరం బయ్యె నయ్యవసరమునందుఁ
దాఁకె దుశ్శాసనుఁడు వాయుతనయుతోడ. 192

---

1 సుదేవునిఁ దాఁ జూడఁ గా వధించు. 2 తెగితెటే. 3 గదల్పలేరైరి.

దుశ్శాసనుఁడు భీమసేనునితోఁ బోరి చచ్చుట.

తే. సారథులయుబ్బువాజులచటులతయును, మెఱయనొప్పారుతేరులమీఁదఁ బొలిచి
రపుడు గయ్యంపువేడుక నాతఁడును న,తండుఁ జూపఱకన్నులపండు వగుచు.
క. ఒండొరులమీఁద నుజ్జ్వల, కాండము లడరించు చట్లు గడిసినయెడ భీ
ముండు ప్రమోదభరితచి,త్తుం డయి తగనిట్టు లనియె దుశ్శాసనుతోన్. 194
ఉ. ఆసభలోనఁ గొన్న ఋణ మంతయు నీఁగఁగఁ గంటి వడ్డితో
బాస కొంకింతయుం దొలఁగఁ బాఱకు తీర్చెద నిప్డు నేఁడు నా
చేసినపుణ్య మెవ్వరును జేయరు నిన్నిటు పేరఁ దెచ్చుటం
జేసి విధాత నాకుఁ గృప సేయుట గానఁగ వచ్చెఁ దమ్ముఁడా. 195
వ. అనిన విని యతఁ డతని కిట్లనియె. 196
సీ. ఎఱుఁగుదు వఱచితి నే లక్కయింటఁ జిచ్చిడి మిమ్ముఁ బఱచినయిడుమలవియుఁ
[1]గాకయు నమ్మెయి గాంధారరాజు మీయన్నతో వెడజూద[2]మార్చి రాజ్య
లక్ష్మిఁ జేకొని కానలకుఁ బోవ నడిచితి మందుఁ బెక్కాపద లనుభవించి
యజ్ఞాతవాసార్థ మవ్విరాటునిప్రోలి కరిగి యత్యంతదైన్యంబు నొంది
ఆ. యట్లు మీర లునికి యప్రసిద్ధమె యివి, యేల రిత్తమాట లేటు పోటు
తలకు వచ్చి యనుడు దరహాసమునఁ గెంపు,గదురఁ బవనసుతుఁడు గడఁగి డాసి.
క. భల్లములు మూఁట సిడమును, విల్లు నఱికి సూతకంఠవిదళనమున శో
భిల్లి నిటలమునఁ బటుద,ర్పోల్లసితుం డగుచు నాటె నొకనారసమున్. 198
వ. దాన బీఱు వోవక దుశ్శాసనుండు. 199
క తురగములఁ దాన నడపుచు, వెరవు రయము మెఱయ నొండువిలు గొని గాఢ
స్ఫురణమున భీముతనువునఁ, బరఁగించె మెఱుంగు లడరఁ బండ్రెం డమ్ముల్.
క. తోడన కోదండము దును,మాడెను సూతుమెయిఁ గ్రుచ్చె నాఱమ్ములు సం
క్రీడయపోలెను ముప్పది, యాడించెను మఱియుఁ దూపు లనిలజుమేనన్. 201
మ. ధను వొండుగ్రత నెత్తి యేఁబదిశితాస్త్రంబుల్ మరుత్సూనుఁ డా
తనిగాత్రంబునఁ గ్రుచ్చినం గినుకమై ధైర్యంబు శౌర్యంబు నొ
ప్ప నతం డుజ్జ్వలభల్లయుగ్మ యుగళస్ఫారాహతిన్ వాజులం
దునిమెం జూపఱు పిచ్చలింప విలసద్దోర్గర్వదుర్వారుఁ డై. 202
వ. ఇట్లు విరథుం డై వృకోదరుండు మెయివెంచి. 203
మ. గదలీలం గొని తేరు డిగ్గి మెఱుఁగుల్ గ్రమ్మంగ సారించి యు
న్మదయానంబునఁ గిట్టి ఘోటకములన్ మ్రందించి బాహాబలం
బు దలిర్పన్ భవదీయసూనునరదంబుం డెల్లఁ ద్రోచంగ బె
ట్టిదపుందోమర మెత్తికొం చతఁడు దాఁటెన్ నేలకున్ గ్రక్కునన్. 204

1 గాక యే మమ్మెయి. 2 మాడి రాజ్య.

వ. అట్లు దాఁటి బెట్టు వైచినయత్తోమరం బురం బాడ నేచి యక్కీచకారాతి
పదుమూఁడువత్సరంబులు దమపడినపాట్లును బ్రతినచందంబును డెందమున
నావహిల్ల నుద్దండగదాదండంబున దుశ్శాసను వైవ నతండు నెత్తురు దొరఁగ
ధరణిం బడిన బెబ్బులి లేడిఁగొదమం బొదువుపోలికం బొదివి మెడ ద్రొక్కి
యొక్కుడుమదంబున నక్కుమారునితో ని ట్లనియె. 205

క. మును సభఁ బలికినదానం, దని వోవక యిచ్చటికి వెదకి వచ్చితి యే
మనియె దనుము నీమాటలు, వినుటకు నాకినుక సాల వేడ్కపడియెడున్.206

వ. అని యమ్మహాబలనందనుండు మహోగ్రలోచనప్రభలు నిగుడ మనబలంబులం
జూచిన. 207

క. నిగుడుదవాగ్నిజ్వాలల, వెగడందినమృగకులంబువిధమున నతిభీ
తి గదిరి నలుగడ విచ్చిన, జగతీశ్వర యతఁడు మెఱసెఁ జక్కనిబయలన్. 203

వ. అప్పుడు నీయందుఁ జేయంగల సైనికులుసూచి తత్తేజోవిశేషంబునం జూడ్కు
లు మిఱుమిట్లు గొన వెఱచఱచి యంతంత ఱెచ్చవడియుండ. 209

శా. లీలం గేల నమర్చి మత్తగజకేళీసుందరోల్లాస మా
భీలత్వం బలరింపఁ ద్రిప్పఁ జదలం బృథ్వీస్థలిన్ వైచు ముం
గాలం ద్రోచు మొగంబు వ్రేయు దెస లుగ్రస్ఫూర్తి వీక్షించు మోఁ
కా లూఁదుం బయిఁ గ్రమ్ము ఱంగ మెడ [1]చిక్కం ద్రొక్కి నిల్చున్ నగున్.210

వ. ఇవ్విధంబున ఘోరవిహారంబు సలిపి భీమవిక్రముం డగునాభీమసేనుం డయ్యువ
రాజునాననం బాలోకించి. 211

క. ఏ నురము వ్రచ్చి నెత్తురు, దేనియ [2]యిదె ద్రావెదం గదిసి ననుఁ గడిమిన్
మానుప దిక్కుగలిగిన, న్రాని [3]మ్మెలుఁగింపు మీమొనం గలవారిన్. 212

వ. అని పెలుచం బలికి కఠారంబు వెఱికి యతనిమొగంబుమీఁద జళిపించి. 213

భీమసేనుఁడు దుశ్శాసనుని యురంబు వ్రచ్చి రక్తపానంబు సేయుట.

మ. నరసింహుం డసురేంద్రు వ్రచ్చుకరణి న్రౌద్రం బుదగ్రంబు గా
నుర మత్యుగ్రతఁ జీరి క్రమ్మురుధిర మ్ముల్లాసి యై దోయిట
న్వేర వారం గొని త్రావు మెచ్చుఁ జవికి న్మేనున్ మొగంబున్ భయం
కరరేఖం బొరయంగఁ జల్లికొను నక్కౌరవ్యుఁ జూచుం బొరిన్. 214

వ. ఇట్లు దారుణభంగిం బ్రతిజ్ఞాకరణపూరణం బాచరించి. 215

తే. తల్లి చన్నులపా లేను ద్రావ నెట్టు, లానవే పలుతెఱఁగులతేనియలును
ఖండశర్కరతోడిదుగ్ధంబు లనుభవింపఁబడవే యవియు నింతయింపు గావు.

చ. అని యెలుఁ గెత్తి పల్కు నలి నాడు మహోద్ధతిఁ ద్రుళ్లి నార్చుఁ బె
ల్చన భుజ మప్పళించుఁ దమసైనికులున్ మనవారు రక్కసుం

---

1 వక్కం ద్రొక్కు. 2 వలెఁ ద్రావెదం. 3 మ్మెఱిఁగింపు.

డని వెఱఁ గందువారు గళితాయుధు లయ్యెడువారు భీతి మూ
ర్ఛను బడువారు నై రణవిరామముఁ బొంద మదోత్కటాకృతిన్. 217

వ. పదంపడి. 218

మ. గద సేతం గొని యంత్యకాలయమరేఖం బేర్చి రక్తంబుచా
య దల్పిరం దను పుగ్రసుందరముగా నవ్వీరుఁ డేతెంచి యు
న్మదమాతంగములీల దోఁప మనసేనం బొల్పఱం దోలి వే
పొదివెం గ్రమ్మఱ దుస్ససేను వికటస్ఫూర్తిస్ఫురన్మూర్తి యై. 219

వ. చలంబు నెఱయ నతనికాలు గేల నమర్చి మొగంబు గనుంగొనుచు నక్కి
మ్మీరవైరి యి ట్లనియె. 220

క. ఏమిర పసు లని యార్వవు, నీమాటలు నిలుపఁబడియె నే పసరమ మి
మ్మేము మగుడ నిదె యార్చెద, మీమాటకు మాఱు పల్క రెవ్వరుఁ గంటే.

ఉ. నెట్టన యల్గినం దగునె నీళ్లను ద్రోచుటయుం విషాన్నముం
బెట్టుటయుం మహాభుజగభీషణదంష్ట్రలపాలు సేతయుం
జుట్టలుఁ బెద్దలుం జెలులుఁ జూడ సభం నెఱి మాలి యమ్మెయిం
దిట్టున కోర్చు టుందుఁ గలదే విను గెల్వరె జూద మెవ్వరున్. 222

క. అని పలికి క్రమ్మఱఁగ మన, మొనమీఁదం బ్రమరివాఱి ముద్గరలలితం
బునఁ గేలు మెఱయఁ జని తన, కన [1]లడఁగక దుస్ససేనుఁ గనుఁగొని పలుకున్

ఉ. ప్రేవడి పోయెఁ గాక ధృతరాష్ట్రుఁడు గన్న ది యేమి యాసభం
దా వల దన్నఁ గీ డుడుగదా పతి లేఁ డనఁబడ్డకాంత నేఁ
డీవు గనుంగొనంగఁ బతియేడ్తెఱ నొప్పెఁ బతుల్ విజృంభిత
శ్రీ విలసిల్లుకామినులు సేడ్పడి రి ట్లపతిత్వదీనతన్. 224

క. విను మేను జేయఁ బూనిన, పనులం దొకటి గడతేఱెఁ బాపాత్ము సుయో
ధనుఁ బొరిగొని తల దన్నుదు, నను రెండవపనియుఁ దీర్ప నరిగెద నెలమిన్

చ. అని యెలుఁ గెత్తి చెప్పి యతఁ డాతనిఁగీ టడగించి యార్చెఁ గ
ర్ణనకును లోను గా మనవరూథినియోధులకుం మహాభయం
బున మనముల్ గలంగఁబడి పోరికి నూల్కొన నీనిఱిచ్చుపా
టున సకలాంగకంబులు గడుం శిథిలంబులుగా మహోగ్రుఁ డై. 226

క. జనపతియుఁ గృపప్రముఖులుఁ, గనుఁగొన ని ట్లనిలసుతుఁడు [2]గ్రౌర్య మొడల్ గై
కొనినట్లు పేర్చి దుశ్శాసనుఁ జంపుటఁ జూచి రోషసంరంభమునన్. 227

వ. నీకొడుకులు కవచియు నిషంగియుఁ బాశియు దండధారుండును ధనుర్గ్రాహుం
డును నలోలుపుండును సహుండును షండుండును వాతవేగుండును సువర్చసుం
డును గూడి కవిసి వివిధవిశిఖంబుల నతనిం బొదివిన నంతకుమున్న దుశ్శాసన

1 లడరఁగ. 2 క్రౌర్యోద్రేకం బునఁ బేర్చినట్లు.

రక్తపానకౌతుకాధీనమానసుం డై నయ్యాభీమసేనుపై నెవ్వరు గడంగుదురో
యని కన్నిడి యుండి యతం డప్రతిహతంబుగాఁ బ్రతిన [1]దీర్చుటకుఁ బ్రీత
చిత్తుం డగుఫల్గునుండు భల్లదశకంబున నక్కుమారదశకంబుశిరంబులు దును
మాడె [2]నట్టిభీమార్జునుల యాటోపంబున కోటలే నీసైన్యంబు సమరవిముఖం
బయ్యె నాసూతనందనుండును భీతుం డై వదనంబు వెలవెలఁ బాఱ నూర
కుండె నప్పుడు శల్యుం డతని నాలోకించి యి ట్లనియె. 228

తే. ఉగ్రుఁ డై దుస్ససేనుని యురము వ్రచ్చి
రుధిర ముగ్రతఁ ద్రావుమరుత్తనూజుఁ
జూచి చేడ్పడి చెయ్వెదఁ జూచితే సు
యోధనుని నీవు నట్లైన నొప్పు నెట్లు. 229

క. బలియు రగురాజులును గాల్, నిలువక తెరలంగ వీరె నీప్రాపున శ
త్రులఁ దాఁకఁ దలంచి కృపా,దులు నిలిచిరి కూర్చికొను మతులధైర్యమునన్.

చ. కడు వెగ డంది యున్ననినుఁ గన్గొని [3]పీఁడె యుదారధైర్య మే
ర్పడ వృషసేనుఁ డొక్కరుఁడుఁ బాండుతనూజుల మార్కొనంగఁ బో
యెడు నను నీవు దాఁకి వలదే రణభారము నీభుజంబునం
దిడియె సమస్తముం గురునరేంద్రుఁడు దానిఁ దలంపు మిత్తఱిన్. 231

వ. అనిన విని యతండు సమరోన్ముఖుం డయ్యె వృషసేనుండు భీమసేనుపై నురవణింప
నకులుండడ్డపడి యక్కుమారునిసిడంబును గొడుగును గోదండంబును ఖండించిన.

చ. అలిగి యతండు వేటొకశరాసన మెత్తి రథమ్ము ఘోటక
మ్ముల నిలఁ గూల నేయఁ బొలివోవనిధైర్యము పేర్మి వాలునుం
బలకయుఁ గొంచు మాద్రితొలుపట్టి ధరిత్రికి దాఁటి బెట్టుగో
త్తలఁ జని తత్సహాయభట దారణకేలి యొనర్చి పేర్చినన్. 233

ఆ. కర్ణసుతుఁడు పలక ఖండించి కృష్ణస,ర్పంబుఁ బోనిపటు కృపాణ ముఱక
నఱికి నారసములు నాటించె నయ్యర్జు, నానుజన్ముమేన నల్ల నగుచు. 234

వ. అప్పుడుధృష్టద్యుమ్నుండునుయుధామన్యుండునునుత్తమౌజుండునుశిఖండియు
జనమేజయుండును సాత్యకియు ద్రౌపదేయులును రౌద్రంబు శోభిల్ల రుద్రుల
కైవడి వృషసేనుపయిం గవిసినఁ గృతవర్మకృపద్రోణిదుర్యోధనులును శకు
నియుఁ దతోదరులు గొందఱును గ్రందం దఱిమి దుర్వారవిశిఖవర్షంబుల
వారలం గప్పినం గని గజసాధను లగుకళింగు లురవణించి. 235

క. కృతవర్మ సిక్కువడ భూ,పతి సేడ్పడ శకుని వెగడుపడఁ దదవరజ
ద్వితయము ధరఁ బడఁ దీవ్రో,[4]ద్ధతిఁ బోరిరి చాపటంకృతంబులు సెలఁగన్.

---

1 దీర్చుటకు ఫల్గునుండు ప్రీతచిత్తుం డై యుండె నంతభీముండు భల్ల. 2 నట్టిభీముని యాటోపంబున. 3 వెండి. 4 ద్ధ్రతి...టంకృతులు సెలఁగంగన్.

వ. ఇత్తెఱంగునం బోరినం గనలి కడంగి 237

క. ఆముువ్వురుఁ జలమున నుద్దామద్విపసహితచిత్రదళనంబున సం
గ్రామతలము రక్తాక్తం, బై మెఱయ బలాధిపత్రయముఁ బొరిగొనినన్. 238

క. తక్కటిరథికజనులు పేరుక్కున నయ్యిభచయంబు నొదిఁగించియునుం
జిక్కువఱిచియుం దునిమియు, నెక్కుడుమద మొప్ప మెఱసి రిభపురనాథా.

వ. మెఱసినం జూచి. 240

ఆ. అరద మెక్కి తఱిమె ననిలతనూజుఁ డస్వీరుతోన పాండవేయసేనఁ
జేయఁ గలుగువారలు శితశరాసారంబు, లడర వారిమీఁద నడరుటయును.

వ. రణంబు దారుణం బయ్యె నందు. 242

సీ. కర్ణునియగ్రభాగంబునఁ గరిఘటల్ దునుమాడునకులనందనునిఁ గిట్టి
వృషసేనుఁ డమ్ములవెల్లిపైఁ బరఁగించి శితభల్లమున సూతుశిరము ద్రుంపఁ
గనుఁగొని యక్కర్ణతనయునిమీఁద బార్థాదులు గవిసిన నతఁడు పార్థు
ననిలజు మూఁడుమూఁ డమ్ముల నొప్పించి యాశతానీకుని నట్ల చేసి

తే. నకులుతనువునబాణసప్తకము సొనిపి, శార్ఙ్గధరు మేనఁ బండ్రెండు సాయకములు
వఱపి పేర్చినఁ గౌరవప్రతతి మెచ్చి, పార్థువేఁడిమి యూహించి భయముఁ బొందె

చ. కెలఁకులయోధులం గడచి క్రీడి వడిఁ వృషసేనుమీఁద న
మ్ములు నిగిడింప నారథికముఖ్యునిమూఁపున నక్కుమారుఁ డే
పలరఁగ వాఁడితూపులు రయంబు మెయిం బది బెట్టు గ్రుచ్చి య
గ్గలిక ముకుందు నేసె నవకాండములన్ దివి ముట్ట నార్చుచున్. 244

వ. ఇట్లు విజృంభించిన. 245

### అర్జునుఁడు వృషసేనుని మృతిఁబొందించుట.

మ. భ్రుకుటిస్ఫూర్జితఫాలభాగుఁ డగుచుం బొంగారి యాసూతపౌ
త్రకుకోదండము బాహుదండములుఁ జిత్రస్ఫూర్తిఁ దున్మాడి మ
స్తక ముగ్రోద్ధతిఁ గ్రూరభల్లవిలసద్ధారాహతిం ద్రుంచె బా
ణకళాదుర్దముఁ డన్నరుం డపు పతియు న్రాధేయుఁడుం జూడఁగన్. 246

వ. ఇవ్విధంబున వృషసేను సమయించుటం జూచి కర్ణుండు శోకవ్యాకులచిత్తుండై
కన్నీ రొలుకం గోపాటోపంబున నుద్భటుం డగుచు నమ్మహారథుని తేరికి సమ్ము
ఖంబు గాఁ దనయరదంబు వఱపించి యర్జున యర్జున యని యాహ్వానంబు
సేసిన నతండును సవిశేషోత్సాహంబునం బొదలి యడరె నట్టియెడ దురంబు
దక్కి యిరువాఁగునుం బరమకౌతుకంబునం గనుంగొను చుండ నయ్యిరువురు
రామసన్నిభంబులు నాదిత్యసంకాశంబులుఁ ద్రినయనప్రతిమంబులు నగునాకా
రంబుల నుల్లసిల్లిరి వారలయెక్కటికయ్యం బాలోకించు కుతూహలంబున
సుర పితృ విద్యాధర సంయమిసంఘంబులును శచీపతి ప్రజాపతి పశుపతులును

లోనుగా ననేకదివ్యు లేతెంచి నభోభాగంబున నిలిచి రప్పుడు బ్రహ్మ రుద్రున కి ట్లనియె. 247

కర్ణార్జునులద్వంద్వయుద్ధకాలమున బ్రహ్మరుద్రేంద్రుల ప్రశ్నోత్తరములు.

క. ఇరువురు నతిరథులు సమస్ఫురణులు విక్రాంతిపరులు శూరులు వీ రొం డొరువులతోఁ బెనఁగఁగ న,శ్వర మగు జగ ముడుపరాదె సమరం బనఘా.

క. అన విని యాదేవుం డవ్వనజభవున కిట్టు లను నవార్యోద్ధతు లీ ఘనభుజులు వీరిరణ మె,ట్లును జెల్లుం దప్ప దప్పలుకు విడు మింకన్. 249

వ. అని యి ట్లమ్మహాత్ములు సల్లాపంబులు సేయ నాకర్ణించి పాకశాసనుండు సప్రణ యంబుగా బ్రహ్మ కి ట్లనియె. 250

చ. తపము నుదాత్తశౌర్యము నుదగ్రబలంబును గల్గు క్రీడిక య్యపువెర వెక్కు డై గెలుచునట్లు గ నీవు దలంపవే పురా ణపురుషు లై నకృష్ణుల రణంబున శాత్రవు లాక్రమించుటం గుపితమనస్కు లై న నిలకుఁ బ్రదు కెమ్మెయిఁ గల్గనేర్చునే. 251

వ. నరనారాయణులకు నెందును జయంబు ధ్రువం బని తొల్లియుం జెప్పితి రిమ్మహా త్ములు జయించుట లోకహితంబు గర్ణుండు ద్రోణభీష్మప్రాప్తం బై నపుణ్యలోకం బు వడయుఁ గిరీటి చిరకాలం బిడుమలం బడినవాఁడు గావున రాజ్యసుఖంబు లనుభవించుం గాక యనిన నప్పరమేష్ఠి వీరలజయాపజయంబులు నిశ్చయిం చి పలుక నేల యనుటయు నీశానుం డతని నాలోకించి నిశ్చయించుట మేలకాక యె గ్గేమి నిశ్చయింత మని కలిసికొని యతండునుం దానును వాసవువలను విలోకించి కృష్ణార్జునుల నుద్దేశించి. 252

తే. మహితమును లగువీ రెండుమాఱు లేక,మెలఁగువా రయి కాదె జన్మించినారు వినుము నీచెప్పినట్టుల వీరి నొరులు, ధిక్కరించుట లోకహితంబు గాదు. 253

వ. వీరికి జయంబు ధ్రువం బని పలికి యంత నిలువక వీరిజయంబులు ధ్రువంబయ్యెడు మనవుడు నయ్యమరవిభుండు సురమునిప్రభృతులం గలయం గనుంగొని దేవదేవు లిరువురు నేకమతంబు గా నిశ్చయించిన లోకహితం బగునానతి యాకర్ణించితిరే మీచిత్తంబు లి ట్లెఱుంగున కనుకూలంబులు గావలయు ననిన నందఱు నది యిట్టిద కాక యెం డగునే యని రనిమిషులు గుసుమవర్షంబులు గురియించుచు దివ్యదుందుభిధ్వానంబులు సెలఁగించి రయ్యవసరంబున నఖిల భూతంబులును విస్మయోత్ఫుల్లనయనంబు లగుచు నమ్మహాద్వంద్వయుద్ధంబు వీక్షించువేడుక నొండుదలంపులు దక్కి యుండె నట్లు దారొకానినమహనీయ రథంబులు రెంటియందును సన్నాహసముజ్జ్వలు లై యొప్పు వాసుదేవార్జును లును గర్ణశల్యులును దమతమశంఖంబు లొత్తి రప్పుడు. 254

తే. రెండుసేనలశంఖభేరీముఖంబు, లై నబహుతూర్యములపటుధ్వాన మడరి

నింగి [1]వ్రాంగారె నత్యంతనిశ్చలంబు, లయ్యె సైనికనికరంబు లద్భుతముగ.

సీ. కపికేతనము హస్తికక్ష్యయు నమ్మహాబలు లిద్దఱును దపోబలమువలనఁ
గన్నవి యై బుద్ధి గల్గి శోభిల్లు సుగ్రీవ యప్పుడు కపి యొరఁగి హస్తి
కక్ష్యపై నడరినఁ గయ్య మారెంటికిఁ గలిగె నం దాహస్తికక్ష్య దెరలె
నంబుజాక్షుండు మద్రాధినాథుండును దృక్కులహంబునఁ దేజరిల్లి

తే రర్జునుండును గర్ణుండుఁ దర్జనంబు, లైనచూడ్కు లొండొరుపులయాననములఁ
బఱపి రాకృష్ణపార్థులబలుపు శల్య, కర్ణచిత్తదౌర్బల్యముల్ గానవచ్చె 256

వ. అట్టియెడ నాసూతనందనుండు మద్రపతి నాలోకించి. 257

తే. అర్జునుఁడు నన్ను నోర్చిన యట్టులైన, నెట్లు సెప్పుమ యనుడు మద్రేశుఁ డేను
గృష్ణు లిద్దఱ నొక్కటఁ గిట్టి తీవ్ర, బహుళశరజాలములపాలుపఱుతు ననియె.

ఆ. అట్ల సవ్యసాచి యడిగిన మురవైరి, నగుచు నినుఁడు గూలినను ధరిత్రి
పఱియలైన మేరు వ్రాఱగినఁ గర్ణుచే, నీవు గోలుపోవు టేల కలఁగు. 259

వ. అని వెండియు. 260

ఉ. [2]అట్టిద లోకపర్యవస మాదురవస్థకు ద్రుక్కనేర్తునే
కిట్టుదుఁ గర్ణశల్యు లనుకీటములం గరతాడనంబులం
బెట్టుదు నేలఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు గాఁగ ధర్మజుం
గట్టుదుఁ బట్ట మన్న నగి గాండివి యద్దనుజారి కిట్లనున్. 261

ఉ. నవ్వుల కంటెఁ గాక యని నాకు నశక్యమె కర్ణశల్యులం
గ్రొవ్వడఁగించు టే ద్రుపదుకూఁతురు గొల్వునఁ బడ్డపాటునన్
నెవ్వగఁ బొందుచున్ సమయనిష్ఠ నడంగితిఁ గాని యింక నా
ముప్పురుఁ బూని వచ్చినను ముట్టెదఁ గర్ణుని నేలఁ బెట్టెదన్. 262

మ. అరదంబున్ సిడమున్ హయవ్రజము శల్యాంగంబులుం జాపముం
గరకాండంబులుఁ జెక్కుభల్లముల నుగ్రస్ఫూర్తిఁ దున్మాడి ని
ష్ఠురభల్లం బొకటన్ సుయోధనునిచూడ్కుల్ సీఱుగా నిద్ద యు
ద్ధురగర్వోన్నత మైనకర్ణుతలఁ ద్రుంతుం జూడుమీ పేడుకన్. 263

ఆ. కర్ణమద్రపతులకాంతల విధవలఁ, జేయువాఁడ నీవు సెన్ను మిగిలి
నగుచు నేడు ద్రుపదనందనవీనుల, ధర్మసుతునిచెవులఁ దనివు నినుపు 264

క. సంతసపువార్త వుచ్చుము, కుంతికి నే దంతి దరువుఁ గూల్చినక్రియ దు
ర్దాంతగతిఁ గర్ణుఁ గూల్చుట, యంతయుఁ గన్నారఁ జూచి యచ్యుత యొలమిన్

వ. అని పలికె నాసమయంబున నుభయసైన్యంబులజనంబులకు నంబరంబున నున్న
దివ్యసమూహంబులు నందు గీతనృత్తంబుల నుల్లసిల్లునప్సరోగణంబులుం గాన
నైన నద్భుతంబున వారు ననిమిషులై యుండి రప్పు డేకనిశ్చయు లగుకర్ణుం

---

1 బొంగారె. 2 ఇట్టిద లోకపర్యవస మే దురవస్థకు.

డును దుర్యోధనుండును నచ్చెరువాటునం బొరయక దురంబుమీఁది భరం
బునం బొలిచి రిరువాఁగుసైనికులు గిరీటికిఁ గర్ణునకు నభిముఖంబుగాఁ దల
మిగులఁ దగ దనుబుద్ధిని భయంబునను దద్రథంబులు రెంటిని బలసి నిలిచి
రమ్మహావీరులు ధనుర్ద్యుతులను బాణప్రభలను దీవ్రతేజంబులును బ్రదీప్తులై
కల్పాంతసూర్యులచందం బగుచు నొండొరుల నోర్చుకడంకలఁ బేర్చి రయ్యవ
సరంబున నశ్వత్థామ గురుపతిఁ జేరం జని కరంబు సేతం దెమల్చి సాంత్వన
[1]స్వరంబున ని ట్లనియె. 266

అశ్వత్థామ దుర్యోధనునకు హితోపదేశంబు సేయుట.

చ. కలన గురుండు భీష్ముఁడును గాండివిచేఁ బడి రంగరాజు వా
రల కధికుండె యాతని దురంబున నోర్వఁ గలండె పూని యే
వల దని బుద్ధి సెప్పిన నవశ్యము నాతఁడు నిల్చు నీతనిన్
నిలుపుము నీవు ధర్మసుతునిం దగుమాటలఁ దేర్పఁ జొప్పడున్. 267

వ. తెలిపిన దామోదరుండునుం దెలివి నొందు. 268

క. భీముఁడుఁ గవలును ధర్మజు,చే మరలెడువార లేను జెప్పెడిపలుకుల్
భూమీశ కురుకులమునకు, నీ మొనరాజులకుఁ బ్రజకు హిత మూహింపన్.

చ. వలవదు నన్నునుం గృపు నవధ్యులఁగాఁ గొని క్రీడి గెల్వ శ
క్తు లని తలంప భీష్ముఁడును ద్రోణుఁడు లోక మెఱుంగఁగా నవ
ధ్యుల హరికల్మి నారథికు దోర్బలలీల నడంగి [2]పోరె య
చ్చలమొ ఫలంబొ యిం కయిన సంధి యొనర్చుట మేలు వారితోన్. 270

చ. హరి సను దెంచినప్డు మన మమ్మెయిఁ బల్కితి మింక సంధికి
న్వైర వగు టేల గెల్తు నని నీవు దలంపకు మాంబికేయు భూ
వరుఁడుగఁ జేయు ధర్మజుఁ డవశ్యముఁ బాండునృపాలుపాల యే
వురకు నమర్చుఁ గాని చనవుల్ వెలిమెచ్చును నొల్లఁ డేమియున్. 271

తే. పాండవులయట్ల రాధాసుతుండు నాదు
పలుకులకు నియ్యకొను నీవు బ్రదుకు తెరువు
పట్టు బ్రదికిన నెల్లశుభములుఁ గలుగు
నీసు మానుము చచ్చిన నేమి గలదు. 272

క. వెడతలఁపు లుడిగి సంధికి, నొడఁబడు మిది లెస్స దీని కొడఁబడమి గడుం
జెడుతెరు విప్పటి [3]పదనున్, గడవఁబడుట ద్రాటఁ దప్పుకరణియ చుమ్మీ. 273

చ. అన విని యమ్మహీరమణుఁ డాతని కి ట్లను నిప్డు దస్సనే
నునిపని దీర్చి మారుతతనూభవుఁ డాడినమాట యేర్పడ
న్వినియును సంధి సేయుటకు నీ వభిలాషము సేత యొప్పనే

---

1 పూర్వంబున. 2 పోవకే చలము. 3 పదనం, గడవఁబడుట.

వెనుకకు కర్ణుఁడే యుడుగు టేలవె మానుము ద్రోణనందనా. 274

శా. శ్రాంతిం బొందినవాఁడు పార్థుఁ డపరిశ్రాంతుండు గర్ణుండు దు
ర్దాంతోదగ్రత నేఁడు గీటడఁచు నీతం డాతనిన్ వహ్నియ
త్యంతంబున్ శిశిరత్వ మొందినను గోత్రాళుల్ వడం కాడినం
గుంతీసూనుని చేతఁ గర్ణున కనిం గోల్పాటు వాటిల్లునే. 275

వ. అని పలికి యజ్ఞనపతి తనసైనికుల నాలోకించి సమరసముత్సాహపోషణంబు లగుభాషణంబుల ముఖరుం డగుటయు నఖిలతూర్యంబు లొండొండ మ్రోసెఁ బాండవబలంబునను భేరీపణవాదులరణనంబులు నిగిడె నప్పుడు కర్ణుండును నర్జునుండును. 276

క. కరి కరి గిరి గిరి నంభోధర మంభోధరముఁ బెలుచఁ దాఁకిన క్రియఁ దాఁ
కిరి కడఁగి గగనతటియును, ధరణియు మ్రోయుచు వడంక ధరణీనాథా. 277

క. మెఱయు పెటిమాఫ్రులను గడు, మెఱుఁగారెడునరదములును మింటను మంటల్
వఱపెడు వాలమ్ములుఁ జూ,పఱ నత్రోలుతాఁకు పెఱఁగుపడఁ జేసె నృపా. 278

వ. ఇవ్విధంబున నవ్వీరోత్తము లుదాత్తభంగిం దలపడి పెనంగం దొడంగిన నుభయసేనలవారలు నార్పులు నింగి ముట్టఁ జెలంగి రట్టియెడ. 279

మ భరితోత్సాహతఁ బేర్చి దీప్తు లడరన్ భల్లమ్ములొక్కుమ్మడిం
బరఁగం జేయుము కర్ణగాత్రములలోఁ బార్థుండ వే త్రుంపు మి
క్కుటభూపాలకురాజ్యకాంక్ష దొరయే కోదండపాండిత్యవి
స్ఫురణం గర్ణుఁడు నీకు నీబలుపు నేఁపుం జూపు మత్యుగ్రతన్. 280

వ అని పాంచాలురు పార్థజయార్థసంభాషణంబులు నేసిరి కౌరవులును గర్ణుడగ్గఱి.

చ. కడఁగుము నీదు బాణములఁ గవ్వడి గూలినఁ జాలు నంతతోఁ
జెదుదురు పాండవుల్ రణము నేయునుదగ్రత యెల్లఁ దక్కి పే
రడవుల కేఁగి సాధుమును లై చరియింతురు కౌరవేంద్రుఁ డీ
పుడమి సమస్తముం బొగడు పొంపిరి వోవఁగ నేలు లీలతోన్. 282

వ. అని తఱిమిరి ప్రొద్దునుం జాల వ్రాలెఁ గాలాంతకప్రతిము లగునప్పార్థకర్ణు లన్యోన్యజయార్థు లై పెనంగునప్పుడు. 283

## కర్ణార్జును లొండొరులమీఁద దివ్యబాణంబు లేయఁబూనుట.

సీ. కర్ణుండు పదిచండకాండంబు లర్జునుతనువునఁ జొనుప నర్జునుఁడు దీప్త
ఘనబాణములు పదునెనిమిది కర్ణు మైఁ బరఁగింప నయ్యంగపతి దశోగ్ర
చక్రమార్గణముల సరభసంబున నొంచె నన్నరు నాతండు నట్టి వన్ని
శరములు రాధేయు[1]నురమున నాటించె నతఁడు దొమ్మిదివాలురమ్ము లతని

తే. సఖమునఁ గ్రుచ్చి సాయకద్వయము శౌరి, మేననిగిడింప బీభత్సుఁ డేను మెఱుఁగు

---

1 నురము నాడించిన.

తూపు లాసూతపుత్త్రు నెత్తుట మునుంగ, నేసె బాహాసముల్లాస మెసక మెసఁగ.

చ. అలిగి కడంగి సూతసుతుఁ డచ్యుతపార్థులఁ దీవ్రబాణసం
క్తులఁ బొదువం బరాక్రమకుతూహలి యవ్విజయుండు పిన్నన
వ్వొలసి ముఖాంబుజంబునకు నొప్పుగఁ దద్రథరథ్యకేతుసూ
తులను దదీయగాత్రమును దూపులవెల్లి మునుంగఁ జేసినన్. 235

క. ఆతఁడును దురగసారథి, కేతుయుతము గాఁగ ముంచెఁ గ్రీడియపోలెన్
శాతశరవృష్టి నన్నరు, నీతెఱఁగున మఱియుఁ బెనఁగి [1]రిద్దఱుఁ గడఁకన్. 236

శా. ఆయుగ్రాహవకేలి నిట్లు నిపుణుం డై యొప్ప నప్పార్థుఁ డా
గ్నేయాస్త్రం బరివోసి దారుణమహాగ్నిజ్వాలికల్ భీషణ
స్ఫాయద్భంగి నభస్స్థలిన్ నిగుడ దర్పస్ఫూర్తి శోభిల్ల రా
ధేయాంగోద్దహనాభిలాష మెడఁదన్ దీపింప బెట్టేసినన్ 237

ఉ. అంతకకోపవహ్ని విపులాకృతి గైకొని వచ్చినట్లు మి
న్నంతయుఁ దాన యై కవియు నవ్విశిఖంబు మనంబులోన నా
వంతయు శంక లేక సముదగ్రత వారుణమార్గణాహతిన్
శాంతముఁ జేసె విక్రమవిశాలుఁడు కర్ణుఁడు మాకు నుబ్బగన్. 238

ఆ. ఫల్గునుండు మేఘబాణ మేసిన భూన,భోంతరంబు సంభృతాంధకార
మయ్యె సూతసూనుఁ డనిలాస్త్ర మేయుడు, నాతమంబు విరిసె నాక్షణంబ. 289

ఉ. అర్జునుఁ డైంద్రబాణము సమంచితభక్తి[2] ధరించి మంత్రవి
స్ఫూర్జితగాండివుం డయి రిపుప్రకరంబులు సంచలింప న
త్యూర్జితశక్తి నేయుడు మహోగ్రబహుప్రదరప్రకారతా
దుర్జయలీల నిర్మథనదోహలి యై యది కర్ణుఁ గిట్టినన్. 290

క. అతఁ డభిమంత్రితబాణ,ప్రతతిఁ దదుద్రేక మడఁచి పార్థుని మేనన్
శితశరములు నినిచిన మా,రుతపుత్త్రుఁడు గనలి యన్నరున కి ట్లనియెన్. 291

ఉ. సూతసుతుండు నీయెదుర స్రుక్కక నిల్చుట కాక నీశర
వ్రాతము నిర్వరించి యనివారణ నొంపఁ దొడంగె ఖాండవం
బేతెఱి వొంది కాల్చితి మహేంద్రుఁడు నివ్వెఱఁ గంది యుండఁగా
నాతెఱి వాత్మ నూల్కొలిపి యగ్గలికం దెగటార్పు మీతనిన్. 292

చ. తెగి మన కగ్గ మై యరుగుదెంచినవాఁ డితఁ డల్క యింక నొం
డుగడకుఁ బోవ కుండఁగఁ గడున్ వెస డగ్గఱి యేఁ గపాలముం
బగులఁ దునో గదానిహతిఁ బార్థ భవత్ప్రకటప్రతిజ్ఞకై
తగ దని మాన్చె దేని నిశితప్రదరంబులఁ ద్రుంపు కంఠమున్. 293

వ. అని పలికె నప్పుడు. 294

---

1 రిద్దఱును దగన్. 2 దలంచి.

సీ. పుండరీకాక్షుండు గాండీవితో నీదుదివ్యబాణములు రాధేయుచేతఁ
దూలపోవుటయు బల్ దూపుల నాతండు నిను నొంచి యిట్లు పేర్చినవిధంబు
నుత్సాహ మెడలి నీ పునికియుఁ గని కురుసంతతి యార్వఁ బాంచాలకోటి
పిలుసని పోవంగ నెఱుఁగవో యెఱిఁగియుఁ దగఁజేయునది లేక వెగడుపడితో
తే. చక్ర మిచ్చెద నతని మస్తకము దునుము, మనిన నగుచుఁ గిరీటి బ్రహ్మాస్త్రమధిక
నిష్ఠమై నేయ నది బహునిష్ఠురప్ర,దీప్తశరమూర్తిఁ గర్ణునిదెసకు నడరె. 295

క. ఆరథికుఁడు దలఁకక నియ్యు,మారూఢప్రౌఢభావుఁ డగుచుఁ దదస్త్రో
దారతరబలమునన త,ద్దారుణసంరంభ ముడిపె ధరణీనాథా. 296

తే. ఉడిపి తోడన కవ్వడి యొడలఁ గృష్ణు
మేన మూఁడుమూఁ డడరించె మెఱుఁగుఁదూపు
లన్నరుఁడు గర్ణుతనువు శల్యాంగకములుఁ
జించెఁ దొమ్మిదితొమ్మిది శితశరముల. 297

ఆ. మొనసి క్రీడి మఱియు మూఁడు నెనిమిదియు, రెండు నాల్గు పదియుఁ జండమార్గ
ణములు గ్రుచ్చె సూతనందనుమై నతఁ, డుఱక యతనిమౌర్వి యూడనేసె.

వ. ఏసి మఱియు శితశరంబులం బొదువం బొలివోవక పార్థుం డాగుణంబు సమా
హితంబు సేసి పెల్లేసిన రయంబున రాధేయుం డతనిశింజిని శిథిలంబు గాద
కాక యని తలంచె నాధనంజయుం డతనివింటినారి వికలంబుఁ గాఁ జేసి. 299

క. చిఱునగవుతోడ మైమఱు, వఱువుళ్లుగఁ జేసి యతనియంగము దోఁగం
బఱపె రుధిరంబు బెడిదపు, మెఱుఁగు పెడఁదయంపగమి నమిత్రులు దలఁకన్.

చ. తెరలక కర్ణుఁ డవ్విజయుఁ దీవ్రశరత్రయవిద్ధుఁ జేసి మం
దరధరు నస్త్రపంచకనితాంతహతిం గడు నొంచె నాశరో
త్కరము [1]వరప్రభావకలితం బగుటఁ మగుడంగ వచ్చె ని
ష్ఠురరభసం బెలర్ప మధుసూదనుఁ గ్రమ్మఱ నేసె నాతఁడున్. 301

క. అలఘుపటుభల్లపంచక,ముల రెంటం గ్రీడి చిత్రముగ నయ్యస్త్ర
మ్ములు మూఁడు మూఁడు శకల,మ్ములుగాఁ దునుమాడెజనులుపొగడ నరేంద్రా.

క. కర్ణుని మెయి నాలోనన, కర్ణాంతాకృష్టచండకాండము లధికో
దీర్ణక్రోధంబున న,భ్యర్ణగతుం డగుచుఁ గ్రుచ్చె నతఁ డే పలరన్. 303

చ. మఱియు నరుండు సూతసుతు మర్మవిభేదన మాచరించిన
న్మెఱుఁగులు గ్రమ్మునమ్ముల వినిశ్చలధైర్యము పేర్మి నాతఁ డు
క్కఱక పెనంగె దానఁ గన లగ్గలమై వెస నమ్మహాభుజుం
డఱిముఱిఁ జీఁకటుల్ గవియు నట్లుగ రోదసి నించెఁ దూపులన్. 304

తే. వెగడుపడి చక్రరక్షకుల్ వెనుక దిక్కు, గాచురథికులుఁ బార్శ్వసంగతులుఁ దమ్ము
విడువఁ జాలక లజ్జ వో విడిచి రపుడు, గర్ణువారలు వాఱుట గని విభుండు.

---

1 వరప్రసాదకలితం.

క. ఆదిక్కువారు భీముం, డాదిగ నని సేయ కుండు నన్నియతియెడం
దా దైన్య మొంది తప్పం, గా దని యూహింప నీని కలఁకకతమునన్ 306

దుర్యోధనుఁడు తనయోధుల నర్జునుం దలపడఁ బురికొలుపుట.

వ. ఇరుగెలంకులమూఁకలం గలయం గనుంగొని యెలుం గెత్తి. 307

క. తోడరుఁడు పొదువుం డేయుఁడు, పొడువుఁడు బీభత్సుఁ బ్రిదిలి పో నీకవెసం
బడ వైవుం డొక్కుమ్మడిఁ, గడఁగి యనుచుఁ జేయి వీచెఁ గౌరవనాథా. 308

క. విను మతఁ డిమ్మెయిఁ బురికొలి,పిన రథ కరితురగసుభటబృందములు రయం
బున నురవణించె నయ్యర్జునుపైఁ దగువారు నిలిచి చూచుచు నుండన్. 309

వ. ఎదిరి సైన్యంబు సమరంబు దొఱఁగి యుండుట యెఱింగి కడంగుట పాడి
గా దని దొరలు దూరంబునకుం జోర కుండిరి గాండీవి కోదండగుణ[1]రణనభరి
తభూనభోంతరుం డగుచు వివిధవిశిఖజ్వాలాకలాపంబుల వేఁడిమి సూపిన నే
పఱి వెఱచి యమ్మూఁకలు వఱచిన నక్కురునాథుం డద్దొరల నుద్దేశించి. 310

క. బీరమును లావుఁ గల్గిన, మీ రందఱుఁ గన్న నొకనిమీఁదన యిమ్మెఁ
బో రెల్లఁ ద్రోచి ఫల్గునుఁ, జేర కునికి యాయుధోపజీవుల తెఱఁగే 311

వ. అనిన విని యుల్లంబుల లేనియుత్సాహంబు దెచ్చికొని వా రొక్కుమ్మడి నుర
వడించిన. 312

మ భరితక్రోధమహోగ్రవృత్తి సిడముల్ భంజించుచున్ సూతుల
న్ధరణిం గూల్చుచుఁ జాపముల్ నఱకుచు న్రథ్యంబులం జంపుచున్
నరుఁ డాభీలపరాక్రముం డగుడు దైన్యం బంది వెన్నిచ్చి వి
చ్చిరి వా రందఱు దివ్యసంఘము నుతించెం జూచి యవ్వీరునిన్. 313

చ. కురుపతి వెండియుం దఱుమఁ గోల్తలు సేయర క్రమ్మఱంగ నె
వ్వరు నతిభీతి నిట్లు మనవా రెడ గాఁ జని చూచు చుండి ర
ప్పురుసున నాసమిద్ధరణిభాగము శూన్యతఁ బొందఁ గర్ణుఁ డ
న్నరుఁ దలపడ్డ నప్పటిరణంబు మహాద్భుత మయ్యె భూవరా. 314

చ శ్రమమున సోలు చుండియుఁ బరాక్రమసంపదసొంపు మీఱ దు
ర్దమవివిధాస్త్రజాలతిమిరంబుల నొండొరుఁ గప్పి కప్పి శౌ
ర్యములును బాహువీర్యములు రాజుల నచ్చెరువందఁ జేయ ను
గ్రముగఁ బెనంగి రయ్యమరరాజతనూజుఁడు సూతసూనుఁడున్. 315

వ. అట్టియెడఁ దక్షకునపత్యంబై తత్సోదరుం డగునైరావతుండు పెనిచి యుప
లాలింప నుల్లసిల్లినయశ్వసేనాభిధానుం డగునాగకుమారుండు సర్పముఖశరా
కారంబు గైకొని తనయొద్ద నుండఁ దాను బసిండియొఱం బెట్టి యనుదినంబును
గంధపుష్పంబుల నక్షతంబుల నర్చించుచు నయ్యర్జునుమీఁదం బ్రయోగించు
వాఁడై [2]యున్న యట్టియమ్మహానీయాస్త్రంబు రోషావేశవివశుం డగుచుఁ బుచ్చి

1 రవభరిత 2 యునిచి నటియమ్మ.

కొని తలదెగ వ్రేయుటకై యక్కర్ణుండు సముదీర్ణజ్వాలాజాలంబు లంబరంబు నం బర్వఁ జూఁటఁ పాపాకారంబులు సేయం గార్ముకగుణంబున సంధించి తెగ వాపినం గని [1]యారథికుచూపు కంఠంబుదక్కటికిం గాక తప్పి యపాంగ ప్రదేశంబుకొలంది యగుటంజేసి యది నెపంబుగా శల్యుం డతనికిఁ జిత్తవైక ల్యం బాపాదింపం దలంచి యీసంధానంబు మెడ దనుముట కనుగుణంబు గాదు నిపుణంబుగా నిరూపించి యొండుభంగి సంధింపు మనినఁ గర్ణుండు గన లునఁ గనుఁగవఁ గెంపు గడలుకొన నమ్మద్రపతిం జూఱచుఱం జూచి. 316

క. ననుబోఁటిజోదునుం గా, దని పలుకఁగ నేర్పు నీకు నంత గలదె య ట్లును గాక వినుము కర్ణుం, డినుమా ఱొకశరము దొడుగునే పరులు నగన్.

వ. అని పలికి కలుషం బగుచిత్తంబుతో నెలుం గెత్తి ఫల్గున ఫల్గున పొలిసి తం చు నేసిన. 318

క. పలుదెస మంటలు ప్రబ్బఁగ, నలఘుస్ఫురణమున నిగుడు నయ్యస్త్రంబుఁ జలజాక్షుఁడు గని పంచాంగుళమాత్రము రథము ధరణిఁ గ్రుంగనదుముచున్

క. సురగరుడఖచరవిద్యా,ధరఖేచరు లంబరం బుదాత్తధ్వనిసం భరితముగఁ బొగడి రమ్మురహరు దివ్యప్రసవవిరచితార్చనతోడన్. 320

సర్పముఖశరంబున నర్జునుకిరీటంబు భూమిపైఁ బడుట.

మ. కురువంశోత్తమ వారిదిక్కు ప్రజ సంక్షోభింప నప్పాఁపతూ పు రయం బుగ్రము గాఁగ బిట్టడరి దంభోళిప్రభగ్నక్షమా ధరశృంగాకృతి గా హరించె బహురత్నస్ఫీతరశ్మిచ్ఛటా స్ఫురితం బైనకిరీటముఁ విజయునొప్పం దేజముం గుందఁగన్. 321

తే జనులు విహ్వలు లగుపట్టి ఘనరవంబు, దిశలయందు నాకసమున దీటుకొనఁగఁ గర్ణుఁ డట్లు ఖేదించె దిక్పతులచేత, నైనఁ జెడనికిరీట మయ్యహిశరమున. 322

క. సురపతి దపంబు నేసినఁ, బరమేష్ఠి ప్రియంబుఁ బొంది బహుమానపుర స్సరముగ నిచ్చినయది య, క్కిరీట మరిభీషణత్వకీర్తిదము నృపా. 323

ఆ. వనధివాసు లగునివాతకవచు లను, దనుజు లంపురందరున కజయ్యు లైన నతఁడు పనుప నర్జునుఁ డోర్చిన, మెచ్చి యక్కిరీట మిచ్చె నధిప. 324

చ. వినుము నరేంద్ర చూడ విన విస్మయ మిట్టిది [2]పాఁపరమ్ముపా త నెగయు ఘోరరూపభయదప్రథమానవిషాగ్నిజిహ్వికల్ దనికినఁ బెల్చ మండుచు నిలాస్థలి డొల్లె నినుండు పశ్చిమాం బునిధి నితాంతదృశ్యరుచి పొల్పెసఁగం బడుభంగి దోఁపఁగన్. 325

వ అప్పుడు. 326

ఉ. శృంగము లేనినీలగిరి చెల్లునఁ గ్రీడి కిరీటహీనుఁ డ

---

1 యాపాఁపఱూపశరంబు. 2 పాముఱమ్ము; పాముటమ్ము.

యుస్యం గనుపట్టె వెల్లతల యొల్లియ మౌళి ధ్వజంబు గా నమ
ర్చెం గురునాథ పూర్ణ శశి చెన్నునఁ బూర్వమహీధరంబు కాం
తిం గడచన్న యందము ప్రతీతము గాఁగ నటించు చాడ్పునన్. 327

వ. అట్లు రాధేయకరప్రముక్తం బై కిరీటంబు నిర్దహించి నేలం గలపినయమ్మహో
రగంబు గ్రమ్మఱం గవిసినం గని కమలనాభుండు గవ్వడితో మనమీఁద మగు
డ నిమ్మహాసర్పంబు సనుదెంచు చున్న యది యనిన నతం డిది యెక్కడిపా
మిట్లు వచ్చుటకుఁ గతం బేమి యని యడిగిన దీని నెఱుంగవె ఖాండవం బేర్చు
నప్పుడు దనతల్లిని రక్షించికొని యనలంబునకుఁ దప్పిపోవం బోవ నీక నీ వేసిన
నన్నాగాంగన మృతిం బొందె నప్పగ వాటించికొని కర్ణుకడ నమ్మెయి నున్న
యశ్వసేనాభిధానభుజంగంబు 328

తే. ఆతఁ డేయఁ గిరీటంబు నపహరించి
దానఁ గోపంబు వోవక తాన కడఁగి
నిన్నుఁ బరిమార్పఁ గడఁగెడు నన్న నెఱిఁగి
యాఱుపటుభల్లములఁ దునుమాడె నతఁడు. 329

వ. అత్తెఱంగున. 330

సీ. ఉరగంబుఁ దునిమి వే మరలి కర్ణునిమీఁదఁబడియుఁ బండ్రెండును బటుశరములు
నిగిడించి యుజ్జ్వలం బగుదొడ్డనారసం బేసిన నది రుధిరాసవంబు
పానంబు సేయుచు మే నుచ్చి చనిన దండాహతం బై నమహాహివోలె
నాసూతనందనుఁ డత్యుదగ్రుం డయ్యు నంతకుమును [1]పాఁపరమ్ము చేత
తే. నర్జునుఁడు సొపమికి నెఱఁగంది యాతఁ, డటులు గెరలి పండ్రెండువాలమ్ము లేసి
పద్మనాభుని నొప్పించి పార్థు నొకటి,కొలఁతగా నూఱుశరములనుఱక నొంచె.

క. వెండియు బలువిడి నయ్యా,ఖండలసుతునురము గ్రూరకాండంబుల నొం
డొండ కడు నొవ్వ నేసి య,తం డుబ్బున నార్చె గగనతల మద్రువంగన్. 332

ఆ. ఆర్చి పెలుచ నట్టహాసంబు సేసిన, నలిగి యతఁడు భల్లములఁ దదీయ
భూరికంకటంబు పోలు పఱ నఱకి యు,ల్లసితమకుటకుండలములు డులిచె. 333

వ. డులిచిన నబ్బలుమగండు. 334

క. శిరమునఁ గర్ణంబుల నె,త్తు రొలుక బరిమేనితోడఁ దూలక బాహా
స్ఫురణంబు మెఱయ సాయక,పరంపరలు నరునిమీఁదఁ బఱపెం బెలుచన్. 335

తే. వానిఁ దునుమాడి యాపాండుసూనుఁ డలఘు
శరచతుశ్శతిఁ బొదివి నెత్తురులు మేనఁ
బఱప గైరికనిర్ఝరప్రకరశోభి

1 పాముఱమ్ము, పాముటమ్ము

తాచలము వోలి పొలిచె నయ్యంగరాజు. 336

ఉ. అమ్మెయి నుగ్రుఁడై మఱియు నర్జునుఁ డుజ్జ్వలవత్సదంతకాం
డమ్ములు పెక్కు సత్వరదృఢస్ఫురణం బలరంగ నేసి ర
థ్యమ్ముల సూతుఁ గేతనము నాతనితేరును గూడఁ గప్పె మే
ఘమ్ములు గ్రమ్మి భూధరము గప్పినభంగిఁ దలంపఁ బట్టుగన్. 337

వ. ఇవ్విధంబున విక్రమకుతూహలి యై విజృంభించె నప్పుడు. 338

ఉ. నెత్తుటఁ దోఁగి మేను కమనీయరుచిం గొమరార బాణసం
పత్తి యుదగ్రతన్ మెఱయ భాస్వరుఁ డై యరదంబుమీఁద భూ
పోత్తమ కర్ణుఁ డొప్పె నరుణోజ్జ్వలమండలకాంతిపూరము
న్మొత్తపుదీప్తులుం దగ నినుం డపరాద్రి వెలుంగుచాడ్పునన్. 339

వ. ఇట్లు సూతనందనుండు నొచ్చియుఁ బోలివోనిబంటుతనంబున జాటు మెఱుం
గులు చదలం బరఁగ శరంబు లడరించుచు బహుబాణంబుల రేణువులు గాఁ
జేయు చుండ సవ్యసాచిదివ్యాస్త్రవిలాసంబు భాసమానం బయ్యె న య్యవసరం
బునఁ గాలుం డదృశ్యాకారంబున. 340

బ్రాహ్మణశాపంబునఁ గర్ణురథచక్రంబు భూమిఁ గ్రుంగుట.

క. భూసురశాపంబున నిదె, యీసూతజురథముచక్ర మిలఁ గ్రుంగెడు వీ
తాసుఁ డగు నీతఁ డని సే,నాసముదయయుగ్మకము వినం బలికె నృపా. 341

వ. పరశురాముదత్తం బయినభార్గవాస్త్రం బను పేరిటిమహనీయసాధనం బప్పుడు
రాధేయునకుం బ్రతిభాసింప కుండె డాపటికల్లు [1]గ్రుంగినఁ దేరు ఘూర్ణిల్లె
నట్లు జామదగ్న్యమహీసురులశాపంబు లస్త్రబలంబునకు రథంబునకు వైకల్యం
బాపాదించి చిక్కువఱచుటయును సర్పముఖశరం బాభంగి నిష్ఫలప్రయత్నం
బగుటయును దనమనంబున నొవ్వడరి యక్కర్ణుండు గరంబులు విసర్చుచు.

తే. ధర్మవాదులు ధర్మతత్త్వప్రధాన, చిత్తు లగువారిఁ బూని రక్షించు ధర్మ
మందు రది బొంకుఁ గావించె నతులధర్మ,శీలుఁ డగునన్ను ధర్మువు సెలవు లేద.

క. అని ధర్మంబును దూఱఁగఁ, దను నర్జునుబాణవితతి [2]దద్దయు వడిఁ దాఁ
కినఁ గర్ణుండు విషాదం,బున వెండియుఁ బెద్ద దూఱు భూవరముఖ్యా. 344

క. కన లధిక మైన లావె,క్కి నయయ్యంగపతి నొంచెఁ గృష్ణార్జునులన్
సునిశితశరములు మఱియుం, జొనిపెను దనధైర్యమహిమ సురర [3]లగ్గింపన్.

వ. అలిగి యర్జునుం డాశీవిషంబులుం బోనివిశిఖంబు లాఱు కర్ణుమే నుచ్చి చన
నేసినం గ్రోధభాసితుం డై యతండు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుటయు నప్పా
ర్థుం డైంద్రాస్త్రంబు ప్రయోగించిన. 346

క. అమితబలం బగుబ్రహ్మా,స్త్రముచే నయ్యస్త్ర మపహృతం బగుటయుఁ జి

---

1 డిందిన; డించిన. 2 దాఁకిన నొవ్వ, రినఁ గర్ణుండు. 3 లు నులింపన్.

త్తమున విషాదము దనుకఁగఁ, గమలాక్షుఁడు గారవమున గాండివితోడన్.

వ. నీయస్త్రం బిప్పుడు కర్ణాస్త్రంబుచే విధ్వస్తం బయ్యె నిట్లు గా నేల యన వుడుఁ గవ్వడి బ్రహ్మాస్త్రప్రయోగంబున నమ్మహనీయసాధనంబు బాధితంబు సేసి రాధేయాంగంబు బాణజాలంబులం బొదివి నొప్పించిన నమ్మేటిమగండు గాండీవంబు మౌర్వీకోటిఁ బాసి పో నేసిన నాసవ్యసాచి మగుడ నమర్చి మార్గణంబులు నిగిడించిన రయంబున నాసూతపుత్త్రుచూడ్కి కమ్మార్వి యాడుట దోఁప కుండె నవ్వీరుండు విజయచ్ఛువిశిఖంబులు వారించి యతని నొంచిన వెండియుఁ బుండరీకాక్షుండు సహస్రాక్షునందను నుద్దేశించి. 348

క. నిను నొంచువాఁడె కర్ణుం, డనితరసులభప్రకారమగుభుజవీర్యం
బున నసమానోజ్జ్వలఖే,లనమునఁ దెగటార్పు శరవిలాస[1]నిరూఢా. 349

వ. అనునప్పుడు విషవిస్ఫురద్భుజంగభంగికం బైనబాణంబు రౌద్రమంత్రసహితంబు సేసి కర్ణుండు పార్థుప్రాణంబులు గొన నప్పళించి సంధింప మున్ను కొండొక గ్రుంగినచక్రంబు[2]కుండ మునుంగం దిగఁబడిన నొడ్డగెడ వై యరదం బేటునకు నసు వీక తక్కిన సుక్కటికి యక్కర్ణుం డప్రతీకారంబు లగురోష విషాదంబులఁ గన్ని రొలుక రథంబు డిగ్గి కవ్వడిదెసఁ గనుంగొనుచు ని ట్లనియె. 350

సీ. అరదంబుచక్రంబు ధరఁ జాలఁ గ్రుంగిన నెత్తెద నంతకు నేయ కుండు
మేను భూమిస్థుఁడ వీవు రథస్థుండ వియ్యెడఁ దగ వగు నేయ కునికి
విరిదలవానిని విరథుని నాయుధం బిడినవానిని శూరు లేయ రెందు
మహిని శూరుఁడ వనుమాత్రగా దుత్తమకులుఁడవు రణధర్మకోవిదుండ

ఆ విట్టి నీవు దగినయట్టిభంగిన యని, సేయ వలయు నిట్లు సెప్పి యెల్ల
బాడి యేర్పడంగఁ బలుకుట గాని నో, విందునకును నీకు వెఱచి కాదు. 351

వ. అనిన విని యచ్యుతుం డతని కి ట్లనియె. 352

క. ఏమీ తగవును ధర్మము, నీమనమున నేఁడ పుట్టెనే గర్వము ను
ద్దామదురభిమానము నేలా మఱచితి కర్ణ యాచలం బెట వోయెన్. 353

ఆ. పరమధర్మపరులు పాండుభూవల్లభ, సుతులు వారి నతులశుభము లొందు
ధర్మహీను లైనధార్తరాష్ట్రులకుఁ బాటిల్లు నివ్విధమున నెల్లచేటు. 354

వ. దీనికి నీవు కటకటంబడినం బోవునే యని పలికి వెండియు. 355

సీ. గొంతియు నందఱుగొడుకులు సుప్తులై యుండంగ లక్కయిల్ మండఁ జేసి
కపటంపుజూదంబు ఘటియించి ధర్మాత్ముఁ డగుధర్మసుతుసిరి యపహరించి
యంతఁ బోవక ద్రుపదాత్మజఁ దెచ్చి సభాస్థలి నమ్మెయి భంగపఱిచి
యమ్మహాత్ములఁ జంప నడవికి ఘోషయాత్రావిధినెపమున దాడి వెట్టి

1 నిరూఢిన్. 2 కుండు; గుండు.

తే. బాలు నభిమన్యు నొక్కని బహురథికులఁ
బనిచి చంపించె మీసుయోధనుఁడు దలఁపఁ
గాని యిప్పాపముల కాదికర్త వీవ
యిన్నియెడలను నీపాడి యెందుఁ బోయె. 356

వ. అని యిట్లు కృష్ణుండు గర్ణుతో నాడుమాటలఁ దోడ్తోడం బెరిఁగినయద్ధనంజయు మనంబు రోషానలంబు రోమకూపంబులఁ బటుజ్వాలారూపంబుల వెడలుట యతి విస్మయప్రదంబై యుండె నయ్యుగ్రమూర్తి సముదగ్రపరాక్రమంబునం గురి యుపటుబాణాసారంబు వారించి యవ్వీరునంగంబున నయ్యంగపతి నిశితాస్త్రం బులు నిగిడించుట మహాద్భుతం బయ్యె నత్తెఱంగున నీడంబోక పెనంగునతం డతిరయంబున నన్నరునిం బడిదొడ్డనారసంబుల నొప్పించిన నత్తేజోధనుం డాజ్య ధారాచ్ఛటాసేకంబున నుద్రేకంబు నొందినహుతవహుండునుం బోలె మండి శత్రుసంత్రాసనంబును మిత్రోల్లాసనంబును బ్రగుణమణిజాంబూనదమయంబును జనప్రస్తుతిపాత్రంబును హస్తికక్ష్యాత్మకంబును నగునతనికేతనంబునుగనకపుంఖ ప్రభాభాసితం బైనభల్లంబునఁ బడనేసినం గౌరవులు నిజయశోబలదర్పప్రియం బుల మొత్తంబులు పడుటగాఁ దలంచుచు హాహాకారంబులతో నారాధేయుని దెస నిరాశులై రట్లు ప్రస్ఫీతకేతుపాతనం బాచరించిన దానం గనలి కర్ణుం డతినిశితక్రూరనారాచజాలంబులు గృష్ణార్జునులమీఁదం గురిసి వెగడుపఱచి యరదంబుపెకిందికొమ్ముక్రిందికి మూఁపు సొనిపి లావున నెత్తిన రథచక్రంబు విడుపక భూమి కులపర్వతకాననసముద్రసహితం బాఱంగుళంబు లెగసె నట్లు కర్ణుండు రథంబు నిలిపి మీఁదికిం జని యెప్పటిబాణంబు సంధింప వెండియుఁ జక్రంబు క్రుంగినఁ గ్రమ్మఱ రథంబు డిగ్గి యెత్త నమరె నయ్యవసరంబునఁ గృష్ణుపనుపునం గ్రీడి దోడన. 357

మ. కులిశప్రస్ఫుర[1]ణాపహాసనవిభాగుచ్ఛంబులం గల్గి యాఁ
కలిమై వచ్చుకృతాంతవక్త్ర మన సుగ్రంబై మురారాతిరు
ద్రులచక్రంబును శూలముం దెగడుచుం గ్రూరంపు టొప్పారు నం
జలికం బైనమహాస్త్రముం దొడివి కర్ణం బుబ్బునం జేయుచున్. 358

క. ఏను దపశ్చరణంబున, దానంబున గురుజనాభితర్పణమున ని
త్యానూనవ్రతశీలుఁడ, నేనియుఁ గర్ణుతలఁ ద్రెంచు నీశర మనియెన్. 359

క. అని తెగ నిండఁ దిగిచి యేసిన నయ్యస్త్రంబు రోదసీకుహరంబుం
దనమెఱుఁగుల నించుచు నిరు, మొనలజనుల గాఢమూర్ఛ ముంచుచు నిగిడెన్.

అర్జునప్రయుక్తం బగుఘోరశరంబు గర్ణుశిరంబు ద్రుంచుట.

చ నినదసముద్భటస్ఫురణ నింగి వగుల్పఁగ సర్వభూతకం
పన మగు చమ్మెయిఁ గా నిగిడి పార్థివసత్తమ యేమి సెప్పుదుం

1 ణాపహాసినువిభా.

దునిమె శిరంబు రక్తమునఁ దోఁగుచుఁ గర్ణునియట్ల వజ్రఘో
రనిహతిఁ గూలుగైరికధరాధరముం [1]దలఁకింపఁ బట్టుగన్. 361

క. చరమగిరినుండి పడియెడు, తరణికరణి సూతపుత్రుతల వడఁ గాంతి
స్ఫురణోజ్జ్వలంబు నతిసుం,దరమును నగుకాయ మట్లు ధరణిం బడియెన్. 362

తే. అధిప యంతన గను విచ్చి యఖిలజనులు
గనుఁగొనంగ నయ్యుజ్జ్వలతనువు విడిచి
చని సముద్దీప్త మైనతేజంబు వారి
జాప్తబింబంబు సొచ్చె నత్యద్భుతముగ. 363

వ. అట్టియెడ. 364

క. వినుము మహీసురుశాపము, మనుజేంద్రా సూతపుత్రుమరణాంతం బై
యునికినొ రథచక్రము మే,దినిఁ గ్రుంగుట లేక తొంటితెఱఁగున నుండెన్.

తే. దారుణాస్త్రజాలాంశులవైరిసైన్య, తాప మొనరించి యాసూతతనయతరణి
పార్థుడస్తశైలవైభవము గడవ, నసువు లేమి నవ్విధమున నస్తమించె. 366

క. సూతతనూజుఁడు వడినం, బ్రీతిం బాంచాలు రార్వఁ బెల్లుగఁ దూర్య
వ్రాతంబు సెలఁగ సమ్మో,దాతిశయము వొందెఁ బాండవానీకంబుల్. 367

క. నిడుఁగేలుఁ బలుతొడలు, న్వెడఁదయురము నై రణావనిం గర్ణునొడల్
పడి యున్నఁ గని విషాదం, బడరి తొలఁగుమాడ్కిఁ గ్రుంకె నర్కుం డంతన్.

తే. నిర్గతప్రాణు రాధేయు నిజకరములఁ, గరుణ పెంపున నంటుట కారణముగఁ
బావనస్నాన మొనరింపఁ బోవుపట్లు, లపరజలనిధిలోనికి నరిగె నినుఁడు. 369

వ. అప్పుడు. 370

తే. కామఁ బాసినకమలంబుకరణిఁ బొలుచు
కర్ణుతల యిలఁ బడియు నుదీర్ణకాంతి
నొప్పునట్టులుఁ జూచి శల్యుండు సిడము
ద్రెస్సి మోడైనయరదంబు ద్రిప్పె నధిప. 371

క. బలితపువెస నాబోఁతుం, బులిగొనినం బసులు వాఱుపోలికిఁ గ్రోధో
జ్జ్వలుఁ డగుపార్థుఁడు గర్ణునిఁ, బొలియించిన నీదుసైన్యములు వెఱఁ బఱచెన్.

తే. దీనవృత్తి శల్యుండు నీసేనజనులు, నట్లు పాంచాలు రుబ్బున నార్వ సిగ్గు
వడక పాండవమధ్యముసిడము మరలి, మరలి చూచుచుఁ బాఱిరి మనుజనాథ.

ఉ. గాండివముక్తబాణమునఁ గర్ణుఁడు గూలుటయుం దలంకి శ
ల్యుం డరదంబు దోలుటయు నొక్కమొగిఁ భవదీయసేన లొం
డొండ [2]కలంగి పాఱుటయు నుల్లసితుం డయి చూచి వాయుపు

---

1 దలపించునట్లుగన్. 2 కలంగఁ బాఱుటయు.

త్రుంచు మహావిరావమున రోదసి పిక్కటిలంగ నార్చినన్. 374

క. ఆనినదంబునఁ బాండవ, సైనికహృదయములు సౌఖ్యసంపద నొందెన్
మానవనాథ భవత్సుత, మానసములు శోకఘూర్ణమానము లయ్యెన్. 375

వ. ఇవ్విధంబున నపదంబు దోలికొని యరిగి యమ్మద్రపతి బాష్పాకులలోచనుం డును దీనాననుండును సుదీర్ఘతరనిశ్వాసుండును నై యున్న కౌరవేశ్వరుం జేరం జని యతనితో ని ట్లనియె. 376

చ. నరవర యెందుఁ జూడ మె రణంబులు కిన్కడు నర్జునుండు సం
గర మొనరింతురే యిటులు క్రొర్యనిరూఢికి దిప్ప లొంది ర
చ్చెరు వది యట్టు లుండె విను చెప్పెద నెంతయు భీతిఁ బొంది రా
హరియు నరుండుఁ గర్ణువడి [1]కంత విధాతృఁడు దప్పె వానికిన్. 377

వ. అని వెండియు. 378

మ. ధరణీచక్రము సీర యేలుటకు నుత్సాహంబు వాటించి పో
రిరి ప్రాణంబులు డాఁపమిం బడిరి వీరిం జూడు మంచుం దురం
గరథేభంబులు చట్టుఁ గూలి వికటాకారంబు లై యుండ నొ
ప్పి రణోర్విం బడి యున్న భూపతులఁ జూపెం జూపి యారాజుతోన్. 379

వ. మఱియు నమ్మద్రపతి యింద్రయమవరుణకుబేరులఁ బోల్పందగిన [2]యింతలింతలు మేటిమగలు మనకార్యంబునకై శౌర్యంబును బాహువీర్యంబును మెఱయించి ధైర్యంబు వొగడొందం బెనంగుట విఫలంబగుట విధికృతంబు దీనికి వగవం బని లేదని చెప్పి ధనుఃఖండంబుల నాయుధశకలంబులఁ గేతనాతపత్ర చామరగజ ఘంటాతురంగకింకిణులతునియలం గంకణకేయూరహారమకుటంబులతుమ్ముళ్ల నభిరామభీషణం బగు రణాంగణంబు సూపి నీకయి పెనంగి సమసినసైన్యంబు నాలోకింపు మనునప్పు డసురాంతకపార్థులు పాంచజన్యదేవదత్తంబులు పూరిం చిన నింగి పగుల్చునమ్మహారవంబున గుండియ లవిసి కురుబలంబు లత్యంతవిక లంబు లయి వినిపాతితరావణనందనుఁ డగుసుమిత్రానందనుసింహనాదంబున భయం బంది పఱచుదానవసేనలచందంబున నీకొడు కున్న నెలవు విడిచి వలియం బాఱిన వెలువెలంబాఱు నక్కురుపతితో నాశల్యుండు సంధ్యాసమయం బయ్యె నేఁటికిఁ గయ్యంబు సాలింపుము వేగుటయుఁ జేయవలయుకర్జంబు సూచికొంద మనియె నట్టియెడఁ గృపాశ్వత్థామకృతవర్మశకునిసుశర్మప్రభృతు లగుదొరలు పాండవజయంబునకు దైన్యంబునొందినయాననంబులతో నిశ్వాసంబులు నిగుడ నక్కురుపతిఁ జేరం జనుదెంచిన నతండు మూఁకల మరల్ప రామియు దొరల యుత్సాహవైకల్యంబును శల్యుమాటలతెఱంగు నూహించి మరలి కర్ణుం జేర్కొని విలాపంబు సేయుచు హాకర్ణ హాకర్ణ యనునెలుంగులతో బలంబులఁ

---

1 నంత. 2 యంతలంతలు.

డివియ నియమించినం డివిసి కౌరవులు దోడం జనుదేర నిజశిబిరంబునకుంబోయె నప్పోవ్వుట జూదంబున నోడి పాండునృపకుమారులు పురంబు వెడలి యడవికిం బోవునప్పటిభంగి నైయుండె నయ్యవసరంబున. 380

చ. తనువులఁ గర్ణబాణము లుదాత్తగతిం జెలువొందఁ గౌరవుల్
కనుకనిఁ బాఱ శౌరియును గవ్వడియుర్ వెలుఁగొంది రొక్కెడ
న్వినుతమరీచులై పొడిచి నిర్భరసంతమసంబు నల్లడం
జన నభిరామమూర్తు లగుచంద్రుని సూర్యునిఁ బోల్పఁ బట్టుగన్. 381

వ. ఇట్లొప్పి యమ్మెఱుంగుటమ్ములు వెఱికి వైచి యొండొరులయాననంబు లాలో కించి రాత్రిముఖం బయ్యె విరోధుల వెనుకొనుటకు సమయంబు గాదని సంభా షణంబులు నేసి తమసేనలం డివియ నియమించి. 382

తే. బలునిఁ దెగటార్చి మరలుగోపతియు హరియుఁ
బోలెఁ గర్ణుని సమయించి లీల మెఱయ
మరలి రత్యంతమోదసంభరితు లగుచుఁ
గవ్వడియుఁ గృష్ణుఁడును బంధుగణము లలర. 383

వ. అప్పుడు దివ్యు లన్నరనారాయణుల ననేకప్రకారంబులం బ్రశంసించుచు నిజ నివాసంబులకుం జనిరి పాండవసేనాజనంబులు సంతసంబునం దేలుచు ధనం జయుం జెలంగి పొగడుచుం బోయి రివ్విధంబున జయంబునం బొంపిరివోవు చుఁ బాండవులు విడిదల కరిగి ధర్మనందనునగిరిమొగసాలఁ జొచ్చి రట్టియెడ.

క. చెన్నునఁ బాంచాలురు మును, మున్నా నృపునికడకు నేఁగి ముదితాత్ముం డై
యున్నయతనిఁ గని దీవన,ల న్నతులను సమ్మదానులాపములఁ దగన్. 385

వ. గారవించిరి విప్రవృందము వేగంబ యరదంబు డిగ్గి చని యజ్ఞనపతిచరణంబులకుఁ బ్రణతుం డైన నతం డెత్తి యాలింగనంబును మూర్ధఘ్రాణంబును జేసె భీమ నకులసహదేవు లన్నరదేవోత్తమునకుఁ బ్రణమిల్లి పార్థుం గౌఁగిలించిరి కృష్ణ సాత్యకు లప్పాండవాగ్రజునకు సవినయప్రణామంబు లాచరించిన నమ్మహీపరుం డభినందించె నప్పుడు కృష్ణుం డతని కిట్లనియె. 386

## శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతో సరససల్లాపంబు చేయుట.

క. భువనము లన్నియు నొక్కటఁ, గవిసియుఁ గర్ణుఁ బరిమార్పఁగా నోపునె భూ
ధవ భవదీయక్రోధా,గ్ని విహతుఁ డై క్రాఁగెఁ గాక నిక్కం బరయన్. 387

ఆ. రథికవర్యుఁ డైనరాధేయుపాలిసిన, యపుడ యెల్లఁ బొలిసె నని తలంపు
కౌరవుల కడంగె వైరంబు నీ కింక, నెదురు లేదు శ్రీలఁ బొదలు మధిప. 388

చ. అన విని యమ్మురాంతకున కానృపుఁ డి ట్లను నీవు చక్కఁ జూ
చిన సులభంబు శోభనము శ్రీధర నీదగుకూర్మి కేను భా

తే. కనకబహురత్నమయపీఠమున మృగాక్షు, లాలవట్టంబు లిడఁ జెలు వమరునట్టి
కౌరవేంద్రుండు పెనునేలఁ గంకపక్ష, పవనహతుఁ డయ్యెఁ జూచితె పద్మనాభ.
క. ఈరాజు భీమసేనును, దారోగ్రపరాక్రమమున ధరణి నొఱగి దు
ర్వారమదవారణము కం,తీరవముఁవిహారమునఁ బడినగతిఁ బొలిచెన్. 39
క. విదురుఁడుఁ దండ్రియుఁ దనకుం, బదివేలవిధములఁ జెప్పఁ బాటింపఁడు దు
ర్మదమునఁ దగియెడుబుద్ధులు, విధి మూఁడినమర్త్యుఁ డేల విను సుచితోక్తుల్.
క. పదునొకఁ డక్షౌహిణు లే, [1]పాదవఁగ నలిఁ గొలువ నొప్పు నుర్వీశ్వరుఁడే
తుది నిష్పరివారుం డై, గదఁ జేకొని యొంటి పోరి కలనిం బడియెన్. 41
తే. ధరణిగజఘోటకములొప్పధార్తరాష్ట్రు, లెల్లఁబొలుపారఁగాఁగంటినిప్పుడవి వి
నాశ మొందినఁ బాడఱె నలిననాభ, యది పరాధీనముగఁ జూచునట్టిదయ్యె.42
వ. అని దుర్యోధనవల్లభ [2]నిరీక్షించి మాధవు నుద్దేశించి యి ట్లనియె. 43
ఆ. కొడుకుచావుకంటెఁ గోడలియడలునఁ, బెరిఁగి శోకవహ్ని దరికొనంగ
నంతరంగ మిప్పు డగ్గల మెరియంగఁ, దొడఁగె దీని కేదితుది యుపేంద్ర. 44
సీ. చూడు మిమ్ముద్దియసుతుఁ జూచి వదన మ్మల్లార్చుచుఁ బ్రాణేశునాననంబు
పైఁ జూడ్కి యడరించి పాణితలంబున నందంద నెమ్మొగ మడిచికొనుచు
మరలఁ బుత్రునిదెస కరిగినమనసు పేరడలున మునుఁగంగ నతనిచెన్ను
మోమునఁ దనమోము మోపి మూర్ఛిల్లుచుఁ దెలిసివల్లభునురఃస్థలముగ్రమ్ము
తే. నుడుకుఁగన్నీరఁ దడియంగ నొఱగుచును వి
చేష్ట యై యూర కుండుచుఁ జెలులతోడఁ
దిరిగి పొగులంగ వేనలి విరియ మేన
నవులఁ దిరుగుచు నున్నది యక్కటకట. 45
వ. అని వెండియు. 46
సీ. ఈసుమధ్యమ యిమ్మహీశ్వరుబాహుతలంబున లలితోపలాలనంబు
నొంది రాగిల్లెడునుల్లంబుతో నుండు నింకిట నిమ్ముగ్ధ నెట్లు సూడ
వచ్చుఁ గనుంగొన వశము గా దిది యిట్టికొడుకును మనుమండుఁ బుడమి నిట్లు
పడియుండఁ జూచెడుపాపజాతికి నిప్పు డవియక నిగ్గడి గైనయినుప
తే. గుండియకుఁ జేటు పాటింకఁ బుండరీక,నయన యెన్నఁడు లేమి నిర్ణయముగాదె
యింత కోర్చెడునట్టివారెన్నఁడేని, నుర్వి నెందేనిగలుగుదురొక్కొ యొరులు.
క. జననియు భార్యయు నే మై,న నేమి వేదములు బొంకునకుఁ జోరమి నిజం
బని పుణ్యలోక మగు నని, తనకార్యము సూచె నిట్లు తగునె యితనికిన్. 48
వ. అని యనేకభంగుల విలాపంబు సేసి తక్కటితనయులదెస నాలోకించి విష్ణు
దేవునితో ని ట్లనియె. 49

1 పొదవఁబొదువ దొప్పునట్టియుర్వీ. 2 యగు భానుమతి.

భాస్కరవిలసితవృ. కౌరవనృపతితనూజశతంబుం గంటె పవనసుతుపటుభుజలీలా
ఘోరతఁ దడఁబడ మేదినిమీఁదం గూలె వికటముఖకరచరణత్వం
బేరి కయినఁ గనుఁగొన్న విషాదం బెంతయు మది నొలయఁగఁ బ్రియకాంతల్
చేరి విలపనము దద్దయు నార్తిం జేయఁగ నునికి వనట [1]లిరిఁ బెట్టన్. 49

తే. చందనార్ద్రికుట్టిమములఁ జరణతలము, [2]లొందుటకు నేవగించునయ్యూవిదలిపుడు
నెత్తురుల తేప మెక్కిన నేలఁ బొరలు, చున్న వారేమి సెప్పుదు నుదుకువేర్మి. 50

క. బాలలుఁ దరుణులుఁ బ్రౌఢలుఁ, దూలెడువికలాంగకములతో డెందములన్
వాలినవిరహానలముల, పాలై వందురెద రొక్కభంగిన యకటా. 51

క. బలదర్పధైర్యశౌర్యో, జ్జ్వలు లగుధృతరాష్ట్రసుతుల సతులకు నిట్లా
కులతమయి వనట వెల్లునఁ, దలరవలసె దిక్కు మాలి దైవముచెయిదిన్. 52

క. నిజభూషణాతపత్ర, ధ్వజకంకటఖండవేష్టితము లైనకురు
ప్రజగాత్రశకలములు వా, రిజనాభ కనుంగొనంగ రెట్టించె వగల్. 53

క. జననియుఁ దండ్రియుఁ [3]దొలుబా, మునఁ జేసినపాపకర్మమునఁ గాక సుయో
ధనుఁడు మొద లయిననూర్వుర, ననఘుఁడు ధర్మజుఁడు నామమడఁపఁగఁదగునే.

గాంధారి దుశ్శాసనునికళేబరంబు చూచి విలపించుట.

సీ. అచ్యుత వీఁడె మహాభీలభుజుఁ డగు భీముగదాహతి భూమిఁ గూలి
యాతనిచేత సర్వాంగంబులందును గలుగు క్రొన్నెత్తురు కాంతిఁ ద్రావఁ
బడి మఱి తెగటారి పడియున్న వాఁడు దుశ్శాసనుఁ డీతండు సభకు ద్రుపద
పుత్రి నీడిచి తెచ్చి పొలువతనమ్మునఁ బతులసన్నిధిఁ గురుక్షితివిభునకుఁ

తే. గర్ణునకుఁ జిత్తసంప్రీతి గాఁగఁ దూల, పుచ్చెఁ బెక్కువిధంబుల నొచ్చి యావృ
గాక్షి యప్పుడు మారుతి యంతరంగ, మేర్పఁ దలఁపించుదానన యింత వుట్టె.

క. ఆసభ నమ్మెయి నీదు, శ్శాసనుఁ డప్పాండుపుత్రసతిఁ గ్రూరాత్మం
డై [4]సంక లేక పెద్దయుఁ, గాసిం బెట్టంగ నెఱిఁగి కలఁగినమదితోన్. 56

వ. ఏను దుర్యోధనునితో నిట్లంటి. 57

తరువోజ. [5]హరిచేత రక్షిత యైనపాంచాలి కగునయ్యె యిమ్మెయి నత్యంతనీచ
పరిభవదుఃఖంబుపాల్ సేత మీఁదు పరికింప కున్నఁ గీడ్పాటిల్ల కున్నె
యరికంజకుంజరుఁ డగుభీముఁ బల్కు లనుబరిగొలల నలఁచుట మేలె
వెరవిడి వేవేగ విడువుము గారవింపు మీవంశపవిత్ర నోపుత్ర. 58

క. క్రూరాత్ముఁడు నీచుఁడు గాం, ధారవిభునిఁ దొఱఁగు పాండుతనయులఁ బుణ్యా
ప్రారంభులఁ గూడి మనుము, కౌరవకులమెల్ల బ్రదుకఁగాఁ బొగ డొందన్. 59

క. అని యెన్నిభంగులను జెప్పినఁ దా నప్పలుకు లెల్లఁ బెడచెవులం బె

1 యిగిరించెన్. 2 నొవ్వుటకు. 3 బ్రియలును, మును నేసిన. 4 సంకటపడఁ బెద్ద. 5 అర
యక సభలోన నత్తోయజాక్షి నమ్మెయి దయమాలి యత్యంత.

ట్టె నుదగ్రుఁడు దగుకార్యము, గనునె వశం బగునె దైవగతిఁ దప్పింపన్. 60

తే. నాఁటిమాట లుల్లంబున నాటియుండ, నొవ్వుతోఁ దఱి వేచి నేఁ డివ్విధమునఁ
బఱిచె భీముండునొప్పింపఁబడినత్రాఁచు,పాముపగసాటితెగటార్చుభంగిఁ గృష్ణ.

క. తగుఁ బగ దీర్చుట యిమ్మైఁ, దగ వగునే నెత్తు రెత్తి త్రావుట భీముం
డు గడుఁ ఘోరము సేసెను, మగల కతిక్షుద్రవృత్తమా పొగ డొసఁగున్

తరల. కరములుం జరణంబులున్ [1]విరి గల్గి సాఁగి వికీర్ణ మై
యురము నిర్భరవైకృతంబుగ నుర్విఁ ద్రెళ్లి సుతుండు గే
సరినఖంబుల వ్రవ్వఁబడ్డగజంబుచాడ్పున నుండఁగాఁ
గరుణ మాత్మకు నింత మిక్కిలి గాక యున్నె జనార్దనా. 63

సీ. వీఁడె వికర్ణుండు వాఁడిమెఱుంగు మేఘంబులగములమధ్యంబునందుఁ
దేజరిల్లెడుమాడ్కి రాజిలుచున్నవాఁ డతిసాంద్రహస్తికాయములలోనఁ
గార్ముకజ్యాకిణకఠిన మై యున్నయిబ్బాలునిముంజేయి బాలగృధ్ర
మోపదు కబళించియును జంచుపుటమునఁ జీరంగఁ జూచితే శౌరి యతని

తే. రమణి పొరిఁబొరిఁ గన్నీరు గ్రమ్మ జుట్టు, మెలఁగి కాకుల గ్రద్దలఁ దోలఁగనడుచు
చున్నయది పాసి యవివోవకున్న నిట్లు, సూతు రే తల్లు లెందును సుతుల నకట.

క. మారుతనందనునుగ్రపు, నారాచము లొడల నాటినం జచ్చియు న
వ్వీరకుమారుం డుజ్జ్వల, చారుత్వముఁ బాయ కున్నచందముఁ గంటే 65

క. అనిమొన నెవ్వరికిని మాఱ్కొన రానిఘనుండు దుర్ముఖుఁడు భీమునిచే
వినిపాతితుఁ డై భూరజమున బ్రుంగుడువడ్డవాఁడు మురహర కంటే. 66

తే. నక్కతోఁడెలు వీనియాననముసగము, దిన్న యవి యట్టులయ్యును నున్నయొప్పు
దొరసి సప్తమినాఁటిచందురునిఁ [2]బోలె, చూడు భావించి దీపితశూరవంశ. 67

మత్తకోకిల. శూరసేనుఁడు భీమసేననిషూదితుం డయి చుట్టు నం
భోరుహానన లార్తిమూర్తతఁ బొందిన ట్లతిరూక్షహా
హారవంబులతోడఁ గ్రమ్మర నల్లవాఁడె వికారితా
కారుఁ డై పడియున్నవాఁడు వృకంబుఁ బఱులు జించినన్. 68

సీ. అంగంబు కోమల మంతరంగంబు చాతుర్యనిరూఢంబు శౌర్యఘనుఁడు
వీఁడె గోవింద వివింశతి యీతండు సొబగుండు మెలఁతలు సుట్టు నెపుడు
నప్సరోగణ మమరాధిపుఁ గొలిచెడు చాడ్పునఁ బాయక సమ్మదంబు
చిగురొత్త నుండుదు రగరుకస్తూరికాచందనాద్యనులేపశాలి యిపుడు

తే. గ్రద్దలును గాకులునుజుట్టుఁ గదిసియుండఁ,దఱచు నెత్తుటఁ దోఁగినతనువుఁదాను
నున్నవాఁడు గానాకర్ణనోత్సుకుండు, నక్క లఱచెడుచేరువ నక్కటకట. 69

తే. కనకపుంఖశరావృతగాత్రుఁ డైన

---

1 బరి. 2 బోలి.

దుష్ప్రిహుఁడు చచ్చి యుండియుఁ దోయజాక్షు
వికచనవకర్ణికారసంవేష్టనంబు
గలుగుశైలంబు లెఱఁగునఁ బొలిచెఁ జూడు. 70

గాంధారి యభిమన్యుకళేబరంబు గనుంగొని ప్రలాపించుట.

వ. అని మఱియు ని ట్లనియె. 71

లయవిభాతి. అరయ నిది పెద్ద యని పరులమొనఁ జిత్తమున
సరకుగొన కుగ్ర మగుబరవస మెలర్పం
ద్వరితగతిఁ జొచ్చి కురువరుఁడు దలరం గవిసి
కరితతులుఁ దేరులనికరములుఁ దురంగో
త్కరములును గాల్బలము [1]నెరవులునుఁ గీటడఁగ
శరగురుఁడుఁ గర్ణుఁడును గురుసుతుఁడు మద్రే
శ్వరుఁడుఁ గృపుఁడుం[2]బరవఁ బరఁగి దివిజుల్ వొగడ
ధరఁ బడి ముకుంద మననరతనయుఁ డొప్పెన్. 72

ఆ. పాడి మాలి తన్నుఁ బలువురు పొదివినఁ, బోరి తద్ద డప్పిఁ గూరి నిదుర
పోయెనొక్కొ సుభద్రపుత్త్రుండు మృతుఁడైనఁ, జెలువ మింతయేల కలుగ నేర్చు.

సీ. ఉత్తర యిక్కుమారోత్తమునురమున వ్రాలి మోమునఁ దనవదనకముల
నందంద సేర్చుచున్నది మున్ను గన్నంత మెలఁగంగ నేరక చెలులమాటు
గొను సిగ్గు పెంపున వనట ని ట్లయ్యె నిప్పుడు మాటిమాటికిఁ బొలఁతి ప్రియునిఁ
గనుఁగొని బిగియారఁ గౌఁగిలించుచు శిర మూరుతలంబున నునిచి పాణి

తే. పల్లవంబున నానన మల్లనల్ల, దొడయుచును నిన్నుఁ జూచుచుఁ దోడుతోడఁ
బొడము[3]పెల్లునఁ గన్నీరు దుడిచికొనుచు, నఁడఁత పెనువెల్లిఁ దేలెడునంబుజాక్ష.

వ. వింటె యవ్వనితవిలాపంబు. 75

సీ. భద్రచారిత్ర సుభద్రను నిర్జరప్రతిమాను లగుపాండురాజసుతులఁ
బాసి యెం దరిగితి పార్థునిపట్టి నచ్యుతునియల్లుని సమరోర్విఁ జెనసి
పరిమార్పఁ [4]జాలి రెవ్వరు పెక్కుభంగుల మాటలాడఁగ మఱుమాట లేల
యాడవు నాతోడ నస్త్రగురుండుఁ దత్తనయుండుఁ గృపుఁడు రాధాసుతుండుఁ

తే. బాడిమానసులంద్రునిన్నాలు నొకన్ని,బొదివి రిస్సిరొ పెక్కండ్రుప్రోడలిదియు
మగఁటిమియొక్రించుపనికిట్లు దెగినయప్పు,డుల్లములువారలకునెట్టులుండెనొక్కొ.

క. పాండవులును బాంచాలురు, దండిమగలుఁ వారు సూడఁ దలఁకక నిన్నుఁ
భండనమునఁ బడ వైవఁగ, గండు గలుగు టద్భుతంబు గాదె తలంపన్. 77

క. తనలేనిచోటఁ బలువురు, నినుఁ జుట్టును ముట్టి యొక్కనిం జేరి వధిం
చినవంచనకు ధనంజయు,మన మెమ్మెయి నురియునొక్కొ మన్మథమూర్తీ. 78

1 నరవరులుఁ గీడ్పడఁగ. 2 బఱపఁ. 3 పెల్లగు కన్నీరు. 4 జాల రెవ్వరుఁ బెక్క.

తరల. అరుల నెల్లను గెల్చి మేదిని యంతయుం గొని తేజముం
సిరియుఁ బెంపును గీర్తియుం విలసిల్లఁగా మనుచుండియుం
బురుషసింహులు పాండుభూవగపుత్త్రు లక్కట మోదముం
బొరయ నేర్తురె నిన్నుఁ గోల్పడిపోయి పుష్కరలోచనా. 79

క నీమూర్తియందుఁ బ్రాణము, లేమిఁ దెలిసి యుండఁ జంచలింపక జీవం
బేమికతంబునఁ గలిగియొ, నామేను దొఱంగి పోదు నాథ యెఱుంగన్. 80

సీ. దేవలోకంబున నీవిప్పు డెవ్వతెఁ దీపారుపలుకులఁ దేర్చి కురులు
పుడుకుచుఁ దగ నన్నుపోలె లోలాత్మఁగాఁ జేయుచున్నాఁడవు చెలువు నేర్పు
మెఱయంగ నచ్చరతెఱవలమనములు గలఁచి యాడుదు గాక యలఁతిఁ బోదె
యంగనాగోష్ఠి నున్నపుడు నానడవడి బుద్ధిఁ దలంతె నిన్నొందఁ గాంచి
ఆ. యాఱునెలలు వోయె నంతియ యింతియ, కాని లేదె తొంటిమేనఁ జేసి
నట్టి మేలు మోహనాకార యభిమన్యు, వీర నిర్వికార వినుతసార. 81

వ. అను చున్నది యిట్లు పలవింప విరాటనందనం దదీయజననీప్రముఖబాంధవ
స్త్రీజనంబు లచ్చటు వాయం దిగిచి పొగులుచుం గొనిపోయిరి వారలం గనుం
గొనుము. 82

కవిరాజవిరాజితము. గురునిశరంబులు దాఁకిన మేదినిఁ గూలి విరాటుఁడు పేరిననె
త్తురుల మునింగిన మేనును దానును ధూళి సమీరుఁడు మోముపయిం
బొరిఁబొరిఁ జల్లఁగ నున్కి గనుంగొని పొద్దఁగ నశ్రులు హా యనుచుం
బురపురఁ బొక్కెద లెమ్మెయిఁ జోపినఁ బోవక మూఁగెడుఁ బక్షితతుల్. 83

క. అకటకట యుత్తరుఁడు గొం,డొకకాంభోజుండునుం గడుం బాలుఁడు వా
లికకై దువు లాడిన నేల కొఱగి యొప్పి రభిమన్యులక్ష్మణులక్రియన్. 84

సీ. పాండుపుత్త్రులభుజాబలమున కులుకక యెవ్వీరుప్రాపున నెదురు నడచె
దుర్యోధనుఁడుగొంతితొలుచూలి కెవ్వఁడు హృదయశల్యంబయినిదుర సెఱుచు
నట్టికర్ణుండు మదాంధసింధురము బలోద్ధతద్విరదమహోగ్రవిక్ర
మమునఁ గీటడఁగినమాడ్కి నర్జునుబలుగడిమిచేఁ దెగటార్పఁబడియె వీని
ఆ. బాహువిలసనమునఁ బడిన మహాయోధ, వరు లనేకు లితఁ డవార్యరోష
దూషితుండు పరుషభాషణశీలుండు, ధైర్యధనుఁడు దాన శౌర్యశాలి. 85

వ. విను మవ్వీరోత్తముండు 86

క. పిఱుఁదం గురుధరణీపతి, నఱచేతం బ్రాణములు ఘనారాతిబలం
బుఱని తెగువ ముందటఁ బెన్గొఱలుట చిత్తమునఁ బెట్టికొని విహరించెన్. 87

తే. ఇతనిచుట్టును గలకలమెసఁగ రోద,నంబు సేయుపత్నీనివహంబులోనఁ
గంటె వృషసేనుతల్లి యగ్గలపుటడలు, మూర్తి యైనతెఱంగున నార్తిఁ దూలె.

వ. ఈరమణీరత్నంబు ధరణీతలంబునం బొరలుచు. 89

తే. పరశురామునిశాపంబు బాణశక్తి, గ్రాఁప బ్రాహ్మణశాపంబు రథము సిక్క-
వలుప గాండీవధరుచేతిమెఱుఁగుటమ్ము, మన్నిగొనియెనె యోకర్ణ మగలరాజ.
వ. అని మఱియుం బలు దెఱంగులం బలవించి యుత్థిత యై యాలోకించి. 91
తే. కాకులును గ్రద్దలును దిన్నఁ [1]గడును డ్రెస్సి
యపరపక్షచతుర్దశి యమృతకరుని
కరణి నొప్పెడుకర్ణుమొగంబుమీఁద
వనిత యందంద మోపెడుఁ దనమొగంబు. 92
ఉత్సాహవృత్తము. వాఁడిమగఁడు నిద్రపోవు వాలుమృగముఁ బోలె నై
వీఁడె బాహ్లికుండు వృష్ణివీర చూడు చచ్చియుం
బోఁడి దొఱఁగ కున్నయట్టిపొల్పునర్థి వెలింగె వె
న్నీఁ డితండు [2]బలము లెన్నియేనిఁ బెల్లు ద్రోచినన్. 93
తే. మేనఁ బ్రాణము వాసినమీఁద మొగము
బొఱసి యుండునె యెందు నిత్తెఱఁగుకాంతి
తోడఁ బున్నమనాఁటిచందురునిచంద
మమరెఁ జూడు మిక్కుటవృద్ధునాననంబు. 94

గాంధారి సైంధవునికళేబరము చూచి వాపోవుట.

సీ. పల్కు-తప్పమి నెఱపంగఁ దలంచి యుత్సాహంబు వాటించి సవ్యసాచి
దుర్యోధనుండును దొరలు ననేకసైన్యంబులు నంతంత నడ్డపడఁగఁ
దెరలిచి వడి మెడద్రెవ్వ నేసినఁ బడి యున్నాఁడు సైంధవుఁ డుఱక ద్రుపద
తనయఁగాననమునఁ గొనిచన్న నాఁడ తాఁ దెగినాఁడు గాఁడె కౌంతేయు లపుడు.
తే. దయ దలిర్పంగ దుస్సలఁ దలఁచి యలుక, గ్రాఁచి మందల విడిచిరిగాక దైవ
కృతము దప్పింప రాకున్కి-కతన నిపుడు, వారు విడిచి రిమ్ముద్దియ వలనికరుణ.
తే. హృదయమున వగ లేనియట్టిట్టు నట్టుఁ, దిరుగుచున్నది దుస్సల వరునిశిరముఁ
గాన కీకూఁతు నిమ్మెయిఁ గనుటకంటెఁ, దలఁప నెక్కు-డుదుఃఖంబుగలదె కృష్ణ.
వ. నాఁటిరాత్రి యరులు చేసికొనినప్రతిజ్ఞ వేగులవారిచేత దుస్సల విని సైంధ
వునికి బుద్ధి చెప్పినతెఱంగు లవి వినుము. 97
సీ. విజయుప్రతిజ్ఞకుఁ ద్రిజగంబులోపల నడ్డంబు లేదు సు మ్మధికుఁ డంటిఁ
గురురాజుసైన్యంబబిరుదునమ్మకుమంటి గురుఁడు పార్థునకు మార్కొ-నఁడయంటి
నరు డాయ నొకనికైనను బుద్ధిగొన దంటి సమరంబు నీకు నసాధ్య మంటి
ధర్మపుత్త్రుఁడు నిన్ను దయఁగాచుఁ బొ మ్మంటి నామాట వినఁగదె నాథ యంటి
ఆ. రాజతిలక రాజరాజకంఠీరవ, రాజరత్న డివసరాజతేజ
రాజరాజ యనుచు రాజన్య సైంధవ, రాజుఁ బనువుచుండె నాటిలోన. 98
తే. తోడఁబుట్టువు విధవ యై తొలఁగి యునికి

1 గడమద్రెస్సి. 2 రిపుబలంబు లెన్నియేనిఁ ద్రోచినన్.

కోర్చి చలమునఁ బతిఁ దెగటార్చి సంత
సించితిరె తండ్రులార మీ రంచుఁ బాండు
పుత్త్రకుల దూఱుచున్నది పొలఁతి వింటె. 99

ఉత్సాహవృత్తము. తనయుఁ గాచుపనికిఁ బూని ధర్మపుత్త్రవాయునం
దనులుఁ గవలుఁ జేయఁ గలుగు దండిమగలు సేనలం
గొని వడిం గడంగ సరకు గొనక నిల్చి యొక్కఁడుం
బెనఁగి యాఁగె సైంధవుండు బిరుదు దక్షుఁడుం గదే. 100

తే. తప్పు సైంధవుపైఁ బెట్టఁ దగునొ తగదొ
పార్థుప్రతినకు నొక్కండ పాత్త్ర మయ్యెఁ
దాన యందఱ నాఁగుట తప్పు గాదె
యదియ సౌభద్రుమృతిహేతు వగుట లేదె. 101

తే. బోరగిలఁ బడ్డవాఁడు గపోల మొకటి
పుడమి మోచినయది మోము పొలుపు సెడదు
వీఁడె చూచితె శల్యుండు వెడలి యున్న
జిహ్వ దినియెడు వాయసశ్రేణి కృష్ణ. 102

క. ఇట్టవునె మాద్రితోడం, [1]బుట్టె ననక యితని ధర్మపుత్త్రునకుఁ గడుం
బెట్టిదుఁ డై చంపవలసెఁ, జుట్టపుఁదన మేల రాజసుతులకుఁ గలుగున్. 103

క. సెల్లుఁడు యమతనయునితో, నెల్లగుణంబులను జాల నెనయుదు నని తా
నుల్లమున నిశ్చయించుం, జెల్లం బో పోఁ బగఱ చే నిట్లయ్యెన్. 104

వ. అమ్మహీవిభుండు. 105

భుజంగప్రయాతము. కురుక్షోణినాథుండు గోరంగ మైత్రిన్
ధురం దాల్చి తా నేర్పుతో సారథిత్వం
బరిశ్రేణిసంత్రాసి యై పూని కర్ణుం
బరిక్షోభితుం జేసె భాషాస్త్రపఙ్క్తిన్. 106

ఆ. అధిక పంక పతిత మై యున్న యాఁబోతుఁ, బొడివి యున్న మొదవుక దుపువోలె
నున్న వారు సూడు మువిదలు దైన్యమా,స్యముల నెలవుకొనఁగ శల్యు బలసి.

మత్తకోకిల. చూచితే భగదత్తు నీతఁడు శూరతామహిమన్ నరున్
వీచిసన్నిభబాణపఙ్క్తుల [2]వెట్టఁ జేసె మహేంద్రుతో
నేచి పోరుబలుండువోలె సహింప కీతని నిట్లు గాఁ
జూచి తాతనిమీఁదినెయ్యముసొంపునన్ మురమర్దనా. 108

క. పులుఁగులును మెకంబులునుం, దొలిచి తినిన [3]నెలవు దప్పి తొలఁగియుఁ గంఠే
తల నున్నకనకదామము, పొలుపు దెగంబాయ దీనృపుం గమలాక్షా. 109

1 బుట్టుననక. 2 వేఁడిఁ జేసి. 3 జెలువు సెలవు దొంకియుఁ.

### గాంధారి శరతల్పగతుం డగుభీష్ము నుద్దేశించి శోకించుట.

సీ. బలశౌర్యములఁ దనపాటిగా నెందును మానవు నొరుఁ జూప లేనియట్టి
శంతనుపుత్త్రుఁడే శత్త్రులబాహుదర్పంబున రణభూమిఁ బడియెఁ దన్ను
వాలాయమును గెల్వ వచ్చునే చంపికొం డని పాండుసుతులపై నగ్గలంపుఁ
గరుణ మర్మము సెప్పఁగాక యెమ్మెయి నైన నతినిష్ఠ యెప్పుడు నతనియందుఁ
ఆ. గలదు గాదె తండ్రి కార్యంబునకుఁ గాఁగ, రాజ్య ముడిగి పూనె బ్రహ్మచర్య
మితనిఁ జెప్పి చెప్పనితరుండు పౌరుష, కలితసంభవుండు గలఁడె కృష్ణ. 110
క. కురువంశ మెడల వచ్చినఁ, బరమోపాయమున మగుడఁ బడసెఁ వడిసెం
గురునికరముతోడన యి,ప్పురుషుఁడు పురుషార్థసారభూషణుఁడు గదే. 111
క. దేవుఁడు గా కితఁడు నరుఁడు, నా వచ్చునె నిష్ఠ పెంపునం బ్రాణంబుల్
తా వలసినపుడ విడువం, గా వేడుక నునిచినాఁడు గాదె తనువునన్. 112
ఆ. తీవ్రబాణజాల దీప్తులు పరఁగించి, పాండుతనయసైన్యబహుళతమము
లీలఁ బదిదినములు నోలి వినోదించి, యకట భీష్మభానుఁ డస్తమించె. 113
క. శరవణమునందుఁ బొలుపుం, బొరసినగాంగేయుతోడఁ బోల్పఁగ నను వై 114
శరతల్పంబునఁ దేజోఁ, భరితుఁడు గాంగేయుఁ డొప్పెఁ బంకజనాభా.
తే. అర్జునుఁడు వెట్టె నీతని కంపపాన్పు, నకుఁ దగంగ నిశాతబాణముల మూఁట
నలవరించినతలగడ యస్త్రజనిత, వారిఁ దృప్తునిఁ జేసె నవ్వీరవరుఁడు 115
క. వీరశయనమున గంగకు, మారుఁడు కల్పక్షయమున మార్తాండుఁడు సం
చార మెడలి ధరఁ బడి యొ, ప్పారెడుచందమున వెలిఁగె నంబురుహాక్షా. 116
క. దేవవ్రతుండు గీర్వా, ణావాసంబునకుఁ జనినయట కురునికరం
బెవ్వాని నడిగి తెలియు నొ, కో విశ్రుతధర్మసంప్రయోగవిధంబుల్. 117
సీ. పగవారిమొన లను[1]పల్లెరులం గాల్చి మడిసెఁ గుంభజుఁ డనియెడుదవాగ్ని
యెన్నియస్త్రము లింద్రుఁ డెఱుఁగు నన్నింటను బరిణతుం డితండు భార్గవునకు
నెట్లట్లు సువిధేయ మిమ్మహాత్మునకు ధనుర్వేద మితనికి సర్వవేద
ములుఁ బరిచితము లియ్యలఘుతేజునిశిష్యుఁ గాదె పార్థుఁడు గార్ముకమున మేటి
ఆ. యగ్యోఁ దక్కఁ గౌరవాన్వయజాతులు, సాత్యకియును నివ్విశాలబుద్ధి
నాశ్రయించుటను మహాస్త్రవిత్తము, లైరి, యోధు లింతవార లుర్విఁ గలరె.
క. వివిధమహాస్త్రంబులు గా, లవశతఁ జెడెఁ గాక శౌర్యలంపటు నియ్యో
ధవరునిఁ బగవారికిఁ జే,ర వశం బగు నెట్లు సంగరంబునఁ గృష్ణా. 119
తే. గురుని మున్నిడుకొని కాదె కురుకుమారు, లనికిఁ బిలిచిరి ధర్మపుత్త్రాదు లయిన
వాలుమగల నట్లంతటివాఁడుఁ బగఱు, నఱకివైచినఁ బడియున్న తెఱఁగు గంటె.
తోటకము. సతతంబును శిష్యులు సద్వినయా

---

1 బలాత్కనమునఁ గాల్చి.

న్వితులై ప్రణమిల్లెడు వీరిపద
ద్వితయంబు గడుం జెడఁ దిన్నవి సూ
చితె నక్కలు దైవముచెయ్దిఁ గటా. 121

ఆ. ద్రుపదతనయుఁ డట్టె ద్రోణునితలఁ గోయు, వాఁడు విధికి నెట్టివారి నెట్టి
తెఱఁగు నేయ రాదు దీనికి నే మను,వార మిది యసంభవంబు గాదె. 122

సీ. కృపునితోఁబుట్టువు కృపి తనభర్తద్రోణాచార్యుపాల దైన్యంబు [1]విపుల
వేణియు మొగమునవెంట ముసుంగు వడంగ రాల్పడినయెలుంగుతోడఁ
బలవించి పలవించి బహుశిష్యు లయ్యతిరథవర్యు నస్త్రశస్త్రములు రథము
నవయవంబులును జితాకలనంబు సేయుచు సామగానసంయుక్తవదను

ఆ. లగుట సూచి సామ మతికరుణంబుగాఁ, దాను బాడఁ జొచ్చె మానితాగ్ని
పొద నమర్చి యవ్విశుద్ధాత్ము నొండొక, యగ్ని వోలెఁ బెట్టి రందుఁ గృష్ణ.123

క. కృపి మున్నుగ శిష్యులు పొద, యపసవ్యముగాఁగఁ దిరిగి యరిగిరి శోకా
ర్తపుటాడఖులతో గంగకు, నపగతశరవిద్య యయ్యె నవని కటకటా. 124

ఆ. సోమదత్తసుతునిఁ జూడుము సాత్యకి, దూష్యభంగి శిరముఁ దునుమ నొఱగి
యున్నవాఁడు గ్రద్ద లొలిచి తినంగ నీ, సుకృతపరుని నిట్లు సూడ వలసె.125

వ. సోమదత్తుండు పుత్రశోకాయత్తచిత్తుం డై యుండి తన్ను సాత్యకి గవిసినప్పుడు
తనకొడుకునెడ నతండు సేసినయధర్మం బుగ్గడించి గర్హించినవిధంబు మృతుం
డైనను మొగంబునం దోఁచుచున్నది భూరిశ్రవుతల్లి యది [2]యతనిని వల్లభుని
బోరింబోరిం గనుంగొనుచు గద్గదకంఠంబుతో నాసోమదత్తు నుద్దేశించి. 126

సీ. ఓరాజ కల్పవృక్షోపమానం బగుకౌరవజాతిసంక్షయము చూడ
కున్నాఁడ వధికదానోజ్జ్వలు బహుమహాధ్వరకర్త భూరిశ్రవసుఁడు నీదు
గారాబుపట్టి సంక్రందననందను దుర్విక్రమంబునఁ దునుమఁబడిన
బాహువు సాత్యకి పాపకర్మంబున సంఛిన్న మైనను స్తకము నై మ

ఆ. హీంతలమునఁ బడియె నిష్పుణ్యసంతతి, దిక్కు సూడ వేల యొక్కమాటు
కొడుకుచుట్టు నేర్పుకొడండ్ర యలమట, యరయ విట్లు దగునె యధిప నీకు.

క. పీ రేవు రొంటి చీరలఁ, దారును విరిదలలతోడఁ దద్దయు నడలుం
గూరి పల్లవించెదరు నిను, సారసికలభీతిరుతులచందము దోఁపన్. 128

ఆ. ఆలమునకు వెడలునప్పు డిచ్చితి నీదు, పసిఁడిగొడుగు సుతుఁడు లసితవిభవుఁ
డగుట కది నివృత్త మై పడి యున్నది, యక్కుమారురథమునందుఁ జూడు.

క. అని పనువుచున్నయది య,వ్వనితను గోడండ్రఁ జూడ వశమే ఘనుఁ డ
ర్జునుఁ డిట్టినీచకర్మం,బున కెట్టులు సొచ్చెనో కుపురుషుఁడపోలెన్. 130

కవిరాజవిరాజితము. విను మది సాత్యకి చచ్చుట కోర్వక వీరవరుండగుపార్థుఁడు నే

1 గదుర, వేణియు. 2 యతని వల్లభలం.

సినతగ వైనను నయ్యో నతం డటు చే నటుకఁ ముని యైనమహా
త్ముని గని యుబ్బుచు సాత్యకి యే మని త్రుంచె శిరంబు కడంగి జగం
బున నొరు లింత నికృష్టపుఁగర్మముపొంతను బోదురె చక్రధరా. 131

క. ఇక్కురువరునాంధ్రురలో, నొక్కత యతిరమ్యమూర్తి యుత్సంగమునం
దక్కర మిడికొని పనివెదు, నెక్కుడువగ నూనె యదె మహీధర కంటే. 132

సీ. మెలుపారఁగాఁ బట్టి మొలనూలిమణులు గదల్చుచుఁ దిగుచుచుఁ దగులొనర్చుఁ
జనుఁగవమీఁది కల్లన వచ్చి లలితవిమర్దనంబున లజ్జ మరలఁ ద్రోచు
నాభి యూరులు జఘనము మెత్తమెత్తనయొత్తి ముదంబున నుల్ల [1]మూన్చు
ననయంబుఁ దిన్ననియనువున గనయంబు ప్రిదులంగ మెలఁగి సొక్కొదవఁ జేయు

ఆ. నిక్కరంబు నెయ్య మెక్కింప నేరంగఁ, దగిలి [2]సంతతంబుఁ దలఁచునట్టి
భంగి మెఱయ గీడువటుపంగఁ గొనియాడ, వలఁతి నీటు సేయవలసె దీని.133

ఆ. ఒరునితోడఁ బోర హరి సూడ సి గ్గఱి, యేసె విజయుఁ డతనిచేయేటు సభల
నమ్ముకుందుఁ [3]డెట్టు లగ్గించు నట్టివి,వ్వచ్చుఁ దేమిభంగి మెచ్చుఁ దన్ను. 134

వ. అని యిట్లు విలాపంబు జేసి యూర కున్న దిన్నాతిం దక్కటియెలనాగ లేలిన
దానిఁ బోలెఁ బొదివికొని యున్న వా రాలోకింపుము. 135

గాంధారి శకునికళేబరంబు గాంచి యతనిచేఁత లుగ్గడించి శోకించుట.

సీ. మేనల్లుఁ డగునకులానుజునేటులఁ బడియుండి శకునులపాలు వడ్డ
శకునిఁ జూచితె మురసంహార యితఁడు మాయాజాలములకు నాఁ డోజ సకల
మాయలు నీచేత మడిసె దుర్ద్యూతంబు నొనరించి రాజ్యంబు గొనియె ధర్మ
తనయునిచే నిప్డు దనచెద్దుి ఫలియించె నని యనుజూదంబునందుఁ బ్రాణ

ఆ. మోటుపడియె నెత్తమాటకు నీతండు, గఱచు టెల్ల గురునికాయనాశ
మునకు నయ్యె నీనృపుఁడ కాఁడె పాండునం,దనులతోడివైరమునకుఁ గర్త.

క. హిత మొనరించెద నంచుఁ, ధృతరాష్ట్రతనూభవునకుఁ దెక్కలికాఁ డై
మృతియొనరించెం దానును, మృతుఁ డయ్యెను భ్రాతృపుత్రమిత్రయుతముగన్.

మత్తకోకిల. వార లస్త్రహతాంగు లై యనవద్యలోకము గాంచి రీ
వైర కర్తయు నట్లు గాంచెను వారి నల్పవిచారులం
బోరి కెత్తెడునట్లుగాఁ దగఁ బొంది వెట్టులఁ జేసె నీ
క్రూరుఁ డందును నన్నదమ్ములకుఁ విరోధము సేయఁడే. 138

క. రుచిరాంగదు నస్త్రనిచయ, నిచితాంగకునిం గళింగనృపుఁ గంటి సమి
ద్విచరణవిహారణమున నితఁ, డచలితధృతి యగుటయెఱుఁగ నయ్యెడుఁ గృష్ణా.

ఆ. ఇతని చుట్టునున్న యెలనాగ లడలునఁ, గూరి వందియును ముకుంద యొప్పు

1 మాన్చు. 2 సంతసంబు. 3 దట్టు లగ్గి ంచునట్టె విన్వ.

వాయ కున్నవారు బలితంపువడఁ బడ్డ,పుష్పదామకములపోలుపు దోఁప. 140

ఉత్సాహవృత్తము. మానినీజనంబు సేరి మగధనాథుఁ డగుజయ
త్సేనుచుట్టు నేడ్వ నధికదీననాదములకు నా
మానసంబు సాంద్రకరుణమయతఁ బొందె మోహనం
బైనయిట్టియేడ్పు లెందు నంబుజాక్ష వింటిమే. 141

సీ. కోసలనాథుండు భాసురమూర్తి బృహద్బలుచుట్టుఁ బ్రియాంగనాజ
నంబులు సేరి కంపంబుతోడఁ జెమర్చు కరముల నభిమన్యుకరవిముక్త
శరములఁ బెఱుకుచు బోరిమూర్ఛఁ బొరయుచు నప్పటికప్పటి కతనిముఖముఁ
దేఱి చూచుచు విధిఁ దిట్టుచు శోకాగ్ని నుల్లంబు లెరియంగ నున్నవారు
ఆ. తునిమి వైవ నెండఁ దనికినఁ బెద్దయు, వంది చూడ్కి దిగువ వలను కలిమి
దొఱఁగ కున్నయట్టితోయజంబులచంద, మయ్యెఁ జూడ వీరియాననములు. 142

వ. ద్రోణబాణపరిపీడితప్రాణు లై పడియున్నవారు ధృష్టద్యుమ్ననందనులు. 143

మత్తకోకిల. అంగదంబులుఁ గంకణంబులు హారవల్లులు నాదిగా
నంగకంబులభూషణంబులు హారికాంతి వెలుంగఁగా
సంగరాంగణభూమికిం దమచారుభావ మలంక్రియా
సంగతిం గలిగింప నొప్పిరి శౌరి చూచితె వీరలన్. 144

నర్కుటము. త్వరితరథాశ్వమారుత[1]గతస్ఫురితాకృతి యై
శరబహుళార్చిరుద్గమవిశాలతఁ బొల్చుధను
ర్గురుఁ డనుచిచ్చుపై శలభకోటిగతిం బడి భ్రం
దిరిఁ గనుఁగొంటె యేపుర నుదీర్ణులఁ గేకయులన్. 145

క. పంచాననంబుచేతం, బంచత్వముఁ బొంది యున్న బంధురకరిఁ బో
లించుటకుం దగి యొప్పెం, బాంచాలుఁడు ద్రోణుకడిమిఁ బడి కంసారీ. 146

క. ద్రుపదనృపాలునిధవళా,తపత్ర మస్త్రంబు లెచోటు దాఁకక జిగి యా
రిపోలిచె శారదచంద్రుం, డుపమాపాత్రంబు గాఁగ నుర్వి యనుడివిన్. 147

తే. వల్లభులును గోడండ్రు నీవసుమతీశ్వ,రునకు నగ్నిసంస్కారంబు నొనరఁ జేసి
యుమ్మలికమునఁ దద్దయు వెమ్మునంత,రంగములతోడ నరిగిరి గంగదెసకు. 148

క. ద్రోణుఁడు దలరం దలపడి, బాణకళావేది చేదిపతి యుజ్జ్వలత
ద్బాణహతిం గూలి సమర, క్షోణిపరిష్కార మగుచు శోభిల్లెఁ గడున్. 149

తే. తలయుఁ గాళులుఁ దమయూరుతలములందు
బెట్టికొని వీనిభార్యలు బెట్టిదంపు
టడలుతాఁకునఁ [2]గడు బెగ డారఁ గూరు
నుల్లములతోడఁ బలవించు చున్నవారు. 150

---

1 జవస్ఫురి. 2 బలు బెగ డార; గడు వగ వార.

క. మానవనాథు లనేకులు, వీనిభుజావిక్రమంబు వేఁడిఁ బడిరి నీ
మేనమఱంది శిశుపాలుని, సూనుం డీధృష్టకేతుఁ జూచితె కృష్ణా. 151

ఉత్సాహవృత్తము. అతనినందనుఁడు సుకేతుఁ డల్లవాఁడె ద్రోణపా
లితుఁడు వీనిఁ జూడఁగా మదిఁ సుయోధనుండుఁ ద
త్సుతుఁడు దోఁచు చున్నవారు శోకవహ్నితాప మూ
ర్ఛితము గాఁగ బంధుజనులచిత్త మెంత గుందునో. 152

తే. అల్లవారె యవంతీశు లధికబాహు, బలులు విందానువిందులు బహుళభూష
ణోజ్జ్వలులు పడియున్నవా రుగ్రవాయు, పతితకుసుమితనవసాలభంగి దోఁప.

వ. అని చూపి యి ట్లనియె. 154

సీ. శాంతనవుండు నాచార్యుండుఁ గర్ణుండు భూరిశ్రవుఁడు గురుపుత్రకుండుఁ
గృపుఁడు సైంధవుఁడును గృతవర్మయును గురురాజు నమానుషరథికవరులుఁ
గలయంగ నెన్నెడుకొలఁదులవారె వా రలిగినఁ జెడుదు రయ్యమరు లైన
నట్టివీరులబారి కగపడి యుండియు నేమియుఁ గా రైతి రీవుఁ బాండు
తే. తనయు లందఱు నీకూర్మి తమ్ముఁడును మ
హాద్భుత మ్మిది దలఁప భీష్మాదు లైన
వారి నటు పోర నిర్జింప వచ్చు నెట్టి
పనియు భరమె దైవమునకుఁ బద్మనాభ. 155

వ. దైవంబు దుర్యోధనాదు లగునూర్వురకు నొక్కట త్తున నిట్లగు నే యనియెండియు.

తరువోజ. కురురాజు మొదలైనకొడుకులనెల్లఁ గోల్పోవు టిప్పుడు గోవింద కలిగె
నరిగితి సంధి సేయఁగ రాక [1]యున్న నట యప్డు నీ చెప్పు లైనది కాదె
పరమహితంబుగఁ బలికిరి గంగపట్టియు విదురుండు పాటించి పెక్కు
వెరవుల నొత్తిన విన నైతి నావివేకుల [2]చూపేల వృథ వోవ నేర్చు. 157

వ. అని పలికి పశ్చాత్తాపదుఃఖంబు పెల్లున నొల్లంబోయి తెలిసి చిత్తస్థాయి యైన
పుత్రశోకం బడరి యలంతి గానియలఁతఁ బెట్టనూర కుండి యక్కౌరవరాజ
పత్ని పద్మనాభుదెసఁ గనుంగొని కోపోద్దీపిత యై. 158

సీ. ధృతరాష్ట్రపాండుభూపతులకుమారులు తమలోన నీసున సమరమునకుఁ
దొడఁగిన నీ వడ్డపడ వైతి తగుచాలు మానిసుల్ గలిగియు మాననీయ
వాక్యుండ వయ్యును శక్యసమస్తకార్యుం డనఁ బేర్కొనియును నుపేక్ష
చేసితి కురురాజుఁ జెఱుపన తిరిగితి నిఖలరాజులఁ దదనీకములను
ఆ. నామ మడఁచి తెల్లభూములఁ బాడయ్యె, నంతవట్టు ఫలము ననుభవింపు
మే పడంగ నిన్ను శాపానలజ్వాల, దగ్ధమూర్తిఁ జేయుదాన వినుము. 159

---

1 మగుడ న ట్లొప్పు కీవప్పు డనినట్లకాదె. 2 మాటేల.

### గాంధారి శ్రీకృష్ణునకు శాపం బిచ్చుట.

సీ. పూని పాతివ్రత్యపుణ్యఫలంబున సంపాదితం బైనసార[1]తపము
బలిమి సాధనముగాఁ బలికెద నుత్తమజ్ఞాతులఁ దమలోన సంగరమునఁ
బొలియఁ జేసితి గాన పొలియుదు రన్యోన్యఘాతుకులై భవజ్జ్ఞాతిజనులు
నీవును దప్పక నేఁ డాదిగా ముప్ప[2]దా ఱగునేఁ డైన యద్దినమున
తే. నరయ దిక్కెవ్వరును లేనియగ్గలంపుఁ, గుత్సితంపుఁదెఱంగునఁ గూలువాఁడ
విట్లు మావధూజనములు నేడ్చువారు, పతుల సుతులను బంధులఁ బనివి పనివి.
క. అని ఘోరంబుగఁ బలికిన, విని విపులమనస్కుఁ డైనవిష్ణుఁడు చిఱున
వ్వున నానన మొప్పఁగ న,వ్వనితకు ని ట్లనియె గౌరవ స్తుత్యముగన్. 161
తే. మున్న కాదె యాదవులకు మునివరేణ్య, కలితదారుణశాపంబు గలదు నీకు
నేల చర్వితచర్వణ మిట్లు సేయ, దీన నీ వేమి త్రవ్వితి దానిఁ జెపుమ. 162
క. యదువంశజాతులకుఁ ద,ప్పదు నాశము వారి సురలుఁ బరిమార్పఁగ లే
రది కారణంబు గాఁగఁ దె,గుదు రొండొరుచేత రణము ఘోరత్వమునన్. 163
తే. అనినపలుకులు విని పాండుతనయులెదలు, వెఱపు పెంపునఁ గంపింప విహ్వలించి
యాత్మజీవితములదెస నాస లపుడు, వదల విడిచిరి కౌరవవంశవర్య. 164
వ. ఇట్లు పలికినయచ్యుతుం డద్దేవి నుద్దేశించి లేవమ్మా మృతు లైనసకలబంధు
మిత్రులకు నగ్నికార్యంబులు సేయింప వలయు నని వెండియు. 165
సీ. వినుము గాంధారి నీతనయుండు చేయుదుర్నయము లెఱుంగవె నాకు నీకు
శాంతనవునకు నాచార్యునకును బాహ్లీకునకుఁ దండ్రికి మాన్పఁ గొలఁదిగాని
[3]దుర్మానమున నట్లు దొడరి యి ట్లయ్యె మీయపరాధమున వచ్చినట్టికీడు
నకు నింతనొవ్వంగ ననుబల్కఁదగునె యుష్మలికంబు ధృతిఁబట్టి మాన్పుమింకఁ
తే. జేటునకుఁ జావునకు వగఁ జెందుజనుల
కినుమడింపదె మానసమున నలంత
రాచకూఁతుండ్రు సుతుల సంగ్రామనిరత
హృదయు లగువారిఁ గాంచఁ గోరుదుర కాదె. 166
వ. అని చెవి సూఁడినట్లు పలికిన విని నిరుత్తరయై గాంధారి యూరకుండె నట్టియెడ
ధృతరాష్ట్రుండు ధర్మనందనుతో నీవు మనమొనలం గలజనులఁ గొలంది యెఱుం
గుదు చచ్చినవారిలెక్క దలంతేని నా కెఱింగింపు మని పల్కిన విను మెఱుక
పడ్డవా[4]రుత్తమజనంబులు డెబ్బదియాఱుకోట్లు నిరువదివేలును ముక్కడి
మూఁక యిరువదినాలుగువేలు ముస్నూటయిరువండ్రుఁ దెగి రని చెప్పిన
నమ్మనుజపతి వీ రిందఱు నేగతికిఁ బోదు రనుటయు. 167
తే. ఎవ్వ రాత్మదేహములు సమిద్ధ మైన
యస్త్రవహ్ని వేల్చిరి వా రమరలోక

---

1 ఫలము. 2 దాఱవయేఁడగు నద్దినమున. 3 దుర్మానియట్టులు. 4 ముష్కరంబులు.

మునకుఁ జని [1]నిర్జరాంగనాజనవిలసితుఁ
డైనయమరేంద్రునకుఁ బూజ్యు లగుదు రధిప. 168

క. తఱచుగ శస్త్రాస్త్రంబులు, నెఱఁకులు దూఱినఁ జలించి నిజధైర్యంబుల్
మఱచి తెరలి చచ్చిరి కొం,దఱు గుహ్యకగతికిఁ బోవఁదగుదురు వారల్. 169

క. సమరమున నెత్తెఱంగున, సమసిననుం గీడు తెరువు చన [2]రుత్తమలో
కమునకు పోదురు జనములు, ప్రముదితు లై యంద్రు బుధులు పౌరవముఖ్యా.

క. అనిన విని నాథవంతులు, ననాథులును నైనవీరి కందఱకుఁ గృపా
ధనలోల చేయఁగా వ,చ్చున కాదే యగ్నికార్యశోభనముఁ దగన్. 171

వ. అని పలుకుటయు ధర్మనందనుం డి ట్లను నీయఖిలజనంబులు నాహితాగ్నుల యట్ల యట్లుం గాక వీర లిందఱు కుదకదహనక్రియాకరణయోగ్యులును లేరు మన మేది కొలఁదిగా నిప్పని సేయుద మని పలికి తా రజ్ఞాతవాసంబు నిర్వహించి సముచితప్రకారంబున విరాటాదులచేతం బరిజ్ఞాతు లైనసమయంబున సంగతుం డై యది మొదలుగాఁ జెల్లెడుశాంతికపౌష్టికాదిశ్రౌతస్మార్తక్రియాకలాపంబులు నడపుచుం దమయొద్ద నున్న ధౌమ్యు నాలోకించి విదురుని సంజయునిఁ గనుంగొని మీరు భరతకులులకుం దక్కనానాథవంతు లైనవారలకు విధ్యుక్తంబుగా నగ్నిసంస్కారంబు సేయుం డని పనిచి యత్తెఱంగునకుం దోడుపడుటకై సూతజనంబులను దత్కాలసమాగతు లైనకరిపురజనంబులోనం దగువారి నిరూపించి మున్న తెప్పించినచందనాగురుఖండక్షౌమవసనకస్తూరికాకుంకుమఘృతతైలప్రభృతు లగువలయువస్తువు లాధౌమ్యముఖ్యుల కొప్పించి నవా రయ్యవసరంబునం గూడికొనినబహుబ్రాహ్మణసంఘంబులతోఁ జని దుర్యోధనదుశ్శాసనకర్ణశల్యాదులకు నభిమన్యుఘటోత్కచవిరాటధృష్టకేతుప్రముఖులకును దక్కను బేరెఱుకపడునానాదేశాధీశులకుం బ్రచురకాష్ఠసంచయంబులను భగ్నరథావయవధ్వజధనుశ్శరకంతాదులను సొదలు వేర్పించి పితృమేధక్రియలు నడపి చిచ్చునం జొనిపి యనాథవంతు లైనభూకాంతుల ననేకసహస్రసంఖ్యులం బ్రోవులుగాఁ బెట్టించి సమగ్రదారుసముదయంబు లమర్చి యగ్నియిచ్చి రప్పుడు ఋగ్యజుఃపఠనరవంబులును సామగాననాదంబులును రమణీరోదనధ్వనులును రోదసీకుహరంబు నిండె ధూమంబున దిక్కులు పిక్కటిల్లెఁ జేతనభూతంబుల కెల్ల విపులవిషాదం బావహిల్లె నవ్విధంబునం దగవు నడపించి. 172

కుంతి ధర్మజునకుఁ గర్ణుండు దనకొడుకు కగుట దెలుపుట.

సీ. భూవర కురువంశపుంగవుం డగుధర్మతనయుండు ధృతరాష్ట్రు వినయ మొప్ప
మున్నిడుకొని యాఁడు మొత్తంబుఁ దోడ్కొని బంధుజనంబులు బలసి రాఁగ
నరిగి గంగాస్నాన మాచరించి తిలోదకప్రదానము సర్వకౌరవులకు

1 నిర్భరాదరంబుగ విలసితు. 2 రుమరుల్లో, కమునక.

నయ్యాంబికేయుఁడు నక్కురుభార్యలు ననుజులుఁ దానును నధికనిష్ఠఁ
తే. జేసి రతనికడకు నాసమయంబునఁ, నడలు నెమ్మనమున వదరి క్రమ్మ
కన్నునీరు మొగము గప్పంగఁ జని కుంతి, యెల్లవారు వినఁగ నిట్టు లనియె.
తరళ. వినుఁడు కౌరవకోటికిం దనవిల్లు పెట్టనికోటగా
నని యొనర్చి భవద్బలంబుల నన్నిటికి మిము నేపురం
దనిపి యంబరచారు లెల్లను దన్ను మెచ్చి నుతింపఁ బా
ర్థునిమహాస్త్రము బల్విడిం దలద్రుంపఁ గూలినకర్ణునిన్. 174
క. జను లెల్లను రాధేయుం, డనుటను మీరలును వాని నట్టులకా నె
మ్మనమునఁ దలంతు రటు గా, దనఘ మదీయాత్మజన్ముఁ డాతం డెఱుఁగన్. 175
ఆ. మీకు నగ్రజుండు నాకు భాస్కరుదయ, లలితకవచకుండలములతోడఁ
బుట్టినాఁడు గానఁ బోయంగ వలయుఁ ది,లోదకంబు లమ్మహోన్నతునకు. 176
వ. అని తదీయజన్మప్రకారంబును దివాకరుప్రసాదభావంబును జెప్పుటయు దుస్స
హంబు లగునమ్మాటలు చెవులు సూఁడిన ట్లయినఁ బాండవులు పరమదుఃఖా
వేశంబు నొంది రందు భీమాదులు నివ్వెఱపడి యుండ ధర్మనందనుండు దల్లడి
ల్లుచుం దల్లితో ని ట్లనియె. 177
సీ. అనిలజార్జునుల మార్కొన నేర్చె నెవ్వనియుత్సాహమూఁది సుయోధనుండు
వైదేహపాంచాలవసుధేశు లెవ్వనికడిమిసొంపున నరిగాఁపు లైరి
మనసైన్యకోటి యెవ్వనిబాహువీర్యసంపద కోడి యంతంత నొదుఁగుచుండు
నద్భుతం బొనరించె నమరుల కెవ్వనియసమానవివిధదివ్యాస్త్రమహిమ
తే. మమ్ము నందఱ నెవ్వనిమహితశక్తి, యెక్కుడై సంగరంబునఁ జిక్కుపఱిచె
నట్టికర్ణునిఁ గొంకున నగ్ని డాఁచి, నట్టు లెమ్మెయి డాఁచి తోయమ్మ చెపుమ.
క. అర్జునుఁ డొకరుఁడు దక్క ను,పార్జితశౌర్యమున నమ్మహాబాహుని వి
స్ఫూర్జితరథమున కెదు రై, గర్జిల్లఁగ రథికుఁ డెందుఁ గలుగునె జననీ. 179
తే. కర్ణుఁ డొలుచూలుగా నేల కంటి తల్లి, నీమమంత్రంబు పరమవిషాదకారి
యయ్యె మాకెల్ల [1]నట్టిమహాబలైక,గణ్యు బ్రుంగుడుపఱచుట కారణమున. 180
తరువోజ. భానుపుత్త్రునిచావు బంధుల నెల్లఁ బరమసంతాపంబు పాల్పడఁ జేసె
మానితబలుఁ డభిమన్యుండు పోర మడిసినప్పుడు నిట్టిమఱుకువ నాత్మ
నూనదు ద్రౌపదేయులనాశమునకు నుడుక దివ్విథమున నుల్లంబు ద్రుపద
సూనులు ధృతరాష్ట్రసుతులును ద్రుంగుచొప్పున కిమ్మెయిఁ జొర దడల్ జాల.
ఆ. అతఁడు మాకు నన్న యని మున్న [2]యెఱుఁగంగఁ
గన్నఁ గురుకులంబు గలఁగఁబడక
కుసుదు మట్టు లైన [3]మనుజలోకమునకుఁ

1 నట్టి బలశైకగణ్యుఁ, గర్ణుబ్రుంగుడు. 2 యెఱుఁగుట, గలుగునేని కులము గలఁగఁ.
3 మనుజలోకమునన.

[1]గలుగ దడలు మాకుఁ గలుగ దడలు. 182

వ. అని విలాపంబు సేసి విషాదశిథిలవర్ణంబులతో గోత్రనామంబు లుగ్గడించుచు నమ్మార్తాండనందనునకుం దిలోదకప్రదానంబు సేసెఁ దదనంతరంబ భీమార్జుననకులసహదేవులుం జేరి రట్లు కర్ణుండు పాండవాగ్రజుం డగుట యెఱింగి కురువధూజనంబు లార్తనాదంబు లెసఁగ నాక్రందించిరి ధృతరాష్ట్రుండును గాంధారీకుంతీపూర్వకంబుగా నతనికి నుదకకర్మం బాచరించె నయ్యజాతశత్రుం డాదినేశపుత్రునిగలనిసౌభ్రాత్రంబువలనఁ బరిచారికాసమేతంబుగాఁ దద్భార్యల రావించి గారవించి యతనికై యనేకవిధపుణ్యకర్మంబులు భూరిదక్షిణంబులుగా ననుష్ఠించి కృతకృత్యతానందంబునొంది సకలబంధుసహితంబుగా గంగాసముత్తరణం బాచరించె నని యిట్లఖిలజనాభినందితుండగు ధర్మనందనుండు గర్ణుం దమయన్న యని యెఱింగిన తెఱంగు వైశంపాయనుండు జనమేజయున కెఱింగించిన నజ్జనపతి కురువంశుం డగునయ్యుధిష్ఠిరువర్తనం బటమీఁద నెట్లుసెల్లె నని యడుగుటయు. 183

మందాక్రాంతము. వీణానాదప్రతిమనిగమావిర్భవత్సారపుణ్య
శ్రేణీసంపాదిత [2]విమలతాస్థేమనిర్లేపచిత్త
త్రాణక్రీడాకలనసతతోత్సాహవద్దివ్యభావా
ప్రాణాపానాహరణనిపుణప్రావణీయానుభావా. 184

క. త్వంతాహంతానిరసన, శాంతాంతఃకరణయోగిజనవిజ్ఞేయా
చింతాసాగరమగ్న, భ్రాంతజనాధ్యేయ పరమభక్తివిధేయా 185

మాలిని. భరితనియమచేతఃపద్మవిజ్ఞానకేలీ
పరిమళపరిపాకప్రౌఢసంపర్కశాలీ
పరిణతికృతదూష్యద్భంగిభూతాళిహేలా
కరణభృతిజగత్సంస్కర్తృతానందశీలా. 186

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున స్త్రీపర్వంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

శ్రీమదాంధ్రమహాభారతమునందలి స్త్రీపర్వము సమాప్తము.

1 కాదు మఱియు నెందుఁ గలదె యడలు. 2 సువిమలాశ్లేషనిర్లేపచిత్తా. 3 త్సాంక్రాంతతానంద.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1936.

# పద్యకావ్యములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అచ్చ తెనుఁగు రామాయణము | 1 | 4 |
| డిటో కాలికోబైండు | 1 | 10 |
| అధ్యాత్మరామాయణము,పద్యము | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణం | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము | 0 | 8 |
| డిటో కాలికోబైండు | 0 | 14 |
| అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారి విమర్శతో చక్కగ ముద్రితము | 2 | 8 |
| ఆముక్తమాల్యద, సటీక | 4 | 0 |
| ఆంధ్రభాగవతము, చక్కని ప్రతి | 5 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి 2-సం. | 7 | 8 |
| ఆంధ్రభారతము, 7 సంపుటములు | 14 | 0 |
| డిటో 3 సంపుటముల ప్రతి | 13 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటం | 2 | 0 |
| ఆరణ్యపర్వము ,, | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | 2 | 0 |
| శాంతిపర్వము | 2 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | 2 | 0 |
| ఆసీపంచకము, పద్యకావ్యము | 5 | 8 |
| యుద్ధపంచకము ,, | 3 | 12 |
| శాంతిసప్తకము ,, | 3 | 12 |
| ఆంధ్రభారతవిమర్శనము | 0 | 8 |
| ఆదిపర్వము, పెద్దచ్చు చిన్నసైజు | 1 | 8 |
| ఆనందరంగరాట్ఛందము | 1 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | 0 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, శ్రీజనమంచి శేషాద్రిశర్మకృతము, 3-సంపుటములు | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | 14 | 0 |
| ఆంధ్రభాషాభూషణము | 0 | 4 |
| ఆంధ్రనామసంగ్రహము వగైరా | 0 | 12 |
| డిటో కాలికోబైండు | 1 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | 0 | 12 |
| డిటో కాలికోబైండు | 1 | 2 |
| ఉత్తరరామాయణము | 2 | 0 |
| ఉత్తరహరివంశము | 1 | 8 |
| కవికర్ణరసాయనము | 1 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము | 0 | 6 |
| కళాపూర్ణోదయము | 2 | 4 |
| కాశీఖండము, క్రొత్తకూర్పు | 1 | 8 |
| డిటో కాలికోబైండు | 1 | 12 |
| కృష్ణరాయవిజయము | 0 | 8 |
| గోపీనాథరామాయణము, 2-సం | 7 | 8 |
| చాటుపద్యమణిమంజరి, 1-వభాగ. | 1 | 4 |
| చెన్నబసవపురాణము | 1 | 2 |
| గయోపాఖ్యానము, ప్రాచీనకవి | 0 | 8 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మన | 1 | 4 |
| యయాతిచరిత్రము, పొన్నగంటి తెలగనార్యప్రణీతము | 0 | 12 |
| విష్ణుపురాణము, వెన్నెలకంటి సూరనార్యప్రణీతము,లఘుటిప్పణీసహితము క్రొత్తకూర్పు | 2 | 8 |
| శేషధర్మము,శామరపల్లి తమ్మయ్య | 0 | 12 |